"త్వరగా రావాలనే బయలుదేరేనే. మధ్య దారిలో చిరంజీవి కనిపించి...."

"చిరంజీవో....శతాయుష్షో ఎవరో ఒకరు మీకు కనిపించంది ఎప్పుడులెండి....ఇటువంటిమాటలు విని విని....సరే, ఇది ఎప్పుడూ ఉండే భాగోతమే....లేవండి....లేచి కాళ్ళు కడుక్కువచ్చేస్తే ఇద్దరికి వడ్డించేస్తాను. శారద ఎప్పుడు తిని బయలుదేరిందో" అంటూ వంట ఇంటివైపు వెళుతున్న అక్కవైపు వింతగా చూసింది శారద.

అక్కనోట ఆరకమైనమాటలు. బావ ఆలస్యానికి సంజాయిషీ చెప్పుకోవడాలు ఏదో కొత్తగా కనిపించేయి

ఫరవాలేదు, అక్క స్థానబలిమి సంపాదించుకొంటున్నాది. కొత్తవేళ్ళని భూమిలోకిపంపి కాండానికి అవసరమైన బలం తెచ్చుకుంటున్నాది. ఇంక దానిజీవితానికి డోకా లేదు. ఈ మట్టిలో ఉన్న కాటికి శక్తి పీల్చుకొని, ఆ శక్తితో ఆకులు, రెమ్మలూ పెంచుకొంటూ ఆ చిన్న పరిధిలోనే తన అస్తిత్వాన్ని నిలుపుకొంటుంది. తన పెరుగుదలను తాను చూసుకొంటుంది—అనుకొంది శారద.

* * *

"లలితావాళ్ళు ఎక్కడ ఉంటున్నారో నీకు తెలుసా?" వీథిలోకి బయలుదేరుతూ అడిగింది శారద.

"సరిగా తెలియదే. పూర్వం గడ్డపువారి వీథిలో ఉండేవారు. వీళ్ళ వర్ణాంతర వివాహం సంగతి తెలుసుకొని ఆ ఇంటావిడ ఉన్నపాటున ఇల్లు ఖాళీచెయ్యమని వీళ్ళ పీకలమీద కూర్చుందిట. మొన్న వచ్చినప్పుడు బజారు పక్కసందులోకి ఎక్కడికో మారిపోయేం అంటూ చెప్పింది. ఎక్కడ, ఏమిటి అని వివరంగా నేను అడగలేదు. అయినా, ఎప్పుడో అప్పుడు అదే రావడమేకాని, నేను వెళ్ళడం అంటూ లేదుగా" అంది అనసూయ.

"సర్లే....కనుక్కోగలనేమో చూస్తాను....లేకపోతే కాస్త సేపు బజార్లో తిరిగివస్తాను" అంది శారద.

"నాకే కాదమ్మా! నాలా సంధియుగంలో మధ్యతరగతి కుటుంబాల్లో పుట్టి పెరుగుతున్న ఆడపిల్ల లెవరికీ అంత సులువుగా పెళ్లిళ్లు కావు. మీరు వేలకివేలు కట్నం పోసి మాకు పెళ్లికొడుకుల్ని కొనలేరు. మా అంతట మేము ఎంచుకుని చేసే పరిస్థితులు ఇంకా ఈ దేశంలో లేవు...."

కుమారి శారద.

శ్రీమతి ద్వివేదుల విశాలాక్షి: విశాఖ జిల్లా విజయనగరంలో జననం. అక్కడే విద్యాభ్యాసం. ఆంధ్రా మెట్రిక్ పాసయ్యారు. 1953 నుండి రచనలు చేస్తున్నారు. ఈ పరంపరలో వీరి నవలలు 'గ్రహణం విడిచింది', 'వారధి', 'హరి విల్లు', 'గోమతి', కథల సంపుటి 'భావబంధం' వెలువడ్డాయి. 'ఆదాన్ ప్రదాన్' ప్రణాళిక క్రింద వీరి 'వారధి' నవలను వివిధ భారతీయ భాషలలోకి అనువదించి ప్రచురించడానికి నేషనల్ బుక్ ట్రస్ట్ వారు ఎన్నుకున్నారు.

# 1

ఆ రోజు చింతగింజల ఆటలో చిత్తుగా ఓడిపోయింది శారద.
కచ్చడాలు, గుర్రాలు, ఏనుగులు ఒకటొకటిగా తరలిపోయి ఎదుటి బలగంతో చేరిపోయేసరికి ఆ పిల్లకి కళ్ళనీళ్ళపర్యంతం అయింది. చింతగింజల ఆటతో ఓటమి శారదకి బాగా అలవాటే; కాని, ఎంతో ఆశతో తప్పక గెలుస్తానని అనుకొని ఆటలో చెయ్యి పెట్టిన ఆ రోజుకూడా అలా చిత్తుగా ఓడిపోవడంతో, అనుకోని ఆ దెబ్బకి తట్టుకోలేకపోయింది. కమల, రాధ, కాంతం-ఒకరి తరవాత ఒకరుగా చింతగింజల్ని చిటుకు చిటుకుమంటూ అలా నొల్లుకుపోతుంటే, వేడినీళ్ళుపోసిన రాళ్ళసున్నంలా ఉడికిపోయింది ఆ పిల్ల మనసు—"నే నింక ఆడను" అక్కసుగా ఆటని మధ్యలో కలిపేసి లేచిపోయింది.

శారద చేసినపని మిగిలిన పిల్లలకి కోపం తెప్పించింది. తనకి ఆడాలని లేకపోతే తను మానేయవచ్చుగా—అనవసరంగా మధ్యలో ఆట కలిపేయడ మెందుకు? ఆ కోపంతో శారదని ఏడిపించడానికి సిద్ధపడ్డారు వాళ్ళు.

పుస్తకాల సంచి భుజానికి తగుల్చుకొని, నుదుటిమీద పడుతున్న జుట్టుని ఒకచేత్తో పైకి తోసుకొంటూ వెనుతిరిగి చూడకుండా వెళ్ళిపోతున్న శారద వెంటపడి, "ఉడుకుమోతు—ఉల్లిగడ్డ; కంట్లో పడితే—కళ్ళు మంట" అంటూ కేకలువెయ్యడం మొదలుపెట్టేరు.

ఆ వీధికి చివరలో ఉన్న తమ ఇల్లు చేరేవరకు వెనుతిరిగి చూడకుండా అలా పరుగుతీసిన శారద ఇంటిగుమ్మం ఎక్కి, అల సటచే చేబోస్తూ, "అలా చూస్తూ ఉండండి. రేపు మీ అందర్నీ ఓడించి, మీ ఏనుగులు, గుర్రాలు, కచ్చడాలు—అన్నీ తీసుకోకపోతే నా పేరు శారద కాదు. తెలిసిందా?" అని గట్టిగా అరిచి ఇంటిలోకి పరుగు పెట్టింది.

కిందపడ్డా మీదిదాన్నే అనే రకం శారద. ఓటమిని అంత సులువుగా ఒప్పుకొని తలవంచే తత్త్వంకాదు ఆ పిల్లది. ఏనాడూ ఆ ఆటలో వాళ్ళదగ్గర గెలవలేకపోయినా, ఏదో నాడు చింతగింజ లాటలో వాళ్ళందర్నీ సమూలంగా తుడిచిపెట్టగలదని ఆ పిల్ల నమ్మకం. ఎక్కడో దాగిఉన్న రేపులో ఆ పిల్లకి ఎన్నో ఆశలు కనిపిస్తాయి. రేపులోని తీపిని తలుచుకొంటూ ఈనాటి చేదును కళ్ళు మూసుకొని మింగడం శారదకి పుట్టుకతోవచ్చిన గుణం.

రేపు క్లాసులో తనకి మంచిమార్కులు వస్తాయి.

రేపు చింతగింజలాటలో తను తప్పక గెలుస్తుంది.

రేపు నాన్న సినిమాకి తీసుకువెళతాడు. అమ్మ మంచిబట్టలు కుట్టిస్తుంది.

ఇన్ని గొప్పపనులు జరుగుతాయని ఆశలుచూపే రేపంటే శారదకి ఎంతో ఇష్టం, మరెంతో నమ్మకం.

కోపంతో కందిన ముఖం, రేగిన జుట్టు, అలసటతో చేబోస్తూ, చెంపలవెంట చెమట కారుతుండగా అలా విసురుగా లోపలికి వచ్చిన కూతుర్ని తీక్ష్ణంగాచూస్తూ, 'శారదా!' అంది అన్నపూర్ణ.

తల్లిచూపు శారద కాళ్ళకి బంధం వేసింది. ఇంకొక్క అడుగు ముందుకు పడలేదు. ఏదో కొత్తచోటుకి వచ్చినట్లు తెల్లబోయి చూస్తూ అలా నిలిచిపోయింది.

చావిడినిండా చిన్నా, పెద్దా పదిమంది మనుషులు ఉన్నారు. కొందరు కుర్చీలమీదా, మరికొందరు చాపమీదా కూర్చుని ఉన్నారు. అంతా కొత్తవాళ్ళే. నాన్నా, అమ్మా వాళ్ళతో నవ్వుతూ సరదాగా

మాట్లాడుతున్నారు. నాన్న జరీ అంచు పంచ కట్టుకొన్నారు. అమ్మ ఎర్ర పట్టుచీర కట్టుకొంది. "ఏమయింది ?....తమ ఇంట్లో ఈ రోజు ఏమయింది ? వీళ్ళంతా తమఇంటికి ఎందు కొచ్చేరు ?"

శారద రెప్ప వెయ్యకుండా అక్కడ కూర్చున్నవాళ్ళని వింతగా చూస్తూ, బొమ్మలా నిలిచిపోయింది. కూతురు తెల్లముఖం వేసుకొని అందర్నీచూస్తూ అక్కడ నిలిచిపోవడం అన్నపూర్ణకి కోపం తెప్పించింది.

''ఏమి టా అవతారం ? పెరట్లోకిపోయి ముఖం కడుక్కురా'' అంది అదిలిస్తూ.

''ఎవ రేమిటి ఈ పిల్ల ?'' చాపమీద కూర్చున్న లావుపాటి ఆవిడ ప్రశ్నించింది.

"మా మూడో అమ్మాయి'' అంది అన్నపూర్ణ, 'ఇంకా అక్కడే ఉన్నావా' అన్నట్లు కూతురివంక చూస్తూ.

''అలాగా ! అక్కచెల్లెళ్ళకి అంతగా పోలికలు లేవు. అందు కని....''

''అనసూయ నా పోలిక. శారద వాళ్ళ నాన్నలా ఉంటుంది."

వరండా చివరిదాకా వెళ్ళి వెనుదిరిగి చూసింది శారద. చావిట్లో జంబుకానామీద కూర్చున్న అక్క కనిపించింది. అసలే అందంగా ఉండే అనసూయ ఆ రోజు ఇంకా బాగుంది. రోజులా పరికిణీ, ఓణీ వేసుకోక, ఆరోజు తల్లి కంచి పట్టుచీర కట్టింది. బారైన జడలో పచ్చ కనకాంబరం పువ్వులు మాలగా కట్టి పెట్టుకొంది. కళ్ళకి కాటుక, నుదుటిమీద దోసగింజ ఆకారంతో బొట్టు, మెడలో ఒంటిపేట గొలుసు, చేతులకి బంగారు గాజుల మధ్యగా మెరుస్తున్న ఎర్రరంగు గాజు గాజులు....తల కొద్దిగా వంచుకొని, కుర్చీమీద కూర్చున్న అబ్బాయివైపు దొంగచూపులు చూస్తున్నాది. చావిట్లో పెద్దలమధ్య జరుగుతున్నమాటల్ని విననట్టు నటిస్తూనే శ్రద్ధగా వింటున్నాది.

వరండాలో గోడకున్న అద్దంలో తనరూపు చూసుకొంది శారద. తను అక్కడ అలా అందరిముందు నిలబడితే తల్లి ఎందుకు తరిమికొట్టిందో అర్థమయింది.

నేల కాలు మోపనట్లు పెరట్లోకి పరుగుతీసింది. అక్కడ నూతిగట్టున ఉన్న సబ్బుబిళ్ళ సగం అరిగిపోయేలా—అప్పలమ్మ అంట్ల గిన్నెల్ని తోమినట్లు—ముఖాన్ని బరబర తోమి పారేసింది. చేతికి అందినగుడ్డతో ముఖం తుడుచుకొని, పక్క గదిలోకి పరుగు తీసింది. అక్కడ అద్దమైతే లేదుకాని, అక్క పదిలంగా దాచుకున్న పౌడరుడబ్బా ఉంది. చేతిలోకి ఇంత పౌడరు ఒంపుకొని ముఖానికి బాగా పట్టించింది. పక్కగాఉన్న పన్నెతో జుట్టు ఇటు అటు పోగు చేసి 'ముస్తాబు అయిపోయింది' అన్న ధీమాతో చావిట్లోకి తిరిగి వచ్చింది.

ఒక్కసారి అక్కడ ఉన్న అందరిదృష్టి శారదవైపు తిరిగింది. ఆ లావుపాటి ఆవిడ పక్కగా కూర్చున్న చిన్నపిల్ల రమారమి శారద ఈడుదే—నవ్వు ఆపుకోలేక కిసుక్కున నవ్వేసింది.

ఎవరో తెలియని ఆ పిల్లమీద శారదకి చాలా కోపం వచ్చింది. తన్నుచూసి అలా నవ్వినందుకు. నాలిక వెళ్ళబెట్టి వెక్కిరించి బదులు తీర్చుకోవా లనుకొంది. కాని, తల్లి తనవంకే చూస్తున్నాది. ఇంటికి వచ్చిన పిల్లని అలా వెక్కిరించకూడదని కోప్పడుతుందని ఊరు కొంది.

అన్నపూర్ణ కూతుర్ని ఆప్యాయంగా దగ్గరికి లాక్కొంటూ, "పిచ్చిమొద్దూ! అద్దం కనిపించలేదా?" అంది. శారద ముఖానికి బూడిదలా పులుముకొన్న పౌడరుని చేతిగుడ్డతో తుడిచి సరిచేస్తూ.

ఆ లావుపాటి ఆవిడకు పక్కగా కూర్చున్న అమ్మాయి తనని చూసి ఎందుకు నవ్విందో అర్థమయ్యేసరికి శారద మనసు మరీ ఉడికి పోయింది. ఛీ....ఛీ! వరండాలో అద్దం ఉంది కదా? అక్కడ చూసుకు రావలసింది—అనుకొంది.

"ఫరవాలేదు. కాస్త చాయ తక్కువైనా కళయిన ముఖమే" అంది లావుపాటి ఆవిడ.

"తండ్రిని పోలిన ఆడపిల్లలు అదృష్టవంతు లవుతారుట" అంది ఆవిడ పక్కగా కూర్చున్న ఎత్తు పళ్ళావిడ.

శారద లావుపాటి ఆవిడ పక్కగా కూర్చున్న అమ్మాయివైపు చూసింది. ఆ పిల్ల ఎంతో బాగుంది. సిల్కు పరికిణీ కట్టుకొంది. చెమ్కీపువ్వుల జాకెట్టు తొడుక్కొంది. చెవులకి రింగులు ఉన్నాయి. జుట్టుని రెండుపాయలుగాచేసి, మొదట్లో చెమ్కీ రిబ్బనుతో పువ్వులా కట్టుకొంది. నుదుటిమీద నిలువుగా తిలకం. కళ్ళకి సన్నగా కాటుక. ఆ పిల్ల నవ్వుతుంటే ఏవో పక్షులు కూసినట్లు ఉంది.

అంచక్కా నేనూ ఆ పిల్లలా ఉంటే? క్షణంపాటు శారద మనసులో ఆశ రెపరెప లాడింది. అంతకిపూర్వం అద్దంలో చూసుకొన్న తనరూపు గుర్తుకివచ్చి మళ్ళీ అంతలోనే దిగులు పుట్టుకొచ్చింది. 'నేనేం బాగుండను—నల్లగా చందనపు బొమ్మలా' అనుకొంది శారద నిరాశగా.

అంతలోనే తల్లి తరుచు అంటూండేమాట గుర్తుకి వచ్చింది- ''పెద్దదానివైతే నువ్వూ బాగుంటావు'' అని. 'వేగిరం పెద్దదాన్ని అయిపోవాలి. అక్కలా అందంగా అయిపోవాలి'. శారద మనసులోనే అనుకొంది ఆ మాటని.

పెద్దది కావాలంటే బుద్ధిగా ఉండాలి. శ్రద్ధగా చదువుకోవాలి, క్లాసులో మంచిమార్కులు తెచ్చుకోవాలి. అక్క ఎన్నోసార్లు చెప్పింది ఈ మాటలు. అందుకు ఎంత కష్టపడవలసివచ్చినా, తను వేగిరం పెద్దది అయిపోవడానికే నిశ్చయించుకొంది శారద. అక్కలా అందంగా అయిపోవాలనికూడా తీర్మానించుకొంది. ఈ నిశ్చయానికి వచ్చిన వెంటనే అక్కడినుంచి లేచి, ముందుగదిలోకి వెళ్ళిపోయింది. బుద్ధిగా చిన్నపిల్లలా పలకా, పుస్తకాలూ ముందువేసుకొని టీచరు ఇచ్చిన హోమ్‌వర్క్ చెయ్యడానికి మొదలుపెట్టింది.

శారద అక్షరాలు బాగుండవు. వరసలు తిన్నగా రావు. ''కోడి కెక్కరించినట్లు ఏమి టీ రాత'' అని రోజూ క్లాసులో టీచరు తిడుతుంటుంది. ఆ రోజు పట్టి, పట్టి రాయటం మొదలుపెట్టింది శారద. మరునాడు క్లాసులో టీచరు తన పలకనిచూసి, 'చూసేరా, శారద ఎంత బాగా రాసిందో' అని మెచ్చుకోవాలి. ఈరోజు పున్నమ్మ చూసినట్లే తనూ అందరివంకా గర్వంగా చూడచ్చు. ''ఏమను

కున్నారో ... కావాలంటే నేను మీకన్న ఎంతో బాగా రాయగలను' అని అందర్నీ సవాల్ చెయ్యొచ్చు.

రోజూ టీచరు పలకమీద సుద్దముక్కతో మార్కులు వేస్తుంది. దాన్ని చెరిగిపోకుండా ఇంటికి తీసుకొచ్చి నాన్నకి చూపించాలి. నాన్న ఎంతో సంతోషిస్తారు. 'మా శారద బుద్ధిశాలి తల్లి' అంటుంది అమ్మ. బాగా చదువుకొంటే మంచి కథ చెబుతానంది అనసూయక్క. అక్క అత్తయ్యవాళ్ళ అరవిందలా చదువుకోలేదుట. అయినా, అక్కకి బోలెడన్ని కథలు వచ్చు. రేపు తనకి వచ్చినమార్కులు చూపిస్తే ఎంతో మంచి కథలు చెపుతుంది. రాజకుమారులు, రాక్షసులు—ఆ కథలంటే తన కెంతో ఇష్టం. పెద్దపెద్ద రాక్షసుల్ని రాజకుమారుడు కత్తితో ఫటాఫట్ నరికి చంపేస్తాడు. అంచక్కా తనకీ అటువంటి కత్తి ఒకటి ఉంటే, ఈ కమలని, కాంతాన్ని, రాధని .. అమ్మో! మనుషుల్ని చంపకూడదుట. పోలీసువాళ్ళు తీసుకుపోయి ఖైదులో పెట్టేస్తారుట. బ్రహ్మరాక్షసులు మనుషులు కారు. అందుకే వాళ్ళని చంపిన రాజకుమారుణ్ణి ఏనుగుమీద ఎక్కించి ఊరేగిస్తారు. కాంతం అక్క పెళ్ళయితే పల్లకిని ఏనుగులా చేసి, దానికి తొండం అదీ పెట్టి దానిమీద ఊరేగించేరు. కాంతం వాళ్ళక్కపక్కన అందులో కూర్చుని, తను పిలుస్తే పలకనే పలకలేదు. అనసూయక్క పెళ్ళయితే తనూ ఎక్కుతుంది పల్లకి మహాగొప్ప కాంతానికి ఒక్కదానికే నేమిటి అక్క ఉంది! తనకీ ఉన్నారు రాజ్యం అక్క, అనసూయక్క. రాజ్యం అక్క పెళ్ళి అప్పుడెప్పుడో అయిపోయిందిట. అప్పుడు తనింకా చిన్నపిల్ల. ఇప్పుడైతే తనింత పెద్దది అయిపోయింది. తనని తప్పకుండా పల్లకి ఎక్కనిస్తారు.

శారద మనసులో ఆలోచనలు పచ్చిక బయలులో లేడిపిల్లలా పరుగులు పెడుతుంటే, చేతిలో పలకపుల్ల తనకి తోచినట్లు పాఠం గిలకసాగింది. అలా కొంతసేపు వ్రాసేక, తనెన్నో ఆశలు పెట్టుకొన్న ఆ పాఠంవైపు చూసింది శారద. అక్షరం పోలిక, పంక్తుల వివరం లేకుండా తోటకూర పప్పులా తయారయింది ఆ వ్రాత.

ఇదేమిటి ఇలాగయింది—అన్నట్లు తను అంతవరకు వ్రాసిన చూచివ్రాతవైపు వింతగా చూసింది శారద. సగానికిపైగా అక్షరాలు ఆ పిల్లకే అర్థం కాకుండాపోయేయి. ఇంక టీచరు కేం తెలుస్తాయి? ఇలా చూపిస్తే మెచ్చి, మార్కులు వెయ్యడంమాట అటుంచి తల వాచేటట్లు మొట్టికాయలు మొడుతుంది టీచరు.

తను ఇంతసేపు పడ్డ శ్రమంతా అలా వృథా పోయినందుకు శారదకు బాధ కలిగింది. ఆ విసుగుతో పలకమీద థూ, థూ అని రెండుసార్లు ఉమ్మి పరికిణీ కుచ్చెళ్ళతో తుడిచివేసింది.

''అలా ఉమ్మితో పలక తుడవకూడదు.''

శారద వెనుతిరిగి చూసింది, అలా అన్నది ఎవరా అని. ఇందాక తన్నుచూసి నవ్వినపిల్ల అక్కడ ఉంది.

''ఇక్కడి కెందు కొచ్చేవు?'' కోపంతో ముఖం చిట్లిస్తూ అడిగింది శారద.

''మరేం ....మరేం....మీ అమ్మగారు—అలా లోపలికెళ్ళి మా శారదతో ఆడుకో అన్నారు.''

ఎవరో ముక్కు మొగం తెలియని పిల్లని తల్లి అలా తన మీదికి పంపడం శారదకి సుతరామూ ఇష్టం లేదు. అయినా అమ్మ ఆడుకోమంది కాబట్టి, ఆ పిల్లని పలకరించి మాట్లాడవలసిన విధి తనపై ఉన్నట్లు భావించింది.

''అసలు నువ్వు మా ఇంటికి ఎందుకొచ్చేవు?'' అది తెలుసు కోవాలనే కుతూహలంతో అడిగిన ప్రశ్న అయినా, శారద నోట్లోంచి దురుసుగానే వచ్చింది.

''మరేం....మరేం....మా అన్నయ్యకి పెళ్ళిట.''

''అయితే....పెళ్ళయితే?'' మా ఇంటికి ఎందుకు రావడం అన్నట్లు చూసింది శారద.

శారద ప్రశ్నకి జవాబుగా ఏం చెప్పాలో అర్థంకాక తికమక పడ్డ ఆ పిల్ల, చివరికి తల్లీ, పెత్తల్లీ వాళ్ళూ అనుకొంటున్న మాటలు గుర్తుకి తెచ్చుకొని, ''మీ అక్కని చూడానికి'' అంది.

శారద కొంచెంసేపు ఆలోచిస్తున్నదానిలా అలా ఉండిపోయి, "నీ పేరేమిటి?" అని ప్రశ్నించింది. తన ప్రశ్నకి ఆ పిల్ల జవాబు చెప్పేలోపునే, "నా పేరు శారద" అంది.

"నా పేరు లలిత" అంది ఆ పిల్ల ఉత్సాహంగా.

సాధారణంగా చిన్నపిల్లల్లో పేర్లు చెప్పేసుకొంటే స్నేహం కుదిరిపోయినట్లే. అంతకు రెండు నిమిషాలకిందట 'ఇక్కడి కెందు కొచ్చేవు' అని కోపంగా విసుక్కొన్న శారద, అలా తనపేరు అడగడంతో తమ ఇద్దరిమధ్య జట్టు కుదిరిపోయినట్లే భావించింది లలిత.

"అయితే, లలితా, మీ అన్నకి పెళ్ళయితే మా అక్కని చూద్దం ఎందుకూ?" అంది శారద తను ఆలోచిస్తూ, నువ్వూ ఆలోచించు అన్న ధోరణిలో.

"ఏమో మరి... దొడ్డమ్మని అడిగి రానా?"

లలిత లేవబోతుంటే ఆ ఎత్తుపళ్ళావిడ, "లలితా" అని పిలుస్తూ అక్కడికి వచ్చింది. నేను వెళ్ళిపోతున్నాను—అన్నట్లు శారదవంక చూపి చిన్నగా నవ్వి తల్లి వెనకగా వెళ్ళిపోయింది లలిత.

మళ్ళా ఎప్పుడొస్తావు?-లలిత వెళ్ళిపోతుంటే అడగాలనుకొన్న ప్రశ్న శారద నోట్లోనే ఉండిపోయింది. లలిత మళ్ళా ఎందుకొస్తుంది? మా చుట్టాలేం కారుగా—అని తన ప్రశ్నకి తనే జవాబు చెప్పుకొంది.

మొదట ఆ పిల్ల అలా చొరవగా తనదగ్గరికివస్తే చీదరించుకొన్న శారద, నిండా అయిదునిమిషాలు గడవకుండానే, అంచక్కా లలిత ఇక్కడే ఉండిపోతే బాగుండును, ఇద్దరం జతగా ఆడుకొనేవారిమి—అనుకొంది.

చిన్నపిల్లల్లో ఉండే ప్రత్యేకతే అది. వారు కోపాన్ని, ద్వేషాన్ని అట్టేకాలం మనసులో పట్టి ఉంచలేరు. అభిమానాన్ని, ఆప్యాయతని అంత త్వరగా మరిచిపోనూ లేరు.

శారద పలకా పుస్తకాలూ సంచిలో సర్దుకొని, గదిలోంచి బయటికి వచ్చేసరికి అన్నపూర్ణ అతిథులు ఖాళీచేసిపోయిన కప్పులు,

ప్లేట్లు కడుగుతున్నాది. అనసూయ తను కట్టుకొన్న పట్టుచీర విడిచేసి దానిని పొందిగ్గా మడత పెడుతున్నాది.

శారద మెల్లగా అక్కదగ్గరికి చేరుకొంది. ఆ పిల్ల మనసులో వచ్చిపడ్డ సందేహం జవాబు దొరకందే శాంతించనని గొలుకు తున్నాది. అక్క చేస్తున్నపనిని చూస్తూ, "అక్కా, లలితావాళ్ళ అన్నయ్యకి పెళ్ళయితే నిన్ను చూడ్డం దేనికే?" అంటూ ప్రశ్నిం చింది.

"ఛీ....పిచ్చిమొద్దూ! నీ కెప్పుడూ ఇలాటి సందేహాలే....ఫో అవతలకి" అంది అనసూయ, రానికోపాన్ని తెచ్చుకోవడానికి ప్రయ త్నిస్తూ.

ఆ కోపంలో అక్క ఇంకా అందంగా కనిపించింది శారదకి. ముచ్చటతో అనసూయ మెడ పట్టుకొని ఊగుతూ, "అక్కా.... అక్కా....చెప్పవు కదుటే" అంది గోముగా.

"అదేం చెపుతుందే ...ఇలా రా, నే చెబుతాను" అంది అన్నపూర్ణ, కడిగినపాత్రల్ని గూట్లో సర్దుతూ.

అంతలో వచ్చినవారిని అంపకం పెట్టడానికి వీథి చివరిదాకా వెళ్ళిన రామస్వామి తిరిగి వచ్చేడు. చేతిలో పనివదిలి, ఆత్రంగా భర్త దగ్గరికివచ్చి, "ఏమన్నా రేమిటి?" అంది అన్నపూర్ణ.

"ఇంటికి వెళ్ళేక ఉత్తరం వ్రాస్తామన్నారు." పై మీది జరీ ఓణీని గోడకున్న ఒంకెకి తగులుస్తూ అన్నాడు రామస్వామి.

ఆ మాటకి అర్థం ఏమిటో ఆడపిల్లల్ని కన్న అమ్మలకి, అయ్య లకి తెలిసిందే.

మీ రిస్తామన్న కట్నం మాకు చాలదు.

మీ పిల్ల మాకు నచ్చలేదు.

మా మీద ఆశ పెట్టుకోక మీరు నిరభ్యంతరంగా ఇంకో సంబంధం చూసుకోవచ్చు. ఇటువంటివే ఇంకెన్నయినా అర్థా లుంటాయి ఆ మాటకి. కాని, 'ఆశ' అనే దానిప్రాణం చాలా గట్టిది. అందుకే ఒక అంతట అది చావదు. ఏమో—అమ్మాయి అదృష్టం

అనుకొంటారు ఇంట్లోవాళ్ళు.

వరమీయ వేంచేసే వేల్పులాంటి పోస్టు బంట్రోతు రాకకోసం, అతడు అందివ్వనున్న శుభవార్తకోసం రోజు వెనక రోజుగా ఆత్రంగా అలా ఎదురు చూస్తుంటారు. ఆ ఎదురుచూడ్డం ఎంతకాలం? అటు నుంచి ఆ చావుకబురు చల్లగా చేరేవరకు. ఆ కాస్త అందిపోగానే 'రెడ్డొచ్చె మొదలాడు' అన్నట్లు మళ్ళా మొదటికి వస్తుంది కథ.

* * *

అన్నపూర్ణ, రామస్వామి అటువంటి చంపుకోలేని ఆశతోనే ఎదురుచూసేరు, రావలసిన ఆ ఉత్తరంకోసం. వస్తుందని ఎదురు చూస్తున్న ఉత్తరం రాకుండానే, తెల్లవారినరోజు రాత్రికి దారి తీస్తుంటే, కొన ఊపిరిలా నిలిచిఉన్న ఆ కాస్త ఆశా హరించి పోతుంటే, 'ఛీ! మంచీ, మర్యాదా లేని మనుష్యులు. ఈపాటిదానికి ఉత్తరం రాస్తామని చెప్పడం ఎందుకు?'—అని ఆ దంపతుల మనసులు చికాకుపడుతుంటే, అప్పుడు వచ్చింది అన్నిరోజులుగా ఎదురు చూపిన ఆ ఉత్తరం.

కవరు చించి, కాగితం పైకితీసి భర్త ఉత్తరం చదువుతుంటే- "ఏమిటి రాసేరు?" అని ప్రశ్నించింది అన్నపూర్ణ.

అందులో ఏముందో అది చదువుతున్న భర్తముఖం చూస్తుంటేనే తెలిసిపోతున్నాది ఆ ఇల్లాలికి. అయినా, ఆ మాట అతనినోట వింటేకాని నిర్ధారణగా అనుకోలేక ప్రశ్నించింది.

"ఏముంది....మామూలే." ఉత్తరం భార్యచేతికి అందిస్తూ నిరుత్సాహంగా అన్నాడు రామస్వామి.

"నా చెయ్యి బాగులేదు." పిల్లలకి సగం వడ్డనచేస్తూ, వీధి గుమ్మంలో పోస్టు బంట్రోతు కేకవిని ఆత్రంగా అంటుచేత్తో అలాగే వచ్చేసింది అన్నపూర్ణ.

"పిల్లని చూసేక, వాళ్ళబ్బాయికి ఈడు తగదనిపించిందిట."

"అదేమిటి? మూడేళ్ళకిపైగా వయసులో తేడా ఉంటే...."

"అదో సాకు లెద్దూ.... అసలువిషయం—అనకాపల్లి నుంచి ఎవరో నాలుగువేలు కట్నం ఇస్తామంటూ వచ్చేరుట."

"ఆమాట కూడా ఇందులో రాసేరా?"

"వీళ్ళు రాయలేదు. నిన్న బజార్లో ఈ సంబంధం ఉందని చెప్పిన వీరభద్రం కనిపించి చెప్పేడు. 'అయినా, వాళ్ళకి పిల్ల అందంగా ఉందని మన సంబంధంమీద ఇంకా మోజు పోలేదుట. మీరు మూడు అంటే ఏదోవిధంగా నేను సెటిల్ చేస్తాను' అన్నాడు."

"మీ రేమన్నారు?"

"ఇంకా వీళ్ళదగ్గరినుంచి ఉత్తరం రాలేదుగా—ఆలోచించి చెపుతా నన్నాను."

"ఇప్పు డేం చెయ్యడం? ఉన్నది అంతా ఈ పిల్లకే తుడిచి పెడితే ఇంక మిగిలినవాళ్ళ సంగతో?"

"అదే నేనూ ఆలోచిస్తున్నాను." చావిట్లో తలవంచి పచార్లు చెయ్యడం మొదలుపెట్టేడు రామస్వామి. భర్తని అతడి ఆలోచనకి వదిలి, వంటఇంట్లో ఆవురావురుమంటూ ఆకలి మేస్తున్న పిల్లల కడుపులు చల్లబరచటానికి అటు కాలు కదిపింది అన్నపూర్ణ.

పోస్టువాడి కేకవిని తల్లి అలా బయటికి వెళ్ళగానే, తను విస్తరిముందునుంచి లేచి వడ్డన పూర్తిచేసింది అనసూయ. అమ్మా నాన్నల సంభాషణ తిండిగొడవలో ఉన్న పిల్లలచెవుల్లో పడక పోయినా, రానున్న ఆవార్తకోసం తలిదండ్రులకన్న మిన్నగా ఎదురు చూస్తున్న అనసూయ వినకపోలేదు. అయినా, తల్లి తిరిగివచ్చేక ఆమెని ఏమీ ప్రశ్నించలేదు.

'ఉత్తరం ఎక్కడినుండి' అని కూతురు కాని అడిగితే చెప్పా లనుకొంది అన్నపూర్ణ. అనసూయ ప్రశ్నించకపోవడంతో, ఇంకా తమలో తామే ఒక నిర్ణయానికి రాలేదు. చిన్నపిల్ల—దానితో చెప్ప డంలో ఏముంది అని ఊరుకొంది.

రామస్వామి అన్నపూర్ణలా అనుకోలేదు. వయసువచ్చిన పిల్ల, అనసూయ ఇష్టాయిష్టాలనుంచే ఆలోచన ప్రారంభం కావాలను కొన్నాడు. కూతురికి ఆ పిల్లడు నచ్చినట్లయితే అప్పో సప్పో చేసి.

పిల్లకు అడిగినకట్నం ఇచ్చి ఆ మూడుముళ్లూ వెయించాలనుకొన్నాడు. ఆ విషయం అనసూయని అడిగి తెలుసుకోవాలనే అభిప్రాయంతో భార్య వెనకగా తనూ భోజనాలగదిలోకి వచ్చేడు.

అప్పటికి మిగిలినవాళ్ళ భోజనాలు అయిపోయాయి. అనసూయ తల్లికి పీట, కంచం పెట్టి, గ్లాసులో నీళ్ళు తెచ్చి పక్కన పెట్టింది. అన్నపూర్ణ వంటఇంట్లోంచి వంటగిన్నెలు తెచ్చుకొని ముందు పెట్టుకొని పీటమీద కూర్చుంది.

"అమ్మ చెప్పిందా?" అన్నాడు రామస్వామి ఇంకేవిధమైన ఉపోద్ఘాతం లేకుండా.

"ఏమిటి, నాన్నా?" అంది అనసూయ. తండ్రి అడుగుతున్న విషయం ఏమిటో తెలుస్తున్నా తెలియనట్లు.

"అదేనమ్మా....వాళ్ళదగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. మూడు వేలు కట్నం ఇస్తే చేసుకొంటారుట."

అనసూయ మాట్లాడలేదు. 'అలాగా' అన్నట్లు ఒకసారి తండ్రి వంకచూసి, నేతిగిన్నె చేతిలోకి తీసుకొంది తల్లికి వడ్డన చెయ్యడానికి.

"అన్నీ మనం అనుకొన్నట్లే అవాలంటే కుదరదు. పిల్లడు నీకు నచ్చాడంటే ఈ సంబంధం ఖాయపరుస్తాను."

ఈసారీ అనసూయ ఏం మాట్లాడలేదు. ఆ మౌనానికి అవుననో, కాదనో-ఎలా అర్థం చెప్పుకోవాలో బోధపడలేదు రామస్వామికి. కూతురు తనతో చెప్పడానికి సిగ్గుపడుతున్న దనుకొని, "నేను ముందుగదిలో ఉంటాను. దాన్ని అడిగి తెలుసుకొని నాతో చెప్పు" అన్నాడు భార్యతో.

"నా మొహం....అదేం చెపుతుంది? మంచో చెడ్డో మనమే చూడాలి కాని" అంది అన్నపూర్ణ, పులుసులో ములక్కాడని అటు ఇటు తిప్పి పిప్పికట్టేలా నములుతూ.

"అది సరే అనుకో....కాని, కాపురం చెయ్యవలసిన పిల్ల అది కదా?"

"ఏమే....ఏమంటావు?" కూతురివంక చూస్తూ అడిగింది అన్నపూర్ణ.

అనసూయ ఏమీ అనలేదు. ఈ రోజు పెళ్ళివిషయంలోనే కాదు, అసలు ఏవిషయంలోనూ 'నా ఇష్టం ఇదీ' అని అనగలిగే వాతావరణంలో పెరగలేదు ఆ పిల్ల. కట్టుకొనే బట్టకి, తినే తిండికికూడా ఒక ఇష్టం అంటూ ఏనాడూ ఏర్పరుచుకోలేదు. అమ్మ ఏది పెడితే అది తింది. నాన్న ఏదితెస్తే అది కట్టుకొంది. అటువంటి పిల్ల ఈనాడు జీవితంలో అతి ముఖ్యమైన వివాహంవిషయంలో తల్లీ, తండ్రీ ఎదుట నిలిచి 'నీ ఇష్టం ఏమిటే' అని నిలదీస్తుంటే ఏం చెప్పగలదు?

"ఏదో ఒకటి నోరువిప్పి చెప్పు. చెప్పకపోతే ఎలా తెలుస్తుంది?" అన్నపూర్ణ రెట్టించింది.

అనసూయ అవుననో, కాదనో బుర్ర ఆడించింది.

"అదిగో....దానికి ఇష్టమేనట....ఇంక చూసుకోవలసింది మీ శక్తే" అంది అన్నపూర్ణ. కూతురి ఆ బుర్రాడింపుకి అర్థం వివరిస్తూ.

"సరే....ఇక్కడ నీపని పూర్తిచేసుకొని ఓసారి వీధి గదిలోకి రా" అని భార్యతోచెప్పి అక్కడినుండి వెళ్ళిపోయేడు రామస్వామి.

* * *

'ఇల్లు కట్టిచూడు, పెళ్ళి చేసిచూడు" అన్నారు పెద్దలు.

ఈ రెండుపనుల్లో ముందు వేసుకొన్న అంచనాలు ఎందుకూ కొరగాకుండా పోతాయనీ, 'పది' అని పనిలో చెయ్యిపెడితే అదనంగా మరో పది పెట్టందే అనుకొన్నది అనుకొన్నట్లు పూర్తికాదనీ దాని భావం.

మూడువేలు కట్నానికిపోతే, మరో పదిహేనువందలు పెళ్ళి ఖర్చుకి సరిపోక పోతుందా—అనుకొన్నాడు రామస్వామి. 'సరిపోదు' అని తేల్చి చెప్పింది అనసూయ పెళ్ళి. అన్నీ పూర్తిఅయి వియ్యాలవారిని అంపకం పెట్టేసరికి కట్నంతోకలిపి రమారమి ఆరువేలదాకా దేకిపోయింది. పుట్టి పెరిగిన ఊరూ, పరువుగా బ్రతుకుతున్న సంసారం

కాబట్టి అప్పటికప్పుడు హెచ్చువడ్డీకయినా అనగానే సొమ్ము పుట్టింది. ఆ ఇంటి పరువుప్రతిష్ఠలు నడిరోడ్డున పడకుండా నిలిచేయి.

రామస్వామి తాతలనాడు తా మింత తిని ఒకరి కింత పెట్టగలిగే సంపన్నకుటుంబం వారిది. అయిదుగురు ఆడపిల్లలకి ఆడంబరంగా, కట్న కానుకలతో పెళ్ళిళ్ళుచేసి, ముగ్గురు కొడుకులకు చదువులు చెప్పించి తాత ఈ లోకంనుంచి తరలి వెళ్ళేసరికి పేరు గొప్ప, ఊరు దిబ్బ అన్నట్లు తయారయింది ఆ సంసారం.

తండ్రి మరణానంతరం ముగ్గురు కొడుకులు మిగిలిన ఆస్తిని పంపకం చేసుకొని, ఎవరివారిని వాళ్ళు పోయేరు. అందరిలోకి చిన్నవాడు, అట్టే చదువుసంధ్యలు అబ్బనివాడు అయిన రామస్వామి తండ్రి గోపాలం, ఆర్థికంగా దిగజారిపోతున్నా తండ్రి, తాతల పరువు ప్రతిష్ఠల్ని కాపాడ్డానికి తానే ఏకైక వారసుడు అన్నట్లు, ఆడపిల్లల రాకపోకలు, వంశానుగతంగా వస్తున్న ఆచారాలు, దానధర్మాలు జరిపిస్తూ పెద్దల పేరైతే నిలపగలిగేడు కాని, కడుపున పుట్టిన పిల్లల భవిష్యత్తు చూడలేకపోయేడు.

అంతకాలం ఆ ఇంటిని ఆదుకొన్న అదృష్టం మూడోతరంలో ముక్కలై పోయింది. అత్తిల్లు సూటిలేని ఆడపిల్లలు, చాలీచాలని జీతాలతో బ్రతుకులు వెళ్ళదీస్తున్న మగపిల్లలు, అంత బ్రతుకు బ్రతికిన గోపాలం వంశాంకురాలుగా మిగిలిపోయేరు.

గోపాలం పిల్లల్లో పెద్దవాడు, తండ్రి తరవాత కుటుంబభారం వహించవలసినవాడు అయిన రామస్వామి ఆర్థికస్థితి అక్క చెల్లెళ్ళ బాధ్యతలనుంచి తప్పుకొనేసరికి ఆస్తికి, అప్పుకి సరి అన్నట్లు తయారయింది. ఉన్న ఊళ్ళో ఒక నాలుగిళ్ళ లోగిలి, పల్లెలో పదిబస్తాల ధాన్యం పండే పొలం మిగిలేయి. వేడినీళ్ళకి చన్నీళ్ళు తొల్లింపు అన్నట్లుగా గుమాస్తా ఉద్యోగం చేస్తూ అదీ ఇదీ కలగలుపుగా రోజులు నెట్టుకువస్తున్నాడు అయిదుగురు పిల్లలతండ్రి రామస్వామి.

పెద్ద కూతురు రాజ్యలక్ష్మికి తిండికి, గుడ్డకి లోటులేని సంబంధం చేసేరు. అయిందికి అప్పారావు వేలు విడిచిన మేనల్లుడే అయినా అడుగడుక్కీ ఆసలు వడ్డీతో సహా రావలసిన కట్న కాను

కల్ని మామగారిదగ్గర గుంజి మరీ వదిలిపెట్టేడు. అంత పుచ్చుకొన్నా తృప్తి లేని కాంతమ్మ ఆడిగినవాళ్ళతో, అడగనివాళ్ళతో—"ఏదో అయినసంబంధం కదా అని అభిమానించి చేసుకొన్నాను కాని, నా కొడుక్కి సంబంధాలు రాకనా.... వేలకివేలు గుమ్మరిస్తామంటూ ఆడ పిల్లలతండ్రులు మా ఇంటిచుట్టూ తిరువీథుల తిరిగేవా రనుకోండి" అనేది.

రాజ్యలక్ష్మి పెళ్ళితో బంగారంలాంటి ధాన్యంపండే పొలం కాళ్ళొచ్చి నడిచిపోయింది. ఇంట్లో మిగిలిఉన్న కొద్దిపాటి వెండి బంగారాలు కరిగిపోయేయి. చేతిలో రొక్కం కాస్తా హరించిపోయింది. అయినా రామస్వామి, అన్నపూర్ణ అట్టే బాధపడలేదు. ఆడపిల్లని మంచిచోట పడేసేము, మనం పెట్టినా, పెట్టలేకపోయినా ఏ లోటూ లేకుండా హాయిగా బ్రతుకుతుంది అనుకొన్నారు.

కాని, అత్తింట కాలుపెట్టిన రాజ్యలక్ష్మి అనుభవం తలి దండ్రులు ఆశించినదానికి భిన్నంగా ఉండేది. పెళ్ళిలో ఎంతో ముద్దుగా 'కోడలా' అంటూ ఆప్యాయంగా పిలిచే అత్త కోడలు కాపురానికి ఇంట కాలుపెట్టేసరికి చండశాసనురాలై కూర్చుంది, నూనూగు మీసాల నూత్నయౌవనంలో ఉన్న తనయుడు తల్లి అడ్డాలలోపడి పాలు తాగేవాడిలా అన్నిటికీ అమ్మ, అమ్మ అంటూ తప్పుకుపోయే వాడు.

భర్త పోయేసరికి ఏడాది పిల్లాడుగా ఉన్న అప్పారావుని జ్ఞాతుల కుతంత్రాలనుంచి, అయినవాళ్ళ అత్యాచారాల్లోంచి కంటికి రెప్పలా కాచుకొంటూ పెంచుకొచ్చింది కాంతమ్మ. తన వ్యవహారదక్షతతో ఇంతగా ఉన్న ఆస్తిని పైపైకి పైన చేరుస్తూ అంతగా పెంచి పెద్ద చేసింది. తన కన్ను చాటైతే కొడుకు ఏ ఆపదల పాలవుతాడోనని భయంతో, ఇంటా, బయటా నీడలా వెంటనంటి తిరుగుతూ, బడి కైనా పంపకుండా మంచీ చెడ్డా తనే నేర్పుతూ, అతడికి ఒక వ్యక్తిత్వం అన్నది లేకుండా, తనెంత చెపితే అంతే అన్నట్లు ఆ కొడుకుని తీర్చి దిద్దింది.

రాజ్యలక్ష్మి అత్తింట కాలుపెట్టిన మొదటిరోజుల్లో ఆ తల్లీ బిడ్డల ఆప్యాయతకి, అనుబంధానికి మురిసి ముగ్ధురాలయేది. చిన్న వయసులోనే భర్తని కోల్పోయిన కాంతమ్మ కొడుకు అభివృద్ధికోసం పడ్డపాట్లు తెలుసుకొని ఆమెపై జాలిపడేది. కాని, కాలం గడుస్తుంటే హద్దులులేని ఆ మాతృ మమత తన దాంపత్యజీవితంలో ఎంత చేదును గుమ్మరిస్తున్నాదో, నిత్య శంకితురాలైన ఆ తల్లిచేతుల్లో పెరిగిన తన యుడు తాళికట్టిన భార్యని నమ్మిందికికూడా ఎంత వెనకముందు చూస్తున్నాడో గ్రహించింది. ఆ తల్లీ కొడుకులమధ్య తన జీవితం కత్తిమీద సాములా సాగిపోవలసిందే అని తెలుసుకొంది.

కాని, ఈ విషయాలు ఎవరితో చెప్పుకొంటుంది? చెప్పు కొన్నందువల్ల కలిగే లబ్ధిమాత్రం ఏముంటుంది? తాము ఆర్థికంగా చితికిపోయినా తమబిడ్డ సుఖపడుతున్నాదని సంతోషిస్తున్న తలి దండ్రుల ఆనందాన్ని కూలద్రోయడం మినహా దానివల్ల ఒరిగే లాభం ఏముంటుంది?

చిన్ననాటినుండి బరువు బాధ్యతలమధ్య పెరిగిన రాజ్యలక్ష్మి. అత్తింటికి వెళ్ళినపిల్ల రట్టుపడితే నష్టపోయేది ఎవరో ఊహించగల రాజ్యలక్ష్మి, ఓర్మితో వేచిఉండడమే మంచిదనీ, ఏదో నాటికి తన బ్రతుకు బాగుపడకపోదనీ భవిష్యత్తుపై నమ్మకంతో రోజులు దొర్లించసాగింది.

అనసూయ పెళ్ళి అయిన ఏడాది కొత్త వియ్యాలవారితోపాటు పాతవారినికూడా పండక్కి ఆహ్వానించేడు రామస్వామి. "కోపిన వంట కళ్ళంలో ఉంది. ఇద్దరం వెళ్ళిపోతే ఎలాగ? నువ్వు కోడల్ని తీసుకొనివెళ్ళు మీ మామ ఏం కట్నం కానుకలు పెట్టదలుచు కొన్నాడో?" అంది కాంతమ్మ. స్వర్గానికి పోయినా సవితిపోరు అన్నట్లు పుట్టింటికి వెళుతున్నా అత్త వెంట పడుతుందేమో అని భయపడుతున్న రాజ్యలక్ష్మి ఆ మాటవిని సంతోషించింది. ఆ నాలుగు రోజులైనా తనవాళ్ళమధ్య హాయిగా గడపవచ్చని ఆనందించింది.

అంతకాలానికి వచ్చిన రాజ్యలక్ష్మిని ఇంట్లో అంతా ఆప్యాయంగా పలకరించేరు. ''ఎన్నాళ్ళకి వచ్చేవే, తల్లీ! ఇందుకే అంటారు ఆడపిల్ల ఎరువు సొమ్మని'' అంటూ కూతుర్ని కౌగిలించుకొని కంట నీరు పెట్టుకొంది అన్నపూర్ణ.

''ఇప్పటికైనా అల్లుడికి దయ గలిగింది. అమ్మాయి కంట పడింది అని సంతోషించక కంట తడిపెడతావేమిటే, పిచ్చిదానా!'' అన్నాడు రామస్వామి భార్యని అనునయిస్తూ.

''కొత్త వియ్యాలవారికంటే మేమే ముందు వచ్చేములాగుంది'' అన్నాడు చావిట్లో కుర్చీలో కూర్చుంటూ అప్పారావు.

''వస్తారు, నాయనా, గంటకో గడియకో వాళ్ళూ వస్తారు. నిజానికి ఈసరికి వాళ్ళూ రావలసిందే ...అయినా ఈ రోజుల్లో ఈ రైళ్ళ రాకపోకలకి ఒక వేళా పాళా లేకుండాపోతున్నాది'' అంది అన్నపూర్ణ, వీధిలో ఏదో బండిచప్పుడు అయితే వియ్యాలవారు కాని వచ్చేరేమోనని తొంగిచూస్తూ.

''రాబోయేవారికోసం ఏం చూస్తావు కాని, ముందువచ్చిన వాళ్ళసంగతి చూడు'' అన్నాడు రామస్వామి.

అన్నపూర్ణ ఇంట్లోకివెళ్ళి అల్లుడికీ, కూతురికి కాఫీ, ఫలహారాలు తెచ్చింది.

''నా కూడా ఇక్కడికి తీసుకురావాలా.... నేనే వచ్చి తీసుకొందును కద'' అంది రాజ్యలక్ష్మి. తల్లి చేతులో ప్లేటు అందుకొంటూ.

''ఫరవాలేదులే. నే నెంత చేసినా, ఏం పెట్టినా ఈ రెండు రోజులే కదా. ఆ వెనక నీ ఇల్లు, నీ చాకిరి నీకు ఎలాగా తప్పదు.''

అత్తగారు అన్నమాట విని ఆవిడ వంక అక్కసుగా చూసేడు అప్పారావు. ఆ చూపులోని భావాన్ని అర్థం చేసుకొన్నాడు రామస్వామి. ఉన్నమాట అంటే ఉలుకెక్కువ అని ఇందుకే అంటారు. తమ ఇంట కాలు పెట్టేసరికి ముద్దబంతి పువ్వులా ఉండేది పిల్ల. ఏం పనో, ఏం పెట్టుపోతలో మరి, పొగాకు కాడలా తయారయింది—అనుకొన్నాడు. కాని, భార్యనోటి చులకనకొద్దీ ఏదైనా మాటజారితే అల్లు

డికి ఎక్కడ కోపం వస్తుందో అని భయపడి, "చుట్ట ఆరిపోయింది. ఓసారి అగ్గిపెట్టి తెచ్చిపెడతావా?" అన్నాడు భార్యతో ఆమెని అక్కడినుండి పంపివేయడానికి.

భర్తమాటని అర్థం చేసుకొని అన్నపూర్ణ అక్కడినుండి లోపలికి వెళ్ళిపోయింది. తల్లివెనకనే తనూ ఖాళీ కాఫీ కప్పులు పట్టుకొని వెళ్ళింది రాజ్యలక్ష్మి. ఆ ఏటి పంటలు, ఫలసాయాలు మాటల్లోకి దింపి అల్లుడి మనసుని అత్తగారిమాటలమీంచి మళ్ళించేడు రామస్వామి.

మరోగంటకి రావలసిన వారంతా రానే వచ్చేరు. అంత పెద్ద నాలుగిళ్ళ లోగిలి పిల్లలతో, పెద్దలతో బిలబిల్లాడింది. తల్లి పేరు పేరునా అందర్నీ పలకరిస్తుంటే, ఆమెచాటున నిలబడి, పెళ్ళిపీటల మీద సిగ్గు దొంతర్లమధ్య చూపిన ఆ అందాల రాకుమారుడికోసం వెతుకులాడేయి జనసూయ కళ్ళు అదే పనిలోఉన్న గోపాలకృష్ణ ఆమె చూపుల్ని పసికట్టి, 'ఇదిగో ఇక్కడ ఉన్నాను' అన్నట్లు ఒక పొండగ్గు దగ్గేడు. అతడి చూపులతో తనచూపులు కలియగానే సిగ్గుతో తల దించి, క్రీగంట అతన్ని చూస్తూ చిన్నగా నవ్వింది. ఏమో అనుకొన్నానుకాని, చదువు సంధ్యలు లేకపోయినా చలాకీ అయిన పిల్లే అనుకొని తృప్తిపడ్డాడు గోపాలకృష్ణ.

శారదకి ఆ రోజు ఊపిరి సలపనంత పని. బావల ఆదేశాల్ని అక్కలకి, అక్కల సందేశాల్ని బావలకి చేరవెయ్యడంలో తిండి తినడానికి కూడా ఆ పిల్లకి సమయం మిగలకుండా పోయింది. తల్లి కంచంలో అన్నంపెట్టి పిలుస్తుంటే, "ఉండే, అమ్మా. బావకి ఈ మాట చెప్పేసి ఇప్పుడే వచ్చేస్తాను" అంటూ చిన్నబావగారి గదిలోకో, పెద్దబావగారి గదిలోకో పరుగుతీసేది.

"ఇప్పుడే ఇంతలా అలిసిపోకే. ఇంకా పండుగ అంతా ముందే ఉంది" అని కూతురికి బుద్ధిచెప్పి, వియ్యాలవారికి అన్నీ సరిగా అందేయో లేదో అని తను పరుగులుపెట్టేది అన్నపూర్ణ.

తెల్లవారితే భోగిపండుగ అనగా ఆ రాత్రి ఆ ఇంట ఎవ్వరూ కన్ను మూయ్యలేదు. పుచ్చపువ్వులా ఇల్లంతా దీపాలతో వెలిగి

పోతుంటే, మగవాళ్ళ పేకాటలు, చిన్నవాళ్ళ గెంతులాటలు. ఆడవాళ్ళ కబుర్లతో ఇట్టే తెల్లవారిపోయింది ఆ రాత్రి.

తెల్లవారగట్ల భోగిమంటలు, తలంట్లు, కొత్తబట్టల మధ్య అవతరించింది ఆ ఏటి పెద్ద పండుగ. రామస్వామి అల్లుళ్ళతో, వియ్యాలవారితో కబుర్లతో కాలక్షేపం చెయ్యగా, అన్నపూర్ణ పిండి వంటలతో కుస్తీ పట్టసాగింది.

పన్నెండుగంటలవేళ వంటా వార్పూ పూర్తిచేసుకొని ముందు చావిట్లో అల్లుళ్ళతో, వియ్యంకుడితో పేకాట సందట్లోఉన్న భర్త దగ్గిరికివచ్చి, ''వంటయిపోయింది. వడ్డించేయమంటారా'' అంది అన్నపూర్ణ.

'ఏమంటారు' అన్నట్లు ఎదురుగా ఉన్న అల్లుళ్ళవంక చూసేడు రామస్వామి.

''పన్నెండు దాటిందిలా ఉంది. వడ్డించేయమనండి. ఇంకా ఆలస్యం దేనికి?'' అన్నాడు వియ్యంకుడు నీలకంఠం.

''మా కేం అభ్యంతరం లేదు. భోజనంచేసి మళ్ళా కూర్చోవచ్చు'' అన్నాడు అప్పారావు.

''చోటు మారితే ఆట మారుతుందని అన్నగారికి ఆశలా ఉంది'' ఆటలో కూర్చున్నప్పటినుంచి అప్పారావు ఓడిపోతూ ఉండడం గుర్తుచేస్తూ అన్నాడు గోపాలకృష్ణ.

''ఏం మారినా ఈ ఏడు గెలుపు మీదే లెండి. కొత్త అల్లుడికి ఆపాటి ప్రోత్సాహం చూపించకపోతే బాగుండదని ఊరుకొన్నాం కాని, గెలుచుకోలేకనా'' అన్నాడు రామస్వామి, పెద్దల్లుడివైపు వకాల్తా పుచ్చుకొన్నట్లు.

''వడ్డన అయింది. అంతా లేచిరండి'' అంది అన్నపూర్ణ తిరిగి చావిట్లోకి వచ్చి.

ఒక్కొక్కరే లేచి ఆమె వెనకగా భోజనాలగదివైపు వెళ్ళేరు. అందరికన్న వెనకగాఉన్న రాజ్యలక్ష్మి వీథితలుపు గడియవేసి రావా

...తీయ వెళ్ళింది. తలుపు దగ్గరికి వెయ్యబోతూ గుమ్మంలో నిలిచి ఉన్న మనిషినిచూసి కాళ్ళముందు పాముని చూసినట్లు అదిరిపడింది.

గవరయ్య సెట్టి తన గారపట్టిన పళ్ళు కనిపించేలా నోరింత చేసుకొని నవ్వుతూ, "పండక్కి వచ్చేవా, అమ్మడూ! నాన్నగారు ఇంట్లో ఉన్నారా?" అన్నాడు. మాటల్లో మర్యాద వినిపిస్తున్నా, కళ్ళలో కాఠిన్యం ప్రతిఫలిస్తున్నాది. ఈసమయంలో ఈ శనేశ్వరుడు ఎందుకొచ్చినట్లు అనుకొంది రాజ్యలక్ష్మి. తన పెళ్ళి అయేక తీసుకొన్న అప్పు తీర్చేవరకు నెలకోసారి గవరయ్య వచ్చి అయినవీ కానివీ అని పోవడం, అతడువచ్చి వెళ్ళిననాడు ఇంట్లో అమ్మా, నాన్నా దిగులుగా బాధపడుతూ తిరుగులాడ్డం ఆమెకి గుర్తుకి వచ్చింది.

గవరయ్య సెట్టికి శరీరంపై చర్మం ఎంత దళసరో నోటిలో నాలుక అంత పలుచన. అది ఎటుపడితే అటు ఏపాటి సంకోచం లేకుండా తిరుగుతుంది. డబ్బు ఇచ్చేటప్పుడు తేనెలు ఒలకపోస్తుంది. తిరిగి పుచ్చుకొనేటప్పుడు విషం చిందిస్తుంది. అయినా, ఆ ఊళ్ళో ఆర్తులపాలిట అతడో కల్పతరువు. ఇంకోచోటకన్నా రెట్టింపు వడ్డీ పుచ్చుకొన్నా, ఏసమయంలో అడిగినా అనగానే సొమ్ము సర్దుబాటు చేసేపాటి స్థితిమంతుడు ఆ ఊళ్ళో అతడొక్కడే. అందుకే అతడి వెనకగా ఎన్ని తిట్టుకొన్నా, ఏదో ఒకసమయంలో ఆ ఊళ్ళో ప్రతివాడికి గవరయ్య ముందు చేయి జాచక తప్పదు.

అనసూయ పెళ్ళికి ఇంటిమీద తెచ్చిన అప్పుకాక, నాన్న వీడి దగ్గిరకూడా సొమ్ము తీసుకొన్నారా? ఈ అప్పులన్నీ ఎలా తీరుస్తారు? మిగిలినవాళ్ళని ఏం పెట్టి పెంచుతారు—అనుకొంది రాజ్యలక్ష్మి.

"ఏం రాజమ్మా, నా మాటినపడలేదా? నాన్న ఇంట్లో లేదా.... ఈ ఏలప్పుడైతే దొరుకుతాడని వచ్చేనే" అన్నాడు గవరయ్య ఇంట్లోకి తొంగిచూస్తూ.

మొదట ఉపయోగించిన గౌరవవాచకంపోయి ఏకవచన ప్రయోగంలోకి దిగింది ధోరణి. ఇంకా అతడిప్రశ్నకి జవాబు చెప్ప

కుండా అలా ఉండిపోతే అతడిమాట ఎన్నిపోకడలు పోతుందో రాజ్యలక్ష్మికి తెలుసు. అందుకే చుట్టుముట్టుతున్న ఆలోచనల్లోంచి కోలుకొని, "ఉన్నారు, సెట్టిగారూ, రండి, కూర్చోండి. పిలుస్తాను" అంది.

"నే కూకోడానికి రాలేదు కానీ, మీ నాయన్ని ఓసారి పిలు" అన్నాడు గవరయ్యసెట్టి, అతడికి అలవాటైన ధోరణిలో.

కూతురు పిలవనక్కరలేకుండానే గవరయ్యమాటలు విని అటువైపు వచ్చేడు రామస్వామి. "నువ్వెళ్ళమ్మా, అమ్మ పిలుస్తున్నాది" అంటూ కూతుర్ని అక్కడినుండి పంపివేసేడు

ఇంట్లోకి వెళ్ళిపోతూ తండ్రివంక జాలిగా చూసింది రాజ్యలక్ష్మి. పదినిమిషాల కిందట అల్లుళ్ళమధ్య కూర్చుని పేకాట ఆడుతూ, ఆట గెలిచినప్పుడల్లా చిన్న పిల్లాడిలా హంగామాచేస్తూ, ఓడినప్పుడు ఉడుక్కొంటూ ఉన్న తండ్రి అప్పటి రూపానికి, ఇప్పటిదానికి పోలికే లేదు.

మూడు అడుగుల దూరంలో మృత్యువు నిలిచి ఎప్పుడు వస్తావు అని ప్రశ్నిస్తుంటే దానికోసం ఎదురుచూడని మానవుని పరిస్థితి ఎలా ఉంటుందో ఆ సమయంలో గవరయ్యసెట్టి రాక రామస్వామికి అలా అనిపించింది. 'భగవంతుడా, ఈ గండం గడిచి బయటపడితే....కాని, గవరయ్య ముఖకవళికలు చూస్తుంటే, అటువంటి సమయం ఎంచుకొనివచ్చిన పద్ధతి గమనిస్తే ఆ గండం గడిచేలా లేదు. వియ్యాలవారి ముందు పరువు నిలిచేలా లేదు.'

అతడి నోటినుంచి కటువైనమాటలు ఏమీ రాకముందే జాగ్రత్తపడి, "రండి, సెట్టిగారూ. అలా బయటికి వెళదాం" అంటూ వీథిలోకి పిలుచుకుపోయేడు రామస్వామి.

వడ్డన అంతా పూర్తిచేసిన అన్నపూర్ణ, పైటకొంగు మొలలో తిప్పి దోపుకొని నేతిగిన్నె చేతిలోకి తీసుకొంది. "ఏమండోయ్, ఏం చేస్తున్నారు? త్వరగా రండి....అన్నం చల్లారిపోతున్నాది" అని

భర్త కో కేక పెట్టి, ముందు వరసలో ఉన్న పిల్లలకి నెయ్యివడ్డన ప్రారంభించింది.

రాజ్యలక్ష్మి మెల్లగా తల్లిపక్కకి వచ్చి, "గవరయ్య పెట్టి వచ్చేడు" అంది, ఆమెకిమాత్రమే వినిపించేలా. అన్నపూర్ణ చేతిలో నేతిగిన్నె వణికింది. గిన్నెలో నిండుగా ఉన్న నెయ్యి చింది చీర కుచ్చెళ్ళమీద తొణికింది.

"ఇలా తే, అమ్మా, నెయ్యి నే వడ్డిస్తాను. నువ్వు మిగిలింది చూడు" అంటూ తల్లి చేతిలోంచి గిన్నె అందుకొంది రాజ్యలక్ష్మి.

అంతలో వచ్చేడు రామస్వామి. "మీ భోజనాలు కానీయండి. ఏదో అర్జెంటుపని ఉందంటూ ఆఫీసరు కబురు పెట్టేడు. ఓసారి వెళ్ళి కనుక్కొస్తాను" అన్నాడు రామస్వామి.

"వడ్డన అయిపోయింది. ఎంతసేపు... భోజనంచేసి వెళ్ళండి" అన్నాడు నీలకంఠం.

"బావగారు క్షమించాలి. ఏదో తగినంత అవసరం పడితేనే గాని, ఈరోజు పండగరోజని తెలిసికూడా భోజనసమయంలో ఆయన కబురు పంపడు. మరోలా అనుకోకండి. ఇప్పుడే ఓ అరగంటలో తిరిగి వచ్చేస్తాను." ఇంకోమాటకి అవకాశం ఇవ్వకుండా అక్కడ నుంచి వెళ్ళిపోయేడు రామస్వామి.

"ఏం ఉద్యోగాలో, ఏం పాడో.... ఒక వేళాపాళా లేదు. పండుగా పబ్బం లేదు ఆ ఆఫీసర్లకళ్ళకి ఈ గుమాస్తాలన్నవాళ్ళు మనుషుల్లా కనిపించరు కాబోలు" అంటూ మనసులోని ఆందోళనని కప్పిపుచ్చుకోవడానికి అలా ఏదో వాగడం మొదలుపెట్టింది అన్నపూర్ణ.

భోజనాలు పూర్తి అయేయి. పళ్ళెంలో ఆకులు, చెక్కలు, సున్నం వగైరాలన్నీ సర్ది చావిట్లో పెట్టి వచ్చింది రాజ్యలక్ష్మి.

"రా, నీకు వడ్డించేస్తాను" అంది అన్నపూర్ణ.

"నువ్వుకూడా పెట్టుకో, అమ్మా, నాన్న ఏ వేళకి వస్తారో," అంది రాజ్యలక్ష్మి.

"పండుగపూట ఆయన్ని పస్తుపెట్టి.... నా నోటికెలాపోతుందే, తల్లీ ...ఆ వెధవతో ఆయన ఏం తిప్పలు పడుతున్నారో!" ఎంత ఆపుకోవాలన్నా ఆగకుండా దుఃఖం పొర్లుకొచ్చింది.

"అమ్మా" అంది రాజ్యలక్ష్మి బాధగా.

అన్నపూర్ణ కళ్ళు తుడుచుకొంది.

"ఆడపిల్లలం మేం పుట్టకపోతే...." మీ కీ బాధలూ, అవమానాలూ ఉండేవికావు కదమ్మా అనబోయింది రాజ్యలక్ష్మి. సగం మాట దుఃఖంవల్ల గొంతుకలోంచి బయటికి రాకుండా ఉండిపోయింది.

"తప్పు, రాజా, అలా అనకమ్మా....పండుగపూట విందు ఇంటో కంట తడి పెట్టకూడదు. కళ్ళు తుడుచుకో, అమ్మా" అంటూ కూతుర్ని ఓదార్చింది అన్నపూర్ణ. ఒక్కనిమిషం క్రితం తనూ అదే పని చేసింది అన్నవిషయం మరిచిపోయి.

రెండు దాటి మూడుగంటలవుతుంటే విరిగిపోయిన మనసుతో, అలిసిపోయిన శరీరంతో జీవచ్ఛవంలా ఇల్లు చేరేడు రామస్వామి.

"కాళ్ళు కడుక్కురండి....వడ్డించేస్తాను....చాలా వేళయింది" అంది అన్నపూర్ణ.

"బాగా వేళ తిరిగిపోయింది. ఇప్పుడు భోజనం చెయ్యాలని లేదే" అన్నాడు రామస్వామి.

"అమ్మకూడా ఇంకా భోజనం చెయ్యలేదు."

కూతురిమాట విని భార్యవైపు చూసేడు రామస్వామి. పది లంఖణాలుచేసి లేచినట్లుంది ఆమె. "వడ్డించే....వచ్చేస్తున్నా".... అంటూ కాళ్ళూ చేతులూ కడుక్కురావటానికి పెరట్లోకి వెళ్ళిపోయేడు.

విస్తట్లో అన్నంపెట్టి గవరయ్య విషయం కదపలేక మౌనంగా వడ్డన సాగించింది అన్నపూర్ణ. భోజనం పూర్తి కావస్తున్నా భర్త ఆ విషయం ఎత్తకపోవడం గుర్తించి ఇంక ఊరుకోలేక—"గవరయ్య వచ్చేట్ట" అంది.

"మరేం" అన్నాడు రామస్వామి, అంతటితో భార్య ఊరుకొంటుందేమో, వియ్యాలవారు వెళ్ళేక అసలు విషయం చెప్పచ్చు అన్న అభిప్రాయంతో.

అన్నపూర్ణ ఊరుకోలేదు. "ఎలా వదలించుకొన్నారు" అంటూ ప్రశ్నించింది.

ఒకసారి తలఎత్తి భార్యవంక చూసేడు రామస్వామి. ఆమె తనవైపే పరీక్షగా చూస్తున్నాది. ఇన్నేళ్ళ తమ వైవాహిక జీవితంలో తను ఏదీ ఆమెదగ్గర దాచలేదు. అబద్ధాలు చెప్పలేదు. ఇప్పుడు ఈ స్థితిలో ఏదో ఒకటిచెప్పి తప్పించుకొనే అభిప్రాయం తనకి లేదు.

"ఇల్లు అమ్మేసేను" అన్నాడు పీటమీంచి లేచిపోతూ.

గుమ్మానికి అటుగా నిలబడి తలిదండ్రుల సంభాషణ వింటున్న రాజ్యలక్ష్మి త్రుళ్ళిపడింది. ఎదురుగాఉన్న అన్నపూర్ణ భర్త అన్న మాట నమ్మలేక—"నిజం?" అంది ఆశ్చర్యంతో.

"ఇంకోమార్గం కనిపించలేదు, పూర్ణా! అప్పుతీరి కొంత సొమ్ముకూడా చేతిలో పడుతుంది." ఆ కాస్తమాట అనేసి ఇంక ఆ విషయమై మాటలు సాగడం ఇష్టం లేనట్లు అక్కడినుండి చావిట్లోకి వెళ్ళిపోయేడు.

పగుళ్ళిచ్చిన గోడలవైపు, పట్టుతప్పి వాలిపోతున్న వాసాల వైపు మమతగా చూపింది అన్నపూర్ణ. అయిపోయింది.... ఈ ఇంటితో ఋణం ఈ రోజుతో తీరిపోయింది—అనుకొంది బాధగా.

* * *

తరతరాలుగా ఉంటున్న ఇంటిని విడిచిపెట్టడానికి అన్నపూర్ణ, రామస్వామి మొదట్లో బాధపడ్డమాట నిజమే. కాని, కాలం గడుస్తుంటే, మరామత్తులు, ఇంటిపన్నులు అనే బాధలేకుండా, ఏ నెలకా నెల ఇంతసొమ్ము పారేస్తుంటే గడిచిపోయే అద్దె ఇల్లే నయమనిపించింది. అయిందికి అది స్వంత ఇల్లయినా ప్రస్తుతం ఇస్తున్న అద్దెకి మించేసొమ్ము ఏదో ఒక కారణంగా ఆ ఇంటిమీద పెట్టవలసి

వస్తుండేది రామస్వామికి. ఈ పక్కనుంచి బాగు చేయిస్తుంటే ఆ పక్కనుంచి దిగజారిపోతుండేది ఆ పాత కొంప.

ప్రస్తుతం ఉన్నఇల్లు పెద్దది కాకున్నా, నేటికాలపు మనుషుల అవసరాలకి అనువుగా కట్టింది. ఉన్నకాటికి ఎలుకలకన్నాలు, విరిగి పడే చౌడుగోడలు లేకుండా శుభ్రంగా ఉంది. పెరట్లో నుయ్యి, వీథి మొదల్లో కుళాయి ఉన్నాయి. ఇంటివాళ్ళు మంచివాళ్ళు. భాగపుఇళ్ళే అయినా ఒకవాటాకి, ఇంకోవాటాకి పెరట్లో నూతిదగ్గర తప్పితే ఇంకెక్కడా తారసపడే అవసరంలేదు. ఈ సదుపాయాలన్నిటికీ తోడు రామస్వామి ఆఫీసుకి, పిల్లల స్కూలుకి దగ్గరలో ఉంది స్వంత ఇల్లు పోతేపోయింది కాని, ఈ ఇల్లు అన్నివిధాలా తమకి అనుకూలంగా ఉందని తృప్తిపడింది అన్నపూర్ణ.

స్వంత ఆస్తి అంటూ ఏమీ మిగలకపోయినా అప్పులవాళ్ళ బాధ తీరింది కదా అని సంతోషించేడు రామస్వామి కాని, ఎప్పు డైనా ఆ దారంటవెళితే ఎంతోకాలం తమది అనుకొన్న ఆ ఇల్లు పరాయివాళ్ళ సొత్తు అయిపోయింది అనేబాధ మనసులో కలుక్కు మనేది. ఆ పనికూడా తన చేతిమీదుగా జరిగినందుకు కష్టంగా ఉండేది అతడికి. ఆ ఇల్లు కొన్న గవరయ్యసెట్టి దానిని పడగొట్టి కొత్త ఇంటికి పునాదులు తీయిస్తుంటే విరిగి పడుతున్న గోడలమధ్య, రాలి పడు తున్న పెంకులకింద తన చిన్నతనపు అనుభూతులు, తలిదండ్రుల జ్ఞాపకాలు సమాధి అయిపోతున్నట్లు అనిపించేది.

శారదకి చాలాకాలంవరకు తమ ఇల్లు అమ్మివేసినసంగతి తెలియదు. పాత ఇల్లు పడగొట్టి కొత్తది కట్టించుకోవడంకోసం తామంతా ఇంకో ఇంట్లోకి మారిపోయేరు అనుకొనేది. 'మా కొత్త ఇల్లు పూర్తయేక ...'' అంటూ స్నేహితురాళ్ళతో కబుర్లు చెప్పేది. ఒకరోజు ఆ మాటవిన్న గవరయ్యసెట్టి మేనకోడలు—"ఆ ఇల్లు మీది కాదు. మా మామయ్యది. మీ నాన్న మా మామయ్యకి అమ్మే సేడు'' అంది.

శారద ఆ పిల్లమాటలు నమ్మలేదు. "ఛీ పో! నీకేం తెలి

యదు. ఆ ఇల్లు మాదె. పాతది పడిపోతుంటె కొత్తది కట్టించుకొంటున్నాం'' అంటూ ఆ పిల్లతో వాదించింది.

''కావాలంటే పోయి మీ అమ్మని అడుగు. మొన్న మా అత్త చెప్పింది—మరి రెండునెలలుపోతే మేమంతా కొత్తింట్లోకి వెళ్ళిపోయి పండుగ చేసుకొంటాం.''

ఇంక ఆ పిల్లతో ఆడా లనిపించలేదు శారదకి. పుస్తకాల సంచీ భుజానికి తగుల్చుకొని ఇంటివారి పట్టింది.

సాయంకాలం వంటా పనీ ముగించుకొని భర్త రాకకోసం ఎదురుచూస్తూ గుమ్మంలో నిలబడింది అన్నపూర్ణ. రోజుకన్న ముందుగా శారద బడినుంచి రావడంచూసి, ''ఏమే అప్పుడే వచ్చేసేవు? ఈరోజు నీ ఆటలు ఇంతవేగిరం తెమిలిపోయేయేం?'' అంది.

శారద మాట్లాడకుండా గదిలోకివెళ్ళి పలకా పుస్తకాలూ గూట్లో పడేసి, తిరిగి తల్లిదగ్గిరకి వచ్చింది. కూతురిముఖం వాడి ఉండడం ఆ చిరువెలుగులోకూడా గమనించింది అన్నపూర్ణ.

''అలా ఉన్నావేం? ఒంట్లో సరిగాలేదా?'' అంటూ ఆత్రంగా నుదురు ముట్టుకు చూసింది.

శారద ఒళ్ళు చల్లగావే ఉంది. తేలికపడ్డట్లు ఊపిరి పీల్చుకొంది అన్నపూర్ణ. ''అయినా స్కూలునుంచి అలా ఆటలకి పరుగు పెట్టొద్దని, ఇంటికివచ్చి ఇన్ని పాలో నీళ్ళో తాగిపొమ్మని చెబితే వినవుకదా? ఉదయమనగా ఆడుతూ, బడుతూ తినిపోతావు. మళ్ళీ ఇంటిముఖం చూడవు. చూడు, తోటకూరలా ఎలా వాడిపోయేవో.... పద, నీకు భోజనం పెట్టేస్తాను. మీ నాన్న ఇంకా ఎప్పటికి వస్తారో'' అంటూ వంట ఇంటివైపు నడిచింది. శారద తల్లివెనకాలే మెల్లిగా తనూ అడుగులువేస్తూ, ''అమ్మా, నాన్న గవరయ్యసెట్టికి మన ఇల్లు అమ్మేశారా?'' అంది మెల్లగా.

ఆ ఇల్లు విడిచివచ్చి ఇంతకాలం అయేక ఇప్పుడు కూతురు పని పెట్టుకొని అలా ప్రశ్నిస్తుంటే వింతగా చూసింది అన్నపూర్ణ,

శారద ముఖం వాడి ఉండడానికి, ఈ ప్రశ్నకి ఏమైనా సంబంధం ఉందా అని.

అప్పుడే లోపలికివచ్చిన రామస్వామి—"ఏమిటి తల్లీ కూతుళ్ళు ఎదురెదురుగా నిలబడి అలా ముఖాలు చూసుకుంటున్నారు" అన్నారు.

"అబ్బే ...ఏం లేదు. శారదముఖం ఎందుకో వాడినట్లు ఉంటే, ఒంట్లో కాని సరిగా లేదేమో అని...."

"ఏది, తల్లీ, ఇలారా....చూడనీ" అంటూ కూతుర్ని చేతుల్లోకి తీసుకొన్నాడు రామస్వామి.

తండ్రితో కబుర్లు చెప్పడంతో అప్పటికి ఆవిషయం మరిచిపోయింది శారద. రాత్రి పక్కమీద పడుకొన్నాక ఇంటిసంగతి మళ్ళీ మనసులోకి వచ్చింది. తల్లి తనప్రశ్నకి జవాబు చెప్పలేదు. అన్న విషయంకూడా గుర్తుకి వచ్చింది.

"అమ్మా! గవరయ్య సెట్టికి మనిల్లు ఎందుకిచ్చేసేరే?" మళ్ళీ తల్లిని ప్రశ్నించింది.

"మరి అనసూయక్క పెళ్ళికి అతడు సొమ్ము ఇచ్చేడు కదమ్మా!" కూతురి పక్కగా నిద్రకి జోగుతున్న అన్నపూర్ణ సమాధానం చెప్పింది.

తల్లి అన్న ఆ మాటతో శారదకి ఏదో అంతా అర్థమైపోయినట్టే అనిపించింది. పెద్దక్క పెళ్ళి శారదకి అంత బాగా గుర్తులేదు. కాని, అక్క పెళ్ళి అయేక ప్రతిఏడులా ఆ వేసవికాలంలో మామిడిపళ్ళు రాకపోవడం, ఆ వెనక తండ్రి సంచీపట్టుకొని బజారుకివెళ్ళి బియ్యం తేవడం గుర్తుంది. "పెద్దక్క పెళ్ళికి ఎంతో డబ్బు కావాలి కదూ—అందుకని నాన్న మన మామిడితోట, పొలం అమ్మేసేరు" అని వాసు అన్నయ్య చెప్పడంకూడా గుర్తుకొచ్చింది. అవును, పెళ్ళికి చాలారూపాయలు కావాలి కదా. అందుకే గవరయ్యసెట్టికి నాన్న ఇల్లు అమ్మేసేరు—అనుకొంది శారద. అంతలో ఆపిల్ల మనసులో ఏదో తెలుసుకోవాలన్న కుతూహలం మొలుచుకొచ్చింది.

రాజక్క పెళ్ళికి తోటా, పొలం అమ్మేసేరు. అనసూయక్క పెళ్ళికి ఇల్లు అమ్మేసేరు....మరి....మరి....

"అమ్మా" అంది మెల్లగా.

"అబ్బా, ఏమిటే నీ యక్షప్రశ్నలూ, నువ్వూ. తెల్లారగట్టనగా లేచేను. నిద్ర ముంచుకొస్తున్నాది....మాట్లాడకుండా పడుకో" అంటూ నిద్ర పాడుచేస్తున్న కూతురిమీద విసుక్కొంది అన్నపూర్ణ.

తల్లికోపం శారద మనసులో రేగిన కుతూహలాన్ని అణచ లేకపోయింది. అందుకే ఆమెమాటల్ని పట్టించుకోకుండా తను అడగ దలచినమాట అడిగేసింది అమాయకంగా—"అమ్మా! మరి నా పెళ్ళికి ఏం అమ్మేస్తారే" అంటూ.

అన్నపూర్ణకి ముంచుకొస్తున్న నిద్ర పెనుగాలికి చెదిరిపోయే చిరుమేఘంలా ఎక్కడిదక్కడే ఎగిరిపోయింది. అది చిన్నపిల్ల శారదనోట వచ్చిన మాటలా కాక తన అంతరాత్మ ప్రశ్నిస్తున్న తీరుగా వినిపించింది.

ఇద్దరు ఆడపిల్లల పెళ్ళిళ్ళకే ఇన్ని అగచాట్లపాలు కావలసి వచ్చింది. ఇంక మూడోపిల్ల పెళ్ళి ఎలా చేస్తారు? మగపిల్లలకి చదువు లెలా చెప్పిస్తారు? చాలీచాలని జీతంతో, అర్థం పర్థం లేకుండా పెరిగిపోతున్న ధరవరలతో ఈ సంసారం ఎలా నడుస్తుంది? అసలే అంతంతమాత్రం ఆరోగ్యంతో ఉన్న భర్త ఈ బరువుబండిని ఎంత కాలం భుజాల కెత్తుకొని ఈడ్చగలడు? ఆ వెనక కథ ఎలా నడుస్తుంది?

అన్నపూర్ణ మనసులో ఇటువంటి ఆలోచనలు ఎప్పుడు చొరబడ్డా తుపానుసమయంలో సముద్రంలా అల్లకల్లోలం అయిపోతుంది. అందుకే సాధ్యమైనంతవరకు భవిష్యత్తులోకి చూడకుండా బ్రతుకు లాక్కుపోవడానికే ప్రయత్నిస్తుంది. రేపుగురించి ఆలోచించకుండా ఈరోజు గడిచిందని తృప్తిపడుతుంది.

ఎప్పుడైనా దారితప్పి అటువంటి ఆలోచనలు మనసులో దూరితే, వాసు పరీక్షలు పాసై పెద్ద ఉద్యోగస్థుడవుతాడని, గోపి

మందకొడితనం పోయి తెలివిగా చదువుకొంటాడని, ముగ్గురు కూతుళ్ళు ముచ్చటగా సంసారాలు చేసుకొంటూంటే కళ్ళపండువుగా తమ దంపతులు చూసుకొంటూ ఉంటారని—ఇటువంటి ఆలోచనలకే పరిమితం చేసేది బుద్ధిని. కాని, ఆనాడు చిన్నపిల్లనోట వచ్చిన ఆ మాట రానున్న ఏదో ఆపదల్ని ఎత్తి చూపుతున్నట్లు అనిపించింది అన్నపూర్ణకి.

ఆ తరవాత ఎప్పటిలా మనసుకి ధైర్యం తెచ్చుకొని నిద్రపోవాలని ఆమె ఎంత ప్రయత్నించినా కన్ను మూతపడలేదు. తల్లిని అంతటి ఆరాటానికి గురిచేసిన శారదమాత్రం తల్లినోట తన ప్రశ్నకి జవాబు వినకుండానే నిద్రలోకి జారిపోయింది. అమాయకంగా అలా నిద్రపోతున్న కూతురి ముఖంలోకి చూస్తూ, 'భగవంతుడా! ఈ పిల్లల నుదుట ఏం రాసిపెట్టేవు, తండ్రీ' అంటూ వాపోయింది అన్నపూర్ణ.

అలిసిపోయిన కళ్ళు అన్నపూర్ణకి తెలియకుండానే ఎప్పుడో మూతపడ్డాయి. పటుతప్పిన శరీరం అప్రయత్నంగానే మంచంమీద వాలిపోయింది.

# 2

పసిమరాలి ఏడుపుతో అన్నపూర్ణకి తెలివి వచ్చింది. వేళ ఎంత యిందో తెలియడంలేదు. కళ్ళింకా నిద్రమత్తుతో భారంగా ఉన్నాయి. దుప్పటి తొలగించి పక్కమీంచి లేచింది. తెల్లవారుతున్న రాత్రి కిటికీలోంచి పాతపడిన చవకమచ్చు నేతచీరె రంగులా వెల వెలపోతూ కనిపించింది. దూరంగా ఎవరింటిలోనో గడియారం నాలుగు గంటలు కొట్టింది.

'రాత్రి ఆలస్యంగా పడుకోవడంచేత కళ్ళు బరువుగా ఉన్నాయి కాని, అప్పుడే నాలుగయింది' అనుకొంది, విడివడిన జుట్టును ముడి వేసుకొంటూ.

తెల్లవారితే రాజ్యలక్ష్మికి పదకొండోరోజు. పురిటిస్నానం చేయించాలి. ఏదో ఆటంకం వచ్చిందని వియ్యాలవారు బారసాలకి రాకపోయినా, పచ్చగా తల్లికి, పిల్లకి పురుటినీళ్ళుపోసి ఇంట్లోకి తెచ్చుకొన్నాక కాస్త పాలల్లో బియ్యమైనావేసి ఇంట్లో నలుగురికీ పెట్టాలి. ఇంక బద్ధకిస్తే లాభంలేదు—అనుకొంటూ లేచింది అన్నపూర్ణ.

పసిది ఇంకా ఏడుపు మానలేదు. రాజు లేచిందా, లేక పక్కలో పిల్ల అంతలా ఏడుస్తున్నా మొద్దులా నిద్రపోతున్నదా? ఆ నిద్రలో పిల్లమీద కాలూ చెయ్యీ పడేయలేదు కదా? కంగారుగా అన్నపూర్ణ పురిటిగదివైపు వెళ్ళింది. ఆమె అనుకొన్నట్లు రాజ్యలక్ష్మి నిద్ర

పోవడం లేదు. కూతురు బట్టలు తడుపుకొంటే మారుస్తున్నాది. గుమ్మంలో నిలిచిన తల్లినిచూసి, "అప్పుడే లేచిపోయావా, అమ్మా?" అంది.

"అప్పుడే ఏమిటి—నాలుగయింది. నీళ్ళపొయ్యికింద మంట పెట్టి వస్తాను. ఈలోగా నీ కూతుర్ని నిద్రపుచ్చు" అంటూ బయటికి వచ్చింది.

పెరటితలుపు గడియ తీయబోతుంటే, వంట వసారాలో పని మనిషికోసం ఉంచిన అన్నం గిన్నెమీద మూత కిందపడ్డ చప్పుడు అయింది. ఆ ఇంట్లో ఎలుకలబాధ లేకున్నా, పిల్లుల బెడద జాస్తిగానే ఉంది. అన్నితలుపులు వేసిఉన్నా, కిటికీ చువ్వల్లోంచి దూరి వచ్చి పాలు, పెరుగు, ఏమీ లేకపోతే మూతపెట్టిన అన్నం తినిపోతుంటుంది ఒక నల్లపిల్లి. 'నీకోసం ఉంచిన అన్నం పిల్లి తినేసిందే' అని ఉత్త గిన్నెలు పడేస్తే రుసరుసలాడుతుంది పనిమనిషి.

"మీ భోజనాలైతే జాగ్రత్తగ మూతెట్టుకొంటారు. నాదే కదాని ఎట్టపడితే అట్ట పడేత్తే తినిపోక ఏటిసేత్తుంది పాడుపిల్లి" అంటూ సాధిస్తుంది.

పిల్లినితోలి అన్నం గిన్నెమీద బరువుగా మరోమూత పడేసి రావాలని అటు వెళ్ళింది అన్నపూర్ణ. ఎప్పుడూ ఆ వీధి పట్టుకుతిరిగే నల్లమచ్చల తెల్లకుక్క గిన్నెలో అన్నం తింటున్నాది. అన్నపూర్ణని చూడగానే ఆ కుక్క తింటున్నతిండి వదిలిపెట్టి పరుగుతీసింది. 'ఇదేమిటి....ఇంట్లోకి ఇదెలా వచ్చింది?' ఆ కుక్కవైపు వింతగాచూసింది అన్నపూర్ణ.

అదెలాగ వచ్చిందో అలాగే వెళ్ళిపోయింది. వీధితలుపు ఓరవాకిలిగా తెరిచి ఉంది. రాత్రి ఆ గొడవతో పడుకోబోయేముందు తలుపు వెయ్యడం మరిచిపోయేనా—అనుకొంది. కాని, తలుపువేసి అడ్డకర్రకూడా బిగించినట్లు గుర్తుందే....మరి ఇంత ఉదయాన్నే ఎవరు తీసేరు? ఒకవేళ భర్త కాని పిల్లదాని ఏడుపుతో తెలివివచ్చి లేచిపోయేడా! లేచినా, ఇంతచీకటినే వీధిలో చేసే పనేముంటుంది!

ఆ నాలుగు అడుగులు వేసేలోపునే అన్నపూర్ణ మనసులో రేగిన ఆలోచన లివి. వాకిలిని ఆనుకొని ఉన్న వరండా దగ్గిరకి వచ్చేసరికి చిన్నగా రామస్వామి గుర్రు వినిపించింది. దోమలబాధకి కప్పుకొన్నదుప్పటి ముఖంమీంచి తొలగి బట్టతల కనిపిస్తున్నాది. నిద్రపోతున్న భర్తని చూడగానే అన్నపూర్ణ మనసులోకి ఏదో సంశయం వచ్చింది. దానితో కాళ్ళు గడగడలాడేయి. అడుగు ముందుకువేసి పిల్లలు పడుకొన్న గదివైపు చూడలేకపోయింది. "ఏమండోయ్!" అంటూ భర్త మంచంపక్కన కూలబడింది. అంతచీకట్లో భార్యని ఆ స్థితిలో చూసేసరికి రామస్వామికి మతిపోయింది. పచ్చి బాలెంతరాజు ఎలా ఉంది? పసిదాని కేం ముంచుకురాలేదు కద!

అన్నపూర్ణనోట మాటరాలేదు. తెరిచి ఉన్న వీథి తలుపువైపు వేలితో చూపించింది. ఆమె అంటున్నదేమిటో క్షణకాలంపాటు రామస్వామికి అర్థం కాలేదు. అర్థం అయ్యేసరికి అతనినోట మాటరాలేదు. విసురుగా పక్కమీంచిలేచి పక్కగదిలోకి పరుగుపెట్టేడు. అనసూయ మీద కాళ్ళు, చేతులువేసి శారద నిద్రపోతున్నాది. రెండో పక్కమీద గోపి ఒక్కడే ఉన్నాడు. జరిగిం దేమిటో తెలిసికోవడానికి అట్టే సమయం పట్టలేదు రామస్వామికి. దరివాజుల్లో ఉత్తరం లాంటిది ఏమైనా ఉంటుందేమోనని అటు ఇటు చూసేడు. అటువంటి వస్తువేదీ అక్కడ కనిపించలేదు. తండ్రి అడుగుల చప్పుడుకి లేచి కూర్చుంది అనసూయ. "ఏమిటి, నాన్నా, అలా వెతుకుతున్నారు?" అంది రేగిన జుట్టుని, చెదిరిన పైటని సరిచేసుకొంటూ.

"వాసు ఎక్కడికి వెళ్ళేడమ్మా?" అన్నాడు రామస్వామి.

"అదేమిటి....వాడిమంచంమీద లేడూ?" ఆందోళన, ఆశ్చర్యం ఆ మాటలో ప్రతిధ్వనించేయి.

ఇంట్లోంచి మాటలు కంగారుగా, కలగలుపుగా వినిపించేయి రాజ్యలక్ష్మికి. కాని, ఆ అలజడికి కారణం ఏమిటో తెలిసిరాలేదు. ఆమె పురిటిగది వదిలి బయటికి వచ్చిందికి లేదు. అలాగని కారణం తెలుసుకోకుండా ఉండనూ లేదు, "ఏమిటమ్మా....ఏమయిందే?"

అంటూ గదిలోంచి గట్టిగా కేక పెట్టింది. అక్క కేకవిని అనసూయ గదిలోకి వచ్చింది.

''ఏమయిందే, అనసూయా?'' అంది రాజ్యలక్ష్మి ఆత్రంగా.

''వాసు పక్కమీద లేడు''

''లేక....ఇంత ఉదయాన్నే ఎక్కడికి వెళతాడు? గాలిలేదని వీధి అరుగుమీదకాని పడుకొన్నాడేమో చూసేరా?''

అంతవరకు ఊరకే కంగారుపడుతున్నారే కాని, ఎవరూ బయటికివెళ్ళి అరుగుమీద చూడనిమాట నిజమే. అసలు అటువంటి ఆలోచనే రాలేదు. అక్క అన్నట్లు వాడు రాత్రి గదిలో గాలిలేక వీధి అరుగుమీదకిపోయి పడుకొని ఉంటాడు, ఏవేవో ఊహించుకొని అనవసరంగా కంగారుపడ్డాడు కాని—అనుకొంది అనసూయ. 'ఓరి మొద్దు వెధవా! అందర్నీ ఎంత హడలకొడ్తేవావురా' అని తమ్ముడిని రెండు మొట్టికాయలు మొట్టి లేపుకురావాలని అటు కాలు కదిపింది.

అరుగుమీద వాసు లేడు. అరుగు చివర నల్లమచ్చల తెల్ల కుక్క ముడుచుకొని పడుకొని ఉంది. ఎంతో ఆశతో వెళ్ళిన అనసూయ నిరాశగా తిరిగివచ్చింది.

''వెధవ పరీక్ష పోతేపోయింది, మీ రంతగా కేకలు వెయ్యక పోవలసింది'' అంది అన్నపూర్ణ కళ్ళు ఒత్తుకొంటూ.

''ఇంత డబ్బుపోసి చదివిస్తే ఇలా తగలేసేడని బాధకొద్దీ అన్నాను కాని, ఇలాటి పని చేస్తాడని నాకుమాత్రం తెలుసునే? అయినా నువ్వే చెప్పు, పూర్ణా, వాడిలా ఇల్లు విడిచి పోయేంతగా నే నేమన్నాను? కొట్టేనా, తిట్టేనా? 'చేతికి అంది రావలసిన మగపిల్ల డివి, ఇలా పరీక్షలు తగలేస్తుంటే ఎలారా' అన్నాను....నా చిన్న తనంలో అయితే....''

''ఆ రోజులు పోయేయి, స్వామీ! పెద్దవాళ్ళు అవడం, చిన్న వాళ్ళు పడడం సహజం అనుకొనేవాళ్ళం మనం. ఈ రోజులతీరే వేరు....ఎవరికి ఎవరు చెప్పడానికి లేదు. వినడానికి లేదు ...సరే, ఇప్పు డివన్నీ ఎందుకు కానీ....వాడు ఎటుపోయేడో చూసిరండి. వాడి స్నేహితులు రాజు, మూర్తి, సుందరం, భాస్కరం నాలుగిళ్ళకీ

వెళ్ళి అడిగి రండి. ఏం చేస్తాం....ఇలాటి తెలివితక్కువపిల్లల్ని కన్నందుకు మనకి ఈ తిప్పలు తప్పవు" అంది లేనిధైర్యం తెచ్చుకొంటూ అన్నపూర్ణ.

వాసు ఆ ఏడు పరీక్ష పాసుకాడని ఇంట్లో అకతా అనుకొంటున్నదే కాని, ఇలా ఇల్లువిడిచి చెప్పా చెయ్యాకుండా వెళ్ళిపోతాడని మాత్రం ఎవరూ అనుకోలేదు.

పన్నెండుగంటలవరకు కాళ్ళు అరిగేలా వాసు ఉండచ్చు అని అనుమానం ఉండేచోట్లన్నీ వెతికేడు రామస్వామి. కనిపించినవారినల్లా అడిగిచూసేడు. తన ప్రయత్నాలవల్ల ఫలితం కనిపించకపోయేక చివరికి ఇంటికి తిరిగివస్తూ పోలీసుస్టేషనులో రిపోర్టు ఇచ్చి వచ్చేడు. అవసరమైన విషయాలన్నీ అడిగి రాసుకొంటున్న అక్కడి అధికారి- "కుర్రాడిదగ్గర సొమ్ము ఏమైనా ఉందా?" అని ప్రశ్నించాడు.

"మహా ఉంటే రెండు మూడు రూపాయలు ఉంటాయి." రామస్వామి జవాబు చెప్పేడు

"మీరేం కంగారు పడకండి. ఆ సొమ్ముతో ఎక్కడికి పోగలడు? మీరు వెళ్ళేసరికి ఇంటికి తిరిగి వచ్చేసే ఉంటాడు" అన్నాడు అతడు ఓదార్పుగా.

వీథి గుమ్మంలోనే ఎదురొచ్చింది అన్నపూర్ణ. "ఏమయిందండీ....ఎక్కడైనా కనిపించేడా?" ఆత్రంగా ప్రశ్నించింది.

అక్కడ పోలీసు అధికారి అన్నట్లు ఇంటికి రాగానే భార్య శుభవార్త చెబుతుందేమోనని పుట్టెడాశతో వచ్చేడు రామస్వామి. ఆమె అలా ప్రశ్నించడంతో క్షణమాత్రం ఆమెవంక చూసి, 'ఎక్కడా కనిపించలేదు' అంటూ తల దించుకొని లోపలికి నడిచేడు.

ఉదయంనుంచి కాఫీనీళ్ళయినా నోట పోసుకోలేదు. పైగా ఎండలో తిరగడం. కొడుకు కనిపించలేదనే ఆరాటం ఒకవంక, వాడలా ఇల్లు వదలిపోవడానికి తనే కారణమేమో అన్న అభిప్రాయం కొంత-అన్నీ కలిపి అతడి ఒంటిలో శక్తిని పూర్తిగా పీల్చివేశాయి. నీరసంతో కళ్ళు తిరుగుతున్నట్లు ఉంటే అలాగే కుర్చీలో వాలిపోయేడు.

భర్త వెనకనే లోపలికివచ్చిన అన్నపూర్ణ అతడి పరిస్థితి గ్రహించి వెంటనే లోపలికివెళ్ళి గ్లాసులో చల్లటి మజ్జిగతేట తెచ్చింది. "ముందు దీన్ని గొంతుకలో పోసుకోండి. కాస్త స్తిమితపడి స్నానం చేస్తే భోజనం పెట్టేస్తాను" అంది.

ఒకవంక కొడుకుకోసం కంగారుపడుతూనే ఇంట్లో చేయ వలసినపనులన్నీ చేసింది అన్నపూర్ణ. కూతురికి, మనుమరాలికి తలంటి నీళ్ళు పోసింది. తప్పనిసరి అన్నట్లు ఇంత పాయసంచేసి పిల్లలకి పెట్టింది. తన్ను తాను సంబాళించుకొంటూనే ఇంట్లో మిగిలిన వాళ్ళకి ధైర్యం చెప్పసాగింది.

"వచ్చేస్తాడమ్మా వాసు....రాకుండా ఎక్కడికిపోతాడు? ఇల్లు వాకిలి వదలి తిరిగేవయసా వాడిది? ఏదో అమ్మా, నాన్నా కోప్పడ్డారని కోపంకొద్దీ అలిగివెళ్ళేడేకాని....చేతిలో డబ్బులేకుండా ఎటుపోతాడు? ఎలా పోతాడు?"

రెండోసారి డబ్బువిషయం వినేసరికి రామస్వామికి ఒక్క సారిగా ఏదో గుర్తుకి వచ్చింది. ఆ ఆలోచన మనసులోకి రాగానే చేతిలో గ్లాసు వణికి మజ్జిగ బట్టమీద పడింది.

"అదేమిటండీ.... మరీ అంతలా ఇయిపోతున్నారు?" అంటూ భర్త చేతిని అందుకొంది అన్నపూర్ణ.

"చూడు, పూర్ణా! పెద్దగదిలో మంచంకింద నందుగ పెట్టె ఉంటుంది. ఒకసారి ఇలా తే" అన్నాడు.

ఆ పెట్టె ఎందుకు? ఏముంది అందులో....అని ప్రశ్నించ కుండానే ఆ పెట్టెతెచ్చి భర్తముందు పెట్టింది అన్నపూర్ణ.

తడబడుతున్న చేతులతో పెట్టె అందుకొన్నాడు రామస్వామి. పెట్టెకి తాళంలేదు. రెండురోజులక్రిందట అందులో తెచ్చిపెట్టిన ఆరు వందలరూపాయలు మాయమయేయి. మతిపోయినవాడిలా పెట్టెలోని కాగితాల్ని కిందా మీదా చేస్తూ చూస్తున్నాడు రామస్వామి. ఎన్నిసార్లు చూసినా, నోట్లుపెట్టిన ఖాళీకవరు కనిపిస్తున్నాది. అందులో సొమ్ము మాత్రం లేదు.

"ఏమయిందండి....దేనికోసం అలా వెతుకుతున్నారు?" భర్త కంగారుచూసి ఆత్రంగా ప్రశ్నించింది అన్నపూర్ణ.

"నీతో ఆ మధ్య చెప్పేనుకదూ—ప్రావిడెంటుఫండులో లోన్ తీసుకొంటున్నానని? ఆ సొమ్ము మొన్న అందింది. ఇందులో పెట్టేను...."

"అంటే....అంటే ... ఆ సొమ్ము....ఆ సొమ్ము ..." అన్నపూర్ణ మాట పూర్తి చేయలేకపోయింది. దుఃఖంతో ఆమె కంఠం పూడుకుపోయింది.

"అంతేలా ఉంది, పూర్ణా?" తల పట్టుకొంటూ అన్నాడు రామస్వామి.

"ఈ పెట్టెలో సొమ్ము పెట్టడం వాడు చూసేడు కూడా. నిన్న ఆదివారం అయిపోయింది. ఈ రోజు పట్టుకువెళ్ళి బాంకులో వడేయా అనుకొన్నాను."

కొడుకు గంటకో, గడియకో తిరిగివస్తాడనుకొంటున్న అన్నపూర్ణ ఆ మాటతో కూలిపోయింది. ఉదయంనుంచి నిగ్రహించిన కన్నీళ్ళు ఒక్కసారిగా బావిలో ఊటలా జలజలమని ఆ తల్లి బుగ్గల మీదుగా ప్రవహించసాగేయి. "వాసూ....ఎంతపని చేసేవురా, నాయనా!" అని తల కొట్టుకొంటూ కూలబడిపోయింది అన్నపూర్ణ.

* * *

రామస్వామి అప్పుచేసి తెచ్చినసొమ్ము అనుకోని విధంగా గడప దాటిపోయింది. కాని, ఆ సొమ్ము దేనికోసం తెచ్చేడో ఆ పనులు మాత్రం ఇంకా మిగిలే ఉన్నాయి.

ఇరవై ఒకటో రోజుకి బారసాలకి వస్తామంటూ అప్పారావు దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. ఆషాఢమాసం రాకుండా అమ్మాయిని పంపించండి అంటూ అనసూయ మామగారు తాఖీదు పంపేరు. ఆ రెండు ఖర్చులకోసం తెచ్చినసొమ్ము పట్టుకొని ఉడాయించిన వాసు ఎక్కడ ఉన్నదీ అతీ గతీ తెలిసిరాలేదు.

"మీ వాసు సినిమాలో వేషాలు వెయ్యడానికి వెళతానన్నాడండి."

"మొదట పరీక్షలకిముందే వెళ్ళిపోతానన్నాడు. మళ్ళా ఎందుకో వెళ్ళలేదు."

"అక్కడ తనకి మంచి ఛాన్సువస్తే మమ్మల్నికూడా పిలుచుకుపోతా నన్నాడు."

వాడి క్లాసుపిల్లలు, స్నేహితులు చెప్పే కబుర్లు ఇలా ఉండేవి. వాళ్ళమాటలు కొంతవరకు నిజమేనేమో అనిపించింది రామస్వామికి, వాసు పుస్తకాల్లో కనిపించిన పేపరుకటింగ్స్ చూసేక. విజయవాడలో, మద్రాసులో, హైదరాబాదులో ఏవో కొత్త ఫిలింకంపెనీలు పెడుతున్నారని, వాటికి కొత్త ఏక్టర్లు కావాలని, సెలెక్ట్ చేసుకొన్నవారికి వారే ట్రెయినింగ్ ఇస్తారని—ఇలాంటివే ప్రకటనలు గల కాగితాలు కనిపించేయి.

వాసుకి చిన్నప్పటినుంచి సినిమాలు, నాటకాలు అంటే పిచ్చి ఉండేది. ఊళ్ళోకి ఏ కొత్త సినిమా వచ్చినా టిక్కెట్టు కొనో, కొనకో ఎలాగో ఒకలాగ దాన్ని చూడకుండా వదిలిపెట్టేవాడు కాదు. ఒక్కొక్కసారి పుస్తకాలకిచ్చిన సొమ్ముతో వాటిని కొనడం మానేసి, తల్లి పచారి కొట్టువాడికి ఇమ్మని ఇచ్చిన సొమ్ము పూర్తిగా ఇవ్వకుండా దాచేసి ఆ సొమ్ము సినిమాలకి, నాటకాలకి ఖర్చు చేసేవాడు.

ఆ పిల్లలు అన్నట్లు వాసు నిజంగా మద్రాసో, హైదరాబాదో వెళ్ళి ఉంటాడేమో అన్న ఆశతో అక్కడ కొన్ని ఫిలింకంపెనీలకి ఉత్తరాలు రాసేడు రామస్వామి. కొందరి దగ్గరనుంచి జవాబు లేదు. మరికొందరు అటువంటి పిల్లవాడు తమ దృష్టిలోకి ఎప్పుడైనా వస్తే తెలియజేస్తాము — అంటూ జవాబు రాసేరు.

కొడుకు కనిపించలేదన్న దిగులు ఒకవంక, జరగవలసిన ఈ రెండు శుభకార్యాలు ఎలా జరుగుతాయనే బెంగ మరి ఒకవంక రామస్వామిని రోజురోజుకు క్రుంగదీసింది. మనుమరాలి బారసాల రోజు దగ్గిర పడింది. అడగరానివాళ్ళనల్లా అడిగి, లేదనిపించుకోవడం అయింది. ఏం చెయ్యడమో, ఆ ఉపద్రవంనుంచి ఎలా తప్పించుకోవడమో మనసుకితోచక తలపట్టుకు కూర్చున్నాడు రామస్వామి.

రాజలక్ష్మి తండ్రి పడుతున్న యాతన గుర్తించి, తల్లిని పిలిచి మెల్లగా ఒకమాట చెప్పింది. కూతురినోట అటువంటిమాట విని, "అమ్మో" అని అదిరిపడింది అన్నపూర్ణ.

"నాన్నను నేను సమాధానపరుస్తాను. నువ్వు అడ్డు చెప్ప కమ్మా" అంది రాజ్యలక్ష్మి.

"మీ అత్తగారికి తెలిసిందంటే ఇంకేమైనా ఉందా! అసలే డబ్బుకి, వాళ్ళ ప్రాణానికి లంకె" అంది అన్నపూర్ణ భయపడుతూ.

"ఆ విషయాలన్నీ అటునుంచి సరుకొద్దాం....ముందు కావలసింది పని జరిగిపోవడం. ఇంతకీ ఆ చంద్రహారాలు మీరు పెట్టినవేకదా?"

రాజ్యలక్ష్మి అన్నమాట నిజమే. ఆ రోజుల్లో రామస్వామి ఆర్థికస్థితి మరీ ఇంతగా దిగజారి పోలేదు. పెద్దకూతురికి పెళ్ళి చేస్తున్నప్పుడు మెడలో పదితులాల చంద్రహారాలు, చేతికి మూడుజతల గాజులు, చెవులకు దుద్దులు, లోలాకులువంటి ఆభరణాలన్నీ పెట్టి కన్యాదానం చేసేడు. అనసూయపెళ్ళి దగ్గరికి వచ్చేసరికి అల్లుడికట్నం, పెళ్ళిఖర్చులు-వీటికి సొమ్ము కూడదీసేసరికే కటకట అయిపోయింది. ఇంక కూతురికి నగలేం వెయ్యగలుగుతాడు?

పెద్దకూతురి ఈ తొలిచూలు పురుడు, రెండోకూతుర్ని సారె, చీర పెట్టి అత్తవారింటికి అంపకం పెట్టడం....ఈ రెండు శుభ కార్యాలు ఈ సొమ్ముతో జరిగిపోతే, శారదసంగతి ఆలోచించడానికి ఇంకా సమయం ఉంది. ఆనాటికి వాసు చేతికి అందివస్తాడు. ఈ కడగండ్లు కొంతవరకు తీరుతాయి——అని ఎన్నో ఆశలు పెంచుకొన్నారు ఆ దంపతులు. వారు అనుకొన్నది అనుకొన్నట్లు జరగకపోగా, పులి మీద పుట్రలా విరుచుకుపడింది ఈ ఆపద. దీనిలోంచి తప్పుకోవడానికి కూతురు సూచించినపద్ధతి మినహా వేరు దారిలేదని అన్నపూర్ణ గ్రహించింది. అందుకే గుండె రాయిచేసుకొని రాజ్యలక్ష్మి అన్నమాటను భర్తతో చెప్పింది.

"అయిందికి ఆ నగ మనం చేయించిపెట్టిందే అయినా. ఏనాడు అల్లుడి కాళ్ళు కడిగి కన్యాదానం చేసేమో ఆనాడే అమ్మాయి.

దాని ఒంటిమీదా నగలు అన్నీ అతడిపరమై పోయేయి. కావాలను కొన్నప్పుడు పిల్లని తెచ్చి ఉంచుకోగలుగుతున్నామా—దాని నగలు మనం పెట్టినవే అని అమ్ముకోగలగడానికి" అన్నాడు రామస్వామి విదానంగా.

అతను అన్నమాట సబబుగానే అనిపించింది అన్నపూర్ణకి. ఆడపిల్ల సొమ్ము ఈరోజు వాడుకొన్నా. రేపు తిరిగి పెట్టగలస్థితిలో ఉంటే అది వేరేసంగతి. ఈ పరిస్థితిలో ఏనాటికీ ఆ అప్పు తీర్చే అవకాశంలేదని తెలిసికూడా ఆడపిల్లసొమ్ము తిని కూర్చోవడం ఎలా?

చేస్తున్నపని తప్పు అని తెలిసిఉండినా, దానిని బలవంతంగా చేయించగల శక్తి లేమికి ఉంది; అవసరానికుంది. శతవిధాల ప్రయత్నించినా ఇతరత్రా ఇంకెక్కడా సొమ్ము జతపడక, కావలసిన కార్యాల్ని వాయిదావేసే అవకాశంలేక చివరికి కూతురి నగ 'అమ్మి' ఆ అవసరం గడుపుకోవడానికే నిశ్చయించుకొన్నాడు రామస్వామి. ఎంతో ముచ్చటపడి కూతురికోసం చేయించిన ఆ నగని తీసి తెగనమ్మడానికి భర్తచేతుల్లో పెడుతుంటే కళ్ళనీళ్ళు ఆపుకోలేకపోయింది అన్నపూర్ణ.

"కాలం కలిసిరాని మనుషుల బ్రతుకులన్నీ ఇలాగే ఉంటాయి, పూర్ణా! విచారించి లాభంలేదు'' అంటూ ఆమెని ఓదారుస్తున్నా ననుకొని తన్ను తానే ఓదార్చుకో చూసేడు రామస్వామి.

సాయంత్రం ఆరుగంటలవేళ పిల్లని పక్కలో వేసుకొని పాలిస్తున్నాది రాజ్యలక్ష్మి. ఉదయంనుంచి బారసాల పీటలమీద కూర్చోవడం, పిల్లని ఉయ్యాల్లో పెట్టడంవంటి పనులతో అలసిపోయి ఉందేమో అనుకోకుండానే ఆమెకళ్ళు మూతలు పడ్డాయి. అలా ఎంతసేపు నిద్రపోయిందో, అత్తగారిపిలుపుతో ఉలిక్కిపడి కళ్ళు తెరిచింది.

''రాజూ, గొలుసేదే.... మెడ బోసిగా ఉంది?'' కోడలివంక పరీక్షగా చూస్తూ ప్రశ్నించింది కాంతమ్మ.

కలతనిద్రలోంచి త్రుళ్ళిపడిలేచిన రాజ్యలక్ష్మికి ఉన్నపళంగా ఏం చెప్పాలో అర్థం కాలేదు. ఉదయంనుంచి భుజాలమీదుగా పైట నిండుగా కప్పుకొని జాగ్రత్తపడింది. కాని, ఏదో సమయంలో అత్తగారి ఎక్స్‌రేకళ్ళకి గొలుసులేని మెడ కనిపించి తీరుతుందని ఆమెకి తెలుసు. అయినా, అది ఉరుమని పిడుగులా అప్పుడే వచ్చి మీద పడుతుంది అనిమాత్రం అనుకోలేదు. ముందు మెల్లగా ఈ విషయం భర్తతో చెప్పి అతడి సహకారంతో అత్తగారి అనుమతిలోకి తేవాలి అనుకొంది.

ఎవరికంట పడకూడదని ఆమె భయపడుతున్నాదో, ముందుగా ఆ వ్యక్తికే సమాధానం ఇచ్చుకోవలసినస్థితిలో ఇరుక్కోవడం అనుకోనివిధంగా జరిగిపోయింది.

"గొలుసు....గొలుసు" అంటూ మిగిలినమాట ఎలా పూర్తి చెయ్యాలో తోచక నోటిలోనే గొణిగివేసింది

''అదే....ఏమయింది? ఎక్కడా పారేసుకోలేదు గదా?'' అదేమై ఉంటుందో ఊహించే, ఏమీ ఎరగనట్లు ప్రశ్నించింది కాంతమ్మ.

'లేదు' అన్నట్లు బుర్ర ఊపింది రాజ్యలక్ష్మి.

''మరి'' నుదురు చిట్లిస్తూ అడిగింది కాంతమ్మ.

''బాంకులో ఉంది.'' ఏకంగా అమ్మేసేరంటే అత్తగారు మరీ ఎగిరిపడుతుందని అలా చెప్పింది రాజ్యలక్ష్మి.

''అంటే....'' విషయం పూర్తిగా వివరించి చెప్పేవరకు విడిచిపెట్టను అన్నట్లు అడిగింది కాంతమ్మ.

''నాన్నకి డబ్బు అవసరం పడి....''

''ఏమిటే....ఆడపిల్ల ఒంటిమీద నగ తీసేడా మీ నాన్న?''

కంచుగంటలాంటి తల్లి గొంతుకవిని అప్పారావు గదిలోకి వస్తూ, ''ఏమిటమ్మా?'' అన్నాడు.

''నీ మామ చేసినపని చూడరా....కూతురి గొలుసు బాంకులో పెట్టి, ఆ సొమ్ముతో మనుమరాలి బారసాల జరిపించేడు.''

''నిజంగానా, లక్ష్మీ?'' నమ్మలేనట్లు భార్యవంక చూసేడు.

రాజ్యలక్ష్మి తల దించుకొంది.

"ఎంత గుండెధైర్యం! మాట మాత్రంగా అయినా మాతో అనకుండా!" కోపంతో బుసలు కొట్టేడు అప్పారావు.

'ఆఁ, అంతే ఒప్పుకొనే ముఖాలే ఇవి' — అనుకొంది రాజ్యలక్ష్మి మనసులో.

"మళ్ళీ త్వరలోనే విడిపించేస్తాను. నాన్నని ఇప్పుడు నలుగురిలో అల్లరి పెట్టకండి." అత్తని, భర్తని బ్రతిమాలుకొంది రాజ్యలక్ష్మి.

గది బయటికివచ్చి కాస్సేపు తల్లీ కొడుకులు గుసగుస లాడేరు. ఆ మంతనాల విషయం ఏమిటో వినాలని రాజ్యలక్ష్మి ప్రయత్నించినా, పిల్లవాని ఏడుపుమూలంగా వినలేకపోయింది. 'భగవంతుడా, వాళ్ళ మనసుల్లో మంచిబుద్ధి కలిగేలా చెయ్యి. నలుగురిలో నాన్నపరువు నిలబెట్టు' అని దేవుణ్ణి మనసులోనే ప్రార్థించింది.

ఆ సమయంలో ఏదో పనిమీద అటువచ్చిన అన్నపూర్ణ కూతురి గదిలో రేగుతున్న అలజడి వింది. ఆ సమయంలో తను ఎదురుపడితే నిప్పులో నెయ్యి పోసినట్లు వియ్యపురాలు అంతెత్తు ఎగిరిపడుతుందని అక్కడినుంచి మెల్లగా జారుకొంది. అల్లుడు, వియ్యపురాలు వీధి లోకి వెళ్ళిపోయేక మెల్లగా కూతురుదగ్గరికి వెళ్ళింది.

"వాళ్ళతో చెప్పేసేను" అంది రాజ్యలక్ష్మి.

"ఏమన్నా రేమిటి?" ఆత్రంగా ప్రశ్నించింది అన్నపూర్ణ.

"ఏమీ అనలేదు."

"నిజంగా?"

ఆ తల్లీ, కొడుకులతత్త్వం తెలిసిఉన్న అన్నపూర్ణ, ఆ మాట నమ్మలేకపోయింది. తను బాధ పడుతుందని కూతురు నిజం చెప్పడంలే దనుకొంది. కాని, రాత్రి భోజనాలసమయంలో అల్లుడుకాని, వియ్యపు రాలుకాని చంద్రహారాలవిషయం ఎత్తకపోవడంతో కూతురు అన్న మాట నిజమే అన్న నమ్మకం కలిగింది ఆమెకి.

తమపై విరుచుకుపడ్డ కష్టం చూసేక అల్లుడిమనసు కరిగి ఉంటుంది. అందుకే ఏదోవిధంగా [illegible]

వాళ్ళు పెట్టిన నగేకద. కాస్త కాలు, చెయ్యి కూడదీసుకొని వాళ్ళే విడిపిస్తారు. ఆడపిల్ల సొమ్ము వాళ్ళుమాత్రం తిని కూర్చుంటారా— అని బోధపరిచి ఉంటాడు.

ఆ రాత్రంతా ఇలాగే ఎన్నోరకాల అనుకొంది అన్నపూర్ణ. కాని, పూర్తిగా తెల్లవారకముందే పెట్టే బేడా సిద్ధంచేసుకొని కోడల్ని, మనుమరాల్ని వెంట తీసుకుపోతామని కాంతమ్మ ప్రయాణం కావడంతో ఆ కాస్త భ్రాంతి తీరిపోయింది. పుర్రెకి పుట్టిన బుద్ధి పుడకలతోకాని వదలదని ఇందుకే అంటారు. మనుషుల స్వభావాలు, ఆలోచనలు ఇంత సులువుగా మారిపోతాయా తన పిచ్చి కాని—అనుకొంది.

"నువ్వే బాధపడకమ్మా! ఈరోజు కాకుంటే మరో నెలనాడైనా వెళ్ళవలసినదాన్నే కదా! నా ఇంటికి నేను వెళుతున్నానే కాని, ఎక్కడికో అడవులుపట్టి పోవడం లేదు. ఈ ఉప్పెన ఇంత సులువుగా తేలిపోతుందని నేను కలలోకూడా అనుకోలేదు. అదే నాకు సంతోషంగా ఉంది" అంది రాజ్యలక్ష్మి, తల్లిని ఓదారుస్తూ.

తప్పు తమలో ఉంచుకొని ఎదుటివారిని ఏమనగలరు? మనసులో బాధ పడుతూనే కూతురిముఖాన బొట్టుపెట్టి, "క్షేమంగా వెళ్ళిరా. తల్లీ" అంది అన్నపూర్ణ.

రాజ్యలక్ష్మి ఆనాడు అత్తింటికి వెళ్ళడమైతే వెళ్ళింది కాని, ఏడాది గడుస్తున్నా తిరిగి పుట్టింటికి రావడం అంటూ జరగలేదు. పండుగలకి, పబ్బాలకి మామగారు ఎన్నిసార్లు పిలిచినా తను రావడం కాని, భార్యని పంపడంకాని చెయ్యలేదు అప్పారావు. "ఏడాది దాటకుండా పుట్టినచోటు చూడాలంటారు. మీకు అవకాశం లేకపోతే అమ్మాయిని, మనుమరాలిని నేనువచ్చి తీసుకువెళతాను" అని అల్లుడికి ఉత్తరం రాసేడు రామస్వామి. అంతకుపూర్వం రాసిన ఎన్నో ఉత్తరాలకి జవాబురాయని అప్పారావు, ఆ ఉత్తరానికిమాత్రం వెంటనే జవాబు రాసేడు. అల్లుడి దగ్గరినుండి ఇంతకాలానికి ఉత్తరం వచ్చింది, 'ఏం రాసేడా' అని ఆత్రంగా చదువుకొన్నాడు రామస్వామి. "చంద్ర

హారాలుతెచ్చి చేతిలో పెట్టిననాడే మీ పిల్ల మీ ఇంటిగడప తొక్కేది. వస్తువుమాట ఎత్తకుండా ఇంక ఇటువంటి ఆహ్వానాలు అనవసరం."

చావుబ్రతుకులమధ్య మనిషి ఉన్నప్పుడే ఏమవుతుందని ఆత్మీయులకు ఆరాటం. ఏదో ఒకటి తేలిపోతే ఆ సంఘటనవల్ల సంతోషం కలిగినా, దుఃఖం కలిగినా ఆరాటంమాత్రం తొలగిపోతుంది.

సరిగా ఇటువంటి స్థితిలోనే పడిపోయింది అన్నపూర్ణ. తన చేతిలో ఏమీ లేదనీ, ఎలా జరగాలని రాసిపెట్టిఉంటే అలా జరక్కమానదనీ చేతకానివాడికి ఆసరాగా నిలిచే అటువంటి వేదాంతంలోకి జారిపోయేడు రామస్వామి.

రోజులు, నెలలు, సంవత్సరాలు ఆ యింట భారంగా, నిరుత్సాహంగా దొర్లసాగేయి. వాసు ఉనికి తెలుసుకోవడానికి రామస్వామి చేసిన ప్రయత్నాలన్నీ బూడిదలో పోసిన పన్నీరు చందంగా నిరుపయోగమయేయి. ఇదిగో ఈ ఊళ్ళో చూసేమని' అదిగో ఆ నాటక కంపెనీవాళ్ళతో ఉన్నాడనీ వీళ్ళు వాళ్ళు చెప్పినమాటల్ని పట్టుకొని కొడుకుకోసం ఏళ్ళతరబడి తిరిగిన రామస్వామి ఇంక తిరిగే ఓపిక లేక, అలా ఊళ్ళుపట్టుకు తిరగడానికి ఆర్థికంగా శక్తిలేక, బ్రతికి బాగుంటే, తనవాళ్ళు అన్న అభిమానం వాడికుంటే, ఏదో నాటికి అమ్మని, నాన్నని వెతుక్కొంటూ వాడే వస్తాడు అన్న గుడ్డి నమ్మకంతో ఇంక అటువంటిప్రయత్నాలు మానుకొన్నాడు.

అంతవరకు తనజీవితంలో ఏమున్నా లేకున్నా, కడుపున పుట్టిన పిల్లల్ని చూసుకుని తృప్తిగా బ్రతుకు లాక్కొస్తుండేది అన్నపూర్ణ. వాసు ఇల్లు వదిలిపోవడం ఆమెకి తట్టుకోలేని దెబ్బ అయితే, అనసూయ కాపురం నూటిలేకపోవడం తగిలినచోటనే మళ్ళీ దెబ్బ తగిలి చిట్లినట్లయింది.

మగవాడి అభివృద్ధి ఆడదాని అదృష్టాన్నిబట్టి ఉంటుంది అంటారు. పెళ్ళినాటికి బి. ఏ. పరీక్షలు రాసిన గోపాలకృష్ణ మంచి మార్కులతో ఆ పరీక్ష పాసయేడు. ఆ పైని బి. ఇడి. ట్రెయినింగు అయి, చదివిన కాలేజీలోనే ఉద్యోగం సంపాదించుకొన్నాడు. అదంతా తన కూతురి అదృష్టమే అని పొంగిపోయింది అన్నపూర్ణ.

కాని, ఆ పొంగు పాలపొంగే అయింది. అనసూయ కాపురానికి వెళ్ళిన ఆరేడు నెలలకే అల్లుడి అసలురంగు బయటపడింది. భార్యకి చదువు లేదుట. నలుగురిలో తిరగడం చేతకాదుట. నాగరికత బొత్తిగా తెలియదుట. కట్నానికి ఆశించి తల్లీ, తండ్రి తన మెడకి తగిలించేరట ఈ గుదిబండని. ఈ ధోరణిలో ఉండేవి అతడి మాటలు.

"మొగుణ్ణి చెప్పుచేతల్లో ఉంచుకొనే తెలివితేటలు ఆడదానికి ఉండాలి. మీ పిల్లకి ఆపాటి చాకచక్యం లేకపోతే మేమేం చెయ్యగలం?" అంటూ తమమీద నిందపడకుండా తప్పుకుపోయేరు అత్తమామలు.

ఆ కూతురి సంసారం ఆ తీరు, ఈ కూతురి కాపురం ఈ తెన్ను. చేతికి అంది వస్తాడనుకొన్న కొడుకు దేశాలపాలు అయేడు. గుండెల్ని పిండే ఇటువంటి ఆరాటాలతో ఆ నాలుగేళ్ళకే నాలుగు పదులు పైబడ్డ మనిషిలా అయిపోయింది అన్నపూర్ణ. జుట్టు నెరిసిపోయి. దవడలు లోతుకుపోయి ఒక్కసారిగా ముసలిరూపు వడిపోయింది.

రామస్వామిసంగతి చెప్పనే అక్కరలేదు. అదివరలో చుట్టపుచూపుగా ఎప్పుడో వచ్చిపోతుండే ఉబ్బసం, ఇప్పుడు ఇల్లరికపు అల్లుడిలా ఒంటిలో తిష్ఠవేసుకొని కూర్చుంది. వారంరోజులు పనిలోకి వెళితే మూడురోజులు సెలవు అన్నట్లు తయారయింది అతడి ఉద్యోగం. రావలసినజీతం రాళ్ళు కోతమూలంగా సగానికిసగం అయిపోయేవి. వాటితో మందులే తింటాడా ....డాక్టర్లకి ఫీజులే ఇస్తాడా.... ఇంట్లోకి ఉప్పు, పప్పు, బియ్యమే తెస్తాడా? ఆ ఇంట ఇలా రోజులు గడవడమే కష్టంగా ఉంటే, వయసుపై రోజుకిరోజు కలుపుకొంటూ పెరిగి పెద్దది కాసాగింది శారద.

శారద తండ్రిలా ఎత్తరి. పన్నెండేళ్ళు నిండేసరికే పదిహేనేళ్ళ పిల్లలా ఉండేది. వల్లెవాటు వెయ్యడం మొదలుపెట్టేసరికి, "అన్నపూర్ణా! కూతురిపెళ్ళి ఎప్పుడు చేస్తావు?" అంటూ ప్రశ్నించడం మొదలుపెట్టేరు అమ్మలక్కలు.

ఇద్దరు ఆడపిల్లల పెళ్ళిళ్ళతో తల బొప్పికట్టిన రామస్వామి, శారద పెళ్ళికి అంతగా తొందరపడలేదు. తను తొందరపడ్డా, భర్త అప్పుడు కూతురికి పెళ్ళిచేసేస్థితిలో లేడని అన్నపూర్ణ ఊరుకొంది.

శారదా ఏక్టు అమలులోకి వచ్చిన మొదటిరోజుల్లో కొంత కాలంవరకు చిన్నపిల్లలకి రహస్యంగా పెళ్ళిళ్ళు చేస్తుండేవారు, పిల్ల పెద్దమనిషి అయేక పెళ్ళిచేస్తే కన్యాదానఫలం దక్కదని—అటువంటి నమ్మకాలు ఉన్నవాళ్ళు. అలా కొంతకాలం సాగేక, ఆ ఏక్టు కాగితాల్లోంచి మనుషుల మనస్సులోకి రవాణా అయింది. ఈనాడు రజస్వలానంతరం వివాహాలు సర్వసాధారణం అయిపోయేయి.

అదేవిధంగా ప్రస్తుతం కాగితాలకే పరిమితమై ఉన్న వరకట్న నిషేధం బిల్లు ఏనాటికైనా నిజంగా ఆచరణలోకివస్తే అప్పుడు తన కూతురికి పెళ్ళి కావాలి అనుకొనేవాడు రామస్వామి.

కాని, వరకట్ననిషేధం బిల్లు డబ్బుతో ముడిపడిఉన్న విషయం. అందువల్లనే కాలం గడుస్తున్నా ఆచరణలోకి రాకుండా ఇంకా కాగితాల్లోనే మిగిలిపోయింది. ఈ బిల్లువల్ల వచ్చినమార్పు కట్నకానుకలు తగ్గడం కాదు. పూర్వపురోజుల్లో, అంటే ఈ బిల్లు ప్రవేశపెట్టక పూర్వం, అల్లుడికి ఇంత కట్నం ఇస్తున్నానని కన్యాదాత ఘనంగా చెప్పుకోవడానికి, పెళ్ళినాడు నలుగురియెదుట పందిట్లో చదివించడానికి ఉండేది. ఇప్పుడు పెళ్ళికి ముందుగానే కట్నపుసొమ్ము అణాపైసలతో లెక్కచూపి వియ్యాలవారిచేతిలో పెట్టవలసి రావడంచేత ఆపాటి గౌరవంకూడా ఆడపిల్ల తండ్రికి మిగలకుండా పోయింది. ప్రస్తుత పరిస్థితి అంత ఆశాజనకంగా లేకపోయినా, ఏదోనాటికి ఈ చట్టం వాస్తవంగా అమలులోకి వస్తుందని, ఆనాడే తన కూతురులాంటి ఆడపిల్లలకి తనవంటి ఆర్థిక స్తోమతులేని తండ్రులు పెళ్ళి చెయ్యగలుగుతారని అనుకొనేవాడు రామస్వామి. బంధుమిత్రుల్లో ఎవరైనా మరీ నిలదీసి అడిగితే - "చదువుకొంటున్నాది. పెళ్ళికి తొందరేమిటి?" అనేసేవాడు, అప్పటికి తప్పించుకొంటూ.

మనసుని సమాధాన పెట్టుకోవడానికి ఇటువంటిమాటలు ఎన్ని అనుకొంటున్నా, ఈడేరిన ఆడపిల్లని ఇంట్లో పెట్టుకు కూర్చోవడం అన్నపూర్ణకి కష్టంగానే ఉండేది. ఆమె ఆరాటం కాదనలేక ఏవో ఇవీ, అవీ సంబంధాలు చూస్తూనే ఉండేవాడు రామస్వామి. కొన్ని సంబంధాలు కట్నకానుకలదగ్గర ఆగిపోతే, మరికొన్ని వీరింటి ఆర్థిక స్థితిగతులు తెలుసుకొని పెళ్ళి చూపులకే రాకుండా నిలిచిపోయేవి. ఈ గిరులు దాటుకొని ముందుకి వస్తున్న సంబంధాలు చూస్తుంటే, అంతకన్న పిల్లనోటిలో ఇంత నల్లమందు నూనెనూరి పొయ్యడమో, నాలుగు నిద్దరమాత్రలూ మింగపెట్టడమో మంచిది అనిపించేది రామస్వామికి.

బ్రహ్మచారి ముదిరినా, బెండకాయ ముదిరినా ఉపయోగం లేకుండా పోతుందని ఒక సామెత. ఆ మాటల్ని యతిప్రాసలు కుదిరేయని ఎవరో ఉపయోగించి ఉంటారే గాని, అందులో నిజం అణుమాత్రంగానైనా లేదని ఆ రోజు తండ్రి తెచ్చిన సంబంధం చూసేక అనుకొంది శారద.

నిజానికి మగాడిపెళ్ళికి అతడి వయసుతోకాని, అంతకిపూర్వం జరిగిన వివాహాలతోకాని సంబంధం లేదు. నాలుగురాళ్ళు దగ్గర ఉంటే ఏ వయసులో ఉన్నవాడికైనా పిల్లనివ్వడానికి కొందరు తలిదండ్రులు, చేసుకోవడానికి కొందరు ఆడపిల్లలుకూడా సిద్ధంగా ఉంటారు. వారికి కావలసింది వరుడి వయసు కాదు; అతడి గుణగణాలు, అందచందాలు కావు, అతడు హరీ అంటే తమచేతిలో పడేడబ్బు, దానితో కొనుక్కో గలిగే సుఖాలు.

అన్నపూర్ణకి గుడ్డిలో మెల్ల అన్నట్లు అంతవరకు చూస్తున్న సంబంధాల్లో ఆ సంబంధం కాస్త నయంగా ఉన్నట్లు అనిపించింది. కాని, డబ్బు కట్నం కోరకపోవడం, వరుడికి తిండితిప్పలకి తగినంత భూ వసతి ఉండడం ఆ సంబంధం పరంగా కనిపించే మంచివిషయాలు. ఇంతకిమించిన ఆశలకిపోతే తాము ఎప్పటికీ కూతురికి పెళ్ళి చెయ్యలేము అన్న ఆలోచన ఒకటి. అందుకే భర్తతో చెప్పి, గాని

నాన్నల మాటకి 'మీ ఇష్టం' అంటూ తల ఊపలేను. "నేను పెళ్ళి చేసుకోను" అంది ఖండితంగా.

అన్నపూర్ణ ఏదో వినరానిమాట వింటున్నట్లు, ఆ మాట అంటున్నది తన కూతురు శారద కానట్లు ఆశ్చర్యం ప్రకటించింది.

"పెళ్ళిచేసుకోక ?" తండ్రి కూతురివంక నిదానంగా చూస్తూ, ఆ పిల్ల మనసులో తిరుగుతున్న ఆలోచన లేమిటో తెలుసుకోవాలన్నట్లు ప్రశ్నించేడు.

"చదువుకొంటాను." నిశ్చలంగా జవాబు చెప్పింది శారద.

"చదువుకొని ?"

"ఉద్యోగం చేస్తాను—"

"ఆ తరువాత ?"

"ఆ తరువాత....ఆ తరువాత...."ఏం చెప్పాలో శారదకి పాలుపోలేదు. అసలు ఇటువంటి ప్రశ్నకి తను జవాబు చెప్పవలసి ఉంటుందన్న ఆలోచనే ఆ పిల్ల మనసులోకి రాలేదు.

ఆడపిల్లలు ఎంత చదువులు చదివినా, ఎంతకాలం ఉద్యోగం చేసినా, ఏదోనాటికి పెళ్ళికి సిద్ధం కావలసిందేననీ, భర్త అన్నవాడి అధికారానికి లోబడి బ్రతకవలసిందేనని, కావాలనుకొన్నా పెళ్ళి చేసుకోకుండా ఆడది పరువుగా బ్రతకగలిగే సాంఘికపరిస్థితులు మన దేశంలో ప్రస్తుతానికి కనుచూపుదూరంలో ఎక్కడా కనిపించడం లేదని, నవీననాగరికతతో విలసిల్లుతున్న పెద్దపెద్ద నగరాల్లో ఈనాటికీ పొద్దుపోయేక ఆడది ఒంటరిగా బయటికివెళ్ళితే క్షేమంగా ఇంటికి రాగలదనే గారంటీ లేకుండాపోయిందనీ, ఏ కారణంవల్లనైనా పెళ్ళి ఇష్టం లేకపోతే మగవాడు బ్రహ్మచారిగా ఉండిపోవచ్చునని, అదే ఆడదైతే ఆ జీవితాన్ని నెట్టుకు రావడానికి ఎన్నో మనోవ్యథలు, మరెన్నో అవమానాలు అందుకోవలసి ఉంటుందనీ....

ఆలోచించేపాటి వయసుకూడా ఆ పిల్లకి లేదు. ఆ పెళ్ళికొడుకు తనకి నచ్చలేదు. అక్కల పెళ్ళిళ్ళు చేసి అమ్మా, నాన్నా పడుతున్న అగచాట్లు చూస్తున్నాది. బస్....ఇంకేముంది? 'నే పెళ్ళి చేసుకోను' అని తెగేసి చెప్పేసింది. అందుకే, 'ఆ తరవాత ఏం చేస్తావు' అని తండ్రి అడిగినప్రశ్నకి తనదగ్గిర సమాధానం లేదు. "అప్పటికి ఏదో ఒకటి ఉండకపోదు. కావాలనుకొంటే ఈపాటి పెళ్ళికొడుకు అప్పుడు దొరక్కపోడు" అంది విసుగ్గా.

"నీ ఇష్టం" అన్నారు తల్లి, తండ్రి.

ఆ మాటకి ఒకటే అర్థం. ఇంతకు మించిన సంబంధం తెచ్చే శక్తి మాకు లేదు. ఇదే చేసుకో అని ఇబ్బందిపెట్టి, అందుమూలంగా ఉత్పన్నమయే సమస్యల్ని నెత్తిన వేసుకొనే ఓపిక కూడా లేదు—అని.

తాము ఎంచిచేసిన ఇద్దరు ఆడపిల్లల సంసారాలు అలా తయారయేయి అన్న నిరుత్సాహం ఒక వంక, ఈ రోజుల్లో అంతా చేస్తున్న పనే, పిల్ల చదువుకొంటాననంటున్నాది, కానీ ఇదీ చూద్దాం అన్న సమర్థింపు ఇంకోవంక ఆ దంపతులచే తెగింపుగా ఆ మాట పలికించింది.

శారద చదువుకొని ఉద్యోగంచేస్తే ఇంటికి ఆర్థికంగా కాస్త సహాయపడగలదనే స్వార్థంకూడా అందులో కొంత లేకపోలేదు, ఆడపిల్లలు చదువుకోవడం, ఉద్యోగాలు చెయ్యడం తమ ఒక్క ఇంటనే పుట్టే వింత కాదు. ఎన్నో ఇళ్ళలో చూస్తున్నసంగతే అన్న ధైర్యం వారినోట ఆ మాటగా పలికించింది.

కర్ణుడి చావుకి కారణాలు అన్నట్లు, శారద చదువు కోటాకు వెయ్యకుండా ముందుకి సాగడానికి ఇన్ని అనుకూలశక్తులు సాయపడ్డాయి. అయితే ఎక్కడ చదివించడం, ఎలా చదివించడం అన్న ప్రశ్నమాత్రం ఇంకా ప్రశ్నగానే మిగిలి ఉంది. ఆ ఊళ్ళో కాలేజీ లేదు. ఎక్కడో హాస్టల్లో పెట్టి చదివించాలంటే మాటలతో పని కాదు. పైగా ఆడపిల్లని ఒంటరిగా పట్నంలో వదలడం మంచిపని కాదు. మరి శారద చదువు ఎలా సాగుతుంది?

ఇంట్లో ఈ విషయమై తర్జనభర్జనలు సాగుతున్నసమయంలో, అనుకోకుండా ఆకాశంనుంచి ఊడిపడ్డ తారలా మాలతి వచ్చింది. నిజంగా ఆ దేవుడే తనకోసం అలా మాలతి అత్తను పంపేడు అనుకొంది శారద.

మాలతి రామస్వామికి పెద్దతల్లి కూతురు. ఆమె భర్తతరపు బంధువులఇంటికి పెళ్ళికి వెళుతూ దారేకదా అని అన్నగారిని చూడ్డానికి అక్కడ దిగింది. శారద చదువువిషయం చెపితే—"చాలా మంచి పని చేస్తున్నారు, వదినా! ఈ రోజుల్లో మగాడికైనా, ఆడదానికైనా విధిగా ఒక డిగ్రీ ఉండాలి. ఆడపిల్లలవిషయంలో ఆవెనక పెళ్ళి చేసుకోవడం, ఉద్యోగం చెయ్యడం అన్నది వాళ్ళ ఇష్టాలమీద, అవసరాలమీద ఆధారపడి ఉంటుంది" అంది.

పట్నంలో ఒంటరిగా పిల్లనుంచి చదివించడంలో గల సాధకబాధకాలగురించి మాట్లాడింది అన్నపూర్ణ.

"దానికింత ఆలోచనేమిటి? మేము ఉండగా శారదని ఇంకోచోట పెట్టడం ఎందుకూ? నాలుగేళ్ళు ఎంతలో గడిచిపోతాయి" అంది మాలతి.

అటువంటిమాటలు మాలతి అంటుందని అన్నపూర్ణకి తెలుసు. నిజానికి ఆమెనోట ఆ మాట అనిపించాలనే అప్పుడు ఆ ప్రస్తావన తెచ్చింది. కాని, తీరా ఆమె ఆ కాస్తమాట అన్నాక మాలతితో తన పిల్లని పంపడం మంచిదేనా, నాలుగేళ్ళపాటు ఆ వాతావరణంలో శారదని విడిచిపెట్టడం ఉచితమైన పనేనా—అనే ఆలోచనలో పడిపోయింది.

ఆమెకి అటువంటి సంశయం రావడానికి కారణం లేకపోలేదు.

మాలతి వాళ్ళింటి తీరుతెన్నులు అదోలా ఉంటాయి. ఇంటితో ఎవరికీ బాధ్యత, బంధనం ఉన్నట్లు తోచదు. ఎవరి వేళల్నిబట్టి వాళ్ళు వస్తుంటారు, పోతుంటారు. మహిళాసంఘాలు, సభలు, సమావేశాలు అంటూ ఏదో ఒకటి పెట్టుకొని తిరుగుతుంటుంది మాలతి. ఆమె భర్త రఘునాథరావు. 'అన్నం తినిందికే తీరుబాటు లేదు, ఊపిరి

ఆ పనులేమిటో చూసేవాళ్ళకి అర్థం కావు. అలాగని గాలికి ఎగిరే ఎండుటాకుల్లా ఒక మార్గం, గమ్యంలేకుండా తిరుగుతారనీ కాదు. అటువంటి జీవితాలకి అలవాటుపడ్డవాళ్ళకే వాటి ఆది, అంతం తెలుస్తుంది. అర్థం, పరమార్థం బోధపడుతుంది. అలాకాక నాలుగు రోజులు చుట్టపుచూపుగా చూసిపోయేవాళ్ళకి అదంతా ఏదో అర్థంకాని ఆటలా కనిపిస్తుంది. దానిలో వెనకెవరో, ముందెవరో తెలియకుండా వలయంలా అనిపిస్తుంది ఆ జీవితం.

వారింట పిల్లలసంగతి మరీ తమాషాగా ఉంటుంది. ఎదురుగా తల్లీ, తండ్రీ ఉంటే మమ్మీ, డాడీ అంటూ ఎంతో చనువుగా, ఆప్యాయంగా మాట్లాడుతారు. అదే వాళ్ళు బయటికి వెళ్ళిపోతే ఇంక వాళ్ళ ఊసే తలవరు.

వారింట ఒక వారంరోజులు ఉండి వచ్చేసరికి అన్నపూర్ణకి ఆ సంసారపు తీరుతెన్నులు అయోమయంగా తోచేయి. ఒకరోజు తల్లి డిన్నర్‌పార్టీకి వెళితే మంచంమీద ఒంటరిగా నిద్రకి జోగుతున్న రాజుగాడిదగ్గిరికి వెళ్ళి, "రాజూ, అమ్మలేదని భయపడకు, బాబూ.... అమ్మ వచ్చేదాకా నేను నీదగ్గరే ఉంటాను" అంటూ అభిమానంతో దగ్గరికి తీసుకొంది అన్నపూర్ణ.

"అత్తా, భయం ఎందుకూ....అమ్మ పార్టీకి వెళ్ళింది. మళ్ళీ వచ్చేస్తుంది" అంటూ ఆరేళ్ళ ఆకుర్రాడు అటునుంచి ఇటు అన్నపూర్ణకి ధైర్యం చెప్పసాగేడు.

అనసూయ తోటిపిల్లే అరవింద. తల్లీ, తండ్రీ ఇంట్లో లేనప్పుడు ఎవరైనా ఇంటికివస్తే వాళ్ళతో పెళపెళమని ఇంగ్లీషులో మాట్లాడేసేది. ఎప్పుడైనా కొత్తవారితో ఇంగ్లీషులో మాట్లాడవలసివస్తే రామస్వామికి మాటలు తడబడ్డం, మాటిమాటికి పెదవులు తడుపుకోవడం అన్నపూర్ణకి తెలుసు. ఇంత చిన్నపిల్ల ఎంతచక్కగా ఇంగ్లీషులో మాట్లాడేస్తున్నాది అని ఊరంత ముచ్చట పడిపోయేది అరవిందని చూసి.

అనసూయ పెళ్ళికి తల్లితోపాటు తనూ వచ్చింది అరవింద. చిన్నపిల్లలా ఫ్రాకులు, పొట్టి పరికిణీలు కట్టుకొనేది. ఆ పిల్ల ముందు పైట వేసుకొన్న అనసూయ ఎంతో పెద్దదానిలా కనిపించేది.

ఎంత పట్నంలో ఉన్నా ఈడొచ్చినపిల్లకి పైట వేయించకుండా మాలతి అలా తిప్పడం అన్నపూర్ణకి నచ్చలేదు. ఆ మాట మనసులో నిలుపుకోలేక ఒకసారి అడగనూ అడిగింది.

"అవన్నీ పూర్వపు రోజులు, వదినా! ఇప్పుడు ఇరవై ఏళ్ళు పైబడ్డవారే పైట వేసుకోకుండా శల్వారు, కమీజులని, లుంగీ, జుబ్బాలని తొడుక్కు తిరుగుతున్నారు. అప్పుడే అదేం తొందర?" అంటూ తేల్చిపారేసింది.

రఘునాథరావు విదేశాలకువెళ్ళి ఏవేవో పరీక్షలు ప్యాసై వచ్చేడట. అతను తిరిగి వచ్చిననాడు రామస్వామి ఎంతో సంతోషించేడు. మన ఇంట్లో ఇంత చదువుకొని, పేరు ప్రఖ్యాతులు తెచ్చుకొన్నవాళ్ళు ఇంకెవరూ లేరని. అతడు చదివిన చదువుకి తగినట్లే మంచి ఉద్యోగం కూడా దొరికింది. ఆ చదువు లేమిటో, ఈ ఉద్యోగా లేమిటో అన్నపూర్ణకి తెలియవు. తిండికి, గుడ్డకి కొదువలేకుండా పిల్లా పాపాతో హాయిగా బ్రతుకుతున్నారు అంతే చాలు అనుకొనేది.

అతడు కార్యం కథానాడైనా బంధువుల ఇంటికి వచ్చేవాడు కాడు. ఒకవేళ వచ్చినా చేతి వాచీ చూసుకొంటూ పందిట్లో పది నిమిషాలు నిలబడి అటునుంచి అలాగే వెళ్ళిపోయేవాడు.

"ఆయనకి ఇటువంటి సందట్లో ఉండటం అలవాటు లేదు వదినా, మీరు మరోలా అనుకోకండి. ఆయనవంతు, నా వంతు కూడా మీరు పొమ్మనేదాకా నేను ఉంటానుగా" అనేది మాలతి.

మాటకి అలా అన్నా ఆమెకూడా నాలుగురోజులకి మించి ఎక్కడా పై చోట ఉండలేకపోయేది. వాళ్ళ తిళ్ళు, ఉనికి, అలవాట్లు వేరు. ఉండమని బలవంతపెట్టి ఆమెని బాధపెట్టడం ఎందుకని ఆమె వెళతానంటే ఊరుకొనేది అన్నపూర్ణ.

ఇప్పుడు శారదని తమ ఇంటికి పంపమంటున్నాది మాలతి. శారద నాలుగేళ్ళపాటు అటువంటి జీవితానికి అలవాటుపడితే మళ్ళా ఈ ఇంటికివచ్చి ఉండగలదా, ఇటువంటి జీవితంతో రాజీపడి బ్రతగ్గలదా?

నాలుగేళ్ళు ఎంతలో గడిచిపోతాయి అంటూ అతి తేలిగ్గా అనేసింది మాలతి. కాని శారీరకంగా, మానసికంగా ఇప్పుడిప్పుడే పెరుగుతున్న కూతురు జీవితంలో ఈ నాలుగేళ్ళకాలం ఎంత విలువైనది। పైపై మెరుగుల వ్యామోహంలో పడి శారద ఈ కాలాన్ని దుర్వినియోగం చేసుకొంటే? బ్రతుకులో అవాంఛనీయమైన విలువల్ని ఏర్పరుచుకొంటే?

మాలతి ఇవ్వజూపిన సహాయానికి జవాబుగా వెంటనే ఏ మాట అనిందికి అన్నపూర్ణకి పాలుపోలేదు. "ఇంకా సమయం ఉంది కదా। చూద్దాం" అనేసింది అప్పటిమట్టుకి పట్టుపడకుండా.

# 3

మూడోతరగతి పెట్టెలు మనుషులతో కిటకిట లాడుతున్నాయి.

ఆడవాళ్ళ పెట్టె ఇంకా అధ్వాన్నంగా ఉంది. కాలు పెట్టేందుకైనా వీలుకాకుండా సామాన్లు, మనుషులు, పిల్లల ఏడుపులు, పెద్దవాళ్ళ దండింపులు. చంటివాళ్ళ అవశిష్టాలు. నాయురాళ్ళ చుటపొగలు. ఒలిచిపోసిన వేరుశెనగ తుక్కులు, తిని పారేసిన అరటిపండు తొక్కలు —నిజంగా పబ్లిక్ పాయిఖానాలాగా, వీధి చివర చెత్తడబ్బాలాగా గత్తరతో, భరించ నలవికాని కంపుతో ఉంది.

“కాస్తసేపుకే కదా.... ఈ పక్కపెట్టెలో ఎక్కుతాను” అంది శారద. అంతకన్న కాస్త నయంగా ఉన్న మూడవతరగతి మగవాళ్ళ పెట్టెవంక చూస్తూ.

అప్పుడే గాలి తిరిగిందా—అన్నట్లు చూసింది అన్నపూర్ణ.

“ఈడొచ్చిన ఆడపిల్లవి. రాసుకొంటూ, తోసుకుంటూ మగాళ్ళ మధ్య ఎలా ప్రయాణం చేస్తావు” అంది కూతుర్ని అదిలిస్తూ.

ఆదిలోనే హంసపాదు అన్నట్లు ఉన్న ఊరునుంచి ఇంకా తిన్నగా కాలైనా బయటపెట్టకుండా తల్లితో జగడానికి దిగితే జరిగేది ఏమిటో శారదకి తెలుసు. అందుకే ముక్కు మూసుకొని ఈ మూడు గంటలు ఎలాగో నిలబడితే వదిలిపోతుంది ఈ పీడ అనుకొని ఆడవాళ్ళ పెట్టెలోకే ఎక్కింది.

ముందు మెల్లగా తను చోటు చేసుకొని లోపలికి దూరి, తండ్రి

ఘుగ్గురి తలలకి ఢీకొట్టి, క్రిందికి దింపుతూ మరికొందరి కాళ్ళమీదుగా ఈడ్చి వీరిచేత, వారిచేత దీవనలు అందుకొని మెల్లగా బెంచీకిందికి చేర్చింది.

"ఇదిగో అప్పడాల డబ్బా....ఓగేటప్పుడు మరిచిపోయేవు సుమా? మాలతికి ఇష్టం అని నువ్వుపప్పువేసి వత్తేను" అంటూ ఒక పాత చీనారేకు డబ్బాని కూతురికి అందించింది అన్నపూర్ణ.

కూతురితో సహా సామాన్లు అన్నీ పెట్టెలోకి చేరేయి అని నమ్మకం కలిగేక కొంత స్థిమితపడి, అంతకుపూర్వం వందసార్లకి పైగా చెప్పిన విషయాల్నే మళ్ళా మొదలుపెట్టింది అన్నపూర్ణ.

'అమ్మకి మరీ ఇంత చాదస్తం ఏమిటి? ఎన్నిసార్లు చెపుతుంది' అనుకొంటూ మనసులోనే విసుక్కొంది శారద.

కూతురి ముఖంమీద విసుగుదలని చూసిన తండ్రి—"అమ్మ ఇన్నిసార్లు చెపుతున్నాదని విసుక్కోవడం కాదమ్మా. అన్నిసార్లు ఎందుకు చెబుతున్నాది అని ఆలోచించాలి" అన్నాడు అనునయంగా.

"అలాగే, నాన్నా....నా కాపాటి తెలియదా ...మరీ చంటి పిల్లకి చెప్పినట్లు అన్నిసార్లు చెప్పాలా?" అంది శారద.

"ఈడొచ్చిన పిల్లకి పెళ్ళిచెయ్యకుండా ఇలా పై చోటికి పంపడమే నా కిష్టం లేదు. పరిస్థితులు బాగులేక, మాకు కట్నంపోసి పెళ్ళి చేసే శక్తిలేక, నువ్వు చదువుకొంటానని సరదా పడుతున్నావని...."

అన్నపూర్ణ మాట పూర్తి కానేలేదు. రైలు కూతవేసి బయలు దేరింది.

"వెళ్ళొస్తా, అమ్మా....వెళ్ళగానే ఉత్తరం రాస్తాను, నాన్నా" అంటూ శారద చెయ్యి ఊపింది.

జీవితంలో మొదటిసారిగా ఒంటరిగా బ్రతుకుబాటవెంట ప్రయాణం చేస్తున్న శారదకు దూరమైపోతున్న తల్లిని, తండ్రిని చూసేసరికి మనసుకి ఏదో బాధకలిగి కళ్ళలో నీళ్ళు తిరిగేయి. ఈనాటి వరకు శారద అనే ఈ చిన్నారి మొగ్గకి తలిదండ్రులు అనే రక్షక పత్రాలు ఉండేవి. మొగ్గ పెరిగి, పెద్దదై పువ్వుగా వికసించింది. ఇంక

తమ అవశ్యకత లేదన్నట్లు క్రిందికి వాలిపోయేయి, అంతకాలం ఆ మొగ్గని శీతోష్ణాల బారినుండి, శత్రువుల తాకిడినుండి రక్షించు కొచ్చిన ఆ రక్షకపత్రాలు.

ఆ పిల్ల కన్నీటినిచూసి పక్కనున్న నాయురాలు—"అత్తారింటికి పోతున్నావా. చిన్నమ్మా? అబ్బాయి మొగోరి బండిలో కూకున్నాడా" అంటూ ప్రశ్నించింది.

ఆమెతో మాటలు పెంచడం ఇష్టంలేక "ఊఁ" అని సమాధానం చెప్పి ముఖం తిప్పుకొంది శారద.

పాసెంజర్ పోతులబండిలా నడుస్తున్నాది. పావుగంట నడిచింది అనగానే ఏదో స్టేషను రావడం. అక్కడ అయిదునిమిషాలు ఆగి ఊపిరి సర్దుకొని బయలుదేరింది అనగానే ఇంకో స్టేషను. ఈ లెక్కన ఈ రైల్లో ఎన్నిగంటలు ప్రయాణించవలసి ఉంటుంది?

ఛీ .. ఛీ! ఈ రైలుకన్న వెంకన్న ఒంటెద్దుబండి నయం. అరగంటకల్లా స్టేషనులో దింపేసింది. ఈ కాస్త దూరానికి ఇంత సేపు ప్రయాణమా? హాయిగా మెయిలులోనో, ఎక్స్‌ప్రెస్‌లోనో వెళ్ళిపోతే ఈసరికి ఎప్పుడో అత్తగారి ఇల్లు చేరుకొని ఉండేది. నాలుగుడబ్బులు తక్కువ అని నాన్న దీనిలో టక్కెట్టు తీసేరు. వెధవది, ఈ నయాపైసల లెక్కలు చూసుకోవడం అన్నది జీవితంలో ఎప్పటికి పోతుందోకాని, పుట్టి బుద్దెరిగేక మొదటిసారిగా తమ ఇంటిని పట్టి పీడిస్తున్న దరిద్రంమీద విసుక్కొంది శారద.

చచ్చీ, చెడీ కొండచిలువలాంటి ఒళ్ళు లాక్కొంటూ రావలసిన సమయానికి గంటన్నర ఆలస్యంగా శారద ఎక్కినరైలు గమ్యస్థానం చేరుకొంది. బండి ప్లాటుఫారంమీదికి చేరేసరికి సంధ్యచీకట్లు ముసురుకొంటున్నాయి. కాని, స్టేషను అంతా మెర్క్యురీ దీపాల వెలుగులో పట్టపగల్లా ఉంది. సీళ్ళు పడగానే పుట్టలోంచి చీమలు బయటికి వచ్చినట్లు, ఇంతపొడుగు రైలులోంచి బండి స్టేషనులో ఆగిందే తడవుగా బిలబిలమంటూ ప్రయాణికులు దిగసాగేరు.

అంతమంది మనుషుల్ని, అంతపెద్ద స్టేషన్ని శారద చూడ్డం అదే మొదటిసారి. వెళ్ళేరైళ్ళు వెళుతున్నాయి. వచ్చేరైళ్ళు వస్తు న్నాయి. లౌడ్‌స్పీకర్లలో రైళ్ళ రాకపోకలు గురించిన హెచ్చరికలు వినిపిస్తున్నాయి. అమ్ముకొనేవాళ్ళు, అడుక్కొనేవాళ్ళు, కష్టపడి సామాన్లు మోసి డబ్బులు పుచ్చుకొనేవాళ్ళు, కష్టపడకుండా జేబులు కొట్టి సంపాదించేవాళ్ళు—అదో కొత్తలోకంలా అనిపించింది శారదకి. పెట్టెలో దొమ్మి కాస్త తగ్గేక తన సామాన్లు నెమ్మదిగా కిందికి దింపుకొంది. బెంచికిందనుంచి పెట్టె, పక్కచుట్ట పైకి తీస్తుంటే నేనూ ఉన్నాను అంటూ గుర్తుచేసింది అప్పడాల డబ్బా. 'నిన్నెలా మరిచిపోతానే, నా తల్లీ, మరిచిపోతే అమ్మ నా ప్రాణం తియ్యదూ' అంటూ దాన్నికూడా భద్రంగా కిందికి దింపింది.

ఆ స్టేషనులో ఎటు పోవాలో, ఏం చెయ్యాలో శారదకి అర్థం కాలేదు. తను ఈ రోజు వస్తున్నట్టు నాన్న ఉత్తరం రాసేరు కదా.... అత్తయ్య ఎవరినైనా స్టేషనుకి పంపి ఉండకపోతుందా అనే ఆశతో ఇటు అటు చూడసాగింది.

''హల్లో, శారదా'' అంటూ అందమైన ఒక అమ్మాయి వచ్చి శారద భుజంమీద చెయ్యి వేసింది.

ఎవరా అన్నట్టు తెల్లబోయి చూసింది శారద.

''ఏమిటలా చూస్తావు.... నేనే, అరవిందను'' అంది ఆ పిల్ల చిన్నగా నవ్వుతూ.

''నువ్వా.... పోల్చుకోలేక పోయేను.... బాగా మారిపోయేవు'' అంది శారద ఉత్సాహంగా.

''నువ్వేం మారలేదు. కాదంటే కొంచెం పొడుగు పెరిగేవు. అల్లంత దూరంనుంచి చూస్తూనే నువ్వే అనుకొన్నాను. నువ్వే అయేవు'' అంది అరవింద కలుపుగోలుగా, శారద చెయ్యి పట్టుకొని.

అనసూయ పెళ్ళికి వచ్చినప్పుడు అరవిందని శారద చూసింది. కాని, అప్పటి అరవిందకి, ఇప్పుడు తన ఎదుట ఉన్న అరవిందకి

ఎంతో భేదం ఉంది. ఆ పిల్లవంక కన్నార్పకుండా చూస్తున్నాది శారద. అప్పుడే ఫ్రిజిడేర్‌లోంచి తీసిన కర్బూజాపండు ముక్కలా ఉంది అరవింద లేత గులాబిరంగులో, ఎక్కడ తాకినా శరీరం లోంచి అందం బొట్లు బొట్లుగా కారేలా ఉంది.

తనవంక, తను కట్టుకొన్న బట్టలవంక జుగుప్సతో చూసు కొంది శారద. అరవిందచేతిలో తన చెయ్యి అందమైన పూరేకుమీద పాకుతున్న గొంగళిపురుగులా ఉంది.

ఇదేమీ పట్టించుకొన్నట్లు లేదు అరవింద. అటునుంచి రైలు లోకి చూసుకొంటూ వస్తున్న డ్రైవర్‌ని, "రమణా.... వెంకట రమణా" అంటూ కేకేసి పిలిచింది.

"ఇదిగో అమ్మాయిగారూ ఇక్కడే ఉన్నారు" అంటూ అటు వైపు వచ్చేడు రమణ.

"పద, ఇక వెళదాం" అంది అరవింద.

శారద పక్కచుట్ట, పెట్టె అందుకోబోయింది.

"వాటిని అలా ఉండనీ, కూలివాడిచేత రమణ పట్టించు కొస్తాడు" అంటూ శారద చెయ్యిపట్టుకొని గేటువైపు నడిచింది అరవింద.

దారిపొడుక్కీ కారులో ఆమాటా ఈమాటా చెపుతూ ఎంతో చనువుగా, స్నేహంగా మాట్లాడింది అరవింద. శారద ఆమె చెపు తున్న మాటలని వింటూ, అడిగినవాటికి జవాబులు చెపుతూ మెల్లగా అత్తగారి ఇల్లు చేరుకొంది.

పోర్టికోలో కారు ఆగిన శబ్దంవిని మాలతి గుమ్మంలోకి వచ్చింది.

"నువ్వు పార్టీకి వెళ్ళలేదా, అమ్మా" అంది అరవింద తల్లిని చూసి.

"లేదు. నాన్నగారు వెళ్ళేరు. నేను వచ్చేసరికి మా అత్త

టుందేమోనని నేను ఉండిపోయేను." నవ్వుతూ ఎదురువచ్చి శారద చెయ్యి ఆప్యాయంగా అందుకొంది మాలతి.

"అమ్మా, నాన్నా బాగున్నారా...." అని కుశలప్రశ్నలు వేసింది. సోఫాలో తన ప్రక్కన కూర్చోపెట్టుకొని ఇంటివిషయాలు, రాజ్యలక్ష్మి, అనసూయల అత్తవారిళ్ళ విషయాలు—అన్నీ వివరంగా అడిగి తెలుసుకొంది.

నాయరు తెచ్చిన కాఫీ తాగడం అయిపోయేక శారదని వెంట బెట్టుకొని అరవింద మేడమీదికి వెళ్ళింది. అక్కడ వరసగా ఉన్న రెండుగదుల్లో ఒకదాని తలుపుతీస్తూ, "ఇదిగో, ఇది నీ గది. ఆ తలుపుతీస్తే బాత్‌రూమ్. స్నానం అదీ ముగించుకొని కిందికి రా. నేను ముందు హాల్లో ఉంటాను" అంది. రెండడుగులు వేసిందల్లా అంతలో వెనుదిరిగి, "నీ కేదయినా అవసరం అయితే ఈ బటన్ నొక్కు గోవన్న వస్తాడు" అని చెప్పి వెళ్ళిపోయింది.

అరవింద వెళ్ళిపోయిన అయిదు నిమిషాలవరకు శారద ఆ గదిని, దాని అలంకరణని, అందులోని వస్తువుల్ని చూస్తూ బొమ్మలా అలా నిలిచిపోయింది. కొత్తగా వస్తున్నాది కదా అని తనకోసం ఈ గదిని ఇంత అందంగా అమర్చేరా, లేక ఈ ఇంట్లో గదులన్నీ ఇలాగే ఉంటాయా అనుకొంది, ఆశ్చర్యపోతూ.

ఆ ఆశ్చర్యంనుంచి కోలుకొన్నాక పెట్టెలోంచి తువ్వాలూ, సబ్బుబిళ్ళా, బట్టలూ తీసుకొని స్నానాలగదిలోకి వెళ్ళింది. బాత్‌రూమ్‌లో కాలు పెట్టేసరికి అక్కడి వస్తువులన్నీ ఆ పిల్లకి కొత్తే, కొన్ని వస్తువుల ఉపయోగం, వాటిని వాడేపద్ధతి కూడా ఆమెకి తెలియ లేదు. తరవాత తాపీగా వాటివిషయం అరవిందని అడిగి తెలుసుకో వచ్చని అప్పటిమట్టుకి స్నానాదికాలు అయ్యే యనిపించుకొని కిందికి వచ్చింది.

ముందు హాలులో అరవింద లేదు. ఎటు పోవాలా అని ఇటు అటు చూస్తుంటే ...

మాట్లాడుతున్నారు. ముందుకి వెయ్యబోయిన అడుగుని సంశయంతో వెనక్కి లాక్కొంది శారద.

"రా, శారదా, మామయ్యే!" అంది మాలతి, ఆమె రావడం చూసి.

భార్యతో ఏదో మాట్లాడుతున్న రఘునాథరావు ఇటు తిరిగి, "రా అమ్మా, శారదా! బాగున్నావా" అంటూ ఆప్యాయంగా పలకరించేడు.

శారదకి ఆ ఇల్లు ఒక స్వర్గధామంలా, ఆ ఇంట్లో మనుషులు దేవతల్లా కనిపించేరు. ఇంతటి ఆప్యాయం, అభిమానం చూపించే వీరిగురించి తల్లి చులకనగా అలా మాట్లాడ్డం నిజంగా ఆమెకి కష్టం కలిగించింది. 'అమ్మ కేమీ తెలియదు. కూపస్థ మండూకంలా ఆ ఇంటిని వదిలి బయటికి వచ్చిందిలేదు. అందుకే కొత్తవంతా చెత్త అన్నట్లు మాట్లాడుతుంది. మాలతి అత్త, మామయ్య తనూ, నాన్నగారూ అన్నట్లు ఉండరని ఆమెకి కోపమో, లేక వాళ్ళలా తాము ఉండలేక పోతున్నామనే అసూయో ఏదో ఆమె మనసులో సలుపుతూ ఉండి ఉంటుంది. అందుకే వీ రింటిజీవితాన్ని గోరంతని కొండంత చేసి మాట్లాడుతుంది' అనుకొంది.

ఆ రాత్రి భోజనం పూర్తిచేసి తనగదికి వెళుతున్నదల్లా అకస్మాత్తుగా వంగి అత్తికాళ్ళకి నమస్కరించింది శారద. అనుకోకుండా అలా ఎందుకు చేసిందో ఆ పిల్లకికూడా తెలియలేదు. మనసులో కదులుతున్న కృతజ్ఞతాభావం అనాలోచితంగా శారదచేత అటువంటి పని చేయించింది.

"ఇదేం పనే, శారదా" అని ఆ పిల్ల భుజాలు పట్టుకొని లేవదీసింది మాలతి. ఆమెకూడా శారదనుంచి ఇటువంటిపనిని ఆశించక పోవడంవల్ల క్షణకాలం తెల్లబోయింది.

''ఆఁ .. దానికేముందే.... నీకు చదువుకోవాలని ఉన్నప్పుడు, ఈ ఊళ్ళో మేము ఉన్నప్పుడు ఇదొక పెద్ద సహాయమా? అయినా, నువ్వు మా గుమ్మంలో కాలు పెట్టేవరకు మీ అమ్మ నిజంగా నిన్ను పంపుతుందని నాకు నమ్మకం లేదుసుమా.... అప్పటిమట్టుకి నా మాటకి అవునని తల ఊపినా, మళ్ళీ ఏం మనసు మార్చుకొంటుందోనని ...''

''నాకూ నమ్మకం లేదు, అత్తా! అమ్మకి గడియ కో బుద్ధి గంట కో బుద్ధి. ఇంట్లో ఎవరూ అవును, కాదు అనేందుకు లేరు. అనసూయక్క కూడా అమ్మా, శారదను చదివించవే—అంటూ ఉత్తరాలు రాయడంతో....''

''పోనీలే... ఎలాగైతేనేం వచ్చేసేవుగా....బుద్ధిగా చదువుకొని మీ అమ్మకు తృప్తి కలిగించు. నా మాట నిలబెట్టు... ఇదిగో, ఇంకోమాట. ఈ ఇల్లు మీ ఇల్లే అనుకొని నీ అవసరాలు, వేళలు నువ్వు చూసుకోవాలి. అడిగి, చెప్పి, చేయించుకోవాలి. మన్ననలు, మొహమాటాలు అటువంటి వేం పెట్టుకోకూడదు. తెలిసిందా?'' అంది మాలతి శారద బుగ్గ పట్టుకొని సాగదీస్తూ.

తెలిసింది అన్నట్లు బుర్ర ఆడించింది శారద.

మెత్తటి ఫోమ్ రబ్బరు పరుపు, చల్లటి ఫాన్ గాలి, తోటలోంచి కమ్మగా వస్తున్న నైట్ క్వీన్ పరిమళం, కళ్ళకి అలసట కలిగించని నీలపు బెడ్ లైట్ కాంతి—ఆ రాత్రి శారదకి ఏదో కొత్త లోకాలకి తలుపు తీసినట్లు అనిపించింది. గతాన్ని ఆవలకి నెట్టి, భవిష్యత్తు గురించి అందమైన కలలు కంటూ మత్తుగా నిద్రా జాగృతులమధ్య ఆ రాత్రంతా గడిపివేసింది.

ఆ మత్తులోంచి కళ్ళు విప్పి చూసేసరికి అప్పటికే బాగా తెల్లవారిపోయింది. కొత్తచోట మొదటిరోజు ఇంతలా మొద్దు నిద్దర పోయిందేమిటి? ఇంట్లో అంతా లేచిపోయేరు కామోసు. అత్తవాళ్ళు ఏమనుకొంటున్నారో? కంగారుగా పక్కమీంచి లేచి గది తలుపు తీసుకొని ముందు వరండాలోకి వచ్చింది శారద.

పక్కగదిలోంచి అప్పుడే ఒళ్ళు విరుచుకొంటూ, కళ్ళు నులుపు కొంటూ బయటికి వచ్చిన అరవింద—"శారదా, లేచిపోయావా—రాత్రి సరిగా నిద్ర పట్టిందా?" అంటూ పలకరించింది.

"మరీ గాఢంగా పట్టేసింది. ఇంత పొద్దు ఎక్కేవరకు తెలివి రాలేదు, ఇంట్లో అంతా లేచిపోయేరు లాగుంది" అంది శారద, తను అంతవరకు నిద్రపోయినందుకు నొచ్చుకొంటూ.

"సరి. సరి. అప్పుడేనా? ఇంకో గంటకి కాని మా ఇంట్లో అసలు తెల్లవారదు, తెలుసా? నేనొక్కదాన్నే కాస్త ముందుగా లేస్తాను. అంతా లేచేలోపున అలా కొంతదూరం కాలు ఝాడించి రావడం నా కలవాటు. రావాలనుంటే నువ్వూ రా, కాస్తసేపు తిరిగి వద్దాం."

"నడకంటే నాకూ ఇష్టమే. అయితే నీలా ఒకసమయం పెట్టుకొని నడవాలంటే కుదరదనుకో. అవకాశం ఉన్నప్పుడల్లా అలా తిరిగి వస్తుంటాను" అంది శారద, వాకింగ్‌కి తను సిద్ధమే అన్నట్లు చీర సరిచేసుకొంటూ.

"ఉండు, కాస్త కాఫీ తాగి వెళదాం" అంటూ గోడకున్న బటన్ నొక్కింది అరవింద.

నిండా అయిదునిమిషాలు కాకుండానే ట్రేలో కాఫీకప్పులు, డికాక్షన్, పాలు, పంచదార పెట్టుకొని తీసుకొచ్చేడు గోపన్న. అరవింద రెండుకప్పుల్లో కాఫీ కలిపి, 'తీసుకో' అంటూ ఒకటి శారద ముందుకి నెట్టింది.

"నువ్వు తీసుకో, అరవిందా, ఇంత ఉదయాన్నే కాఫీ తాగడం నా కలవాటు లేదు" అంది శారద.

"కాఫీకి ఒక వేళేమిటి....ఈ రోజు తాగితే రేపటికి అదే అలవాటుగా మారిపోతుంది. తీసుకో. కాస్త వేడివేడి కాఫీ కడుపులో పడితే కాళ్ళకి చురుకు పుడుతుంది."

పళ్ళు తోముకొని, ముఖం కడుక్కోకుండా శారద ఎప్పుడూ కాఫీ తాగలేదు. నోరంతా ఏదో అసహ్యంగా ఉంది. "ఒక్క నిమిషం

ఉండు. కాస్త నీళ్ళతో నోరు పుక్కిలించుకొని వస్తాను" అంది శారద.

"సరే. ఆ పనేదో త్వరగా కానీ. మళ్ళా రాజు లేచేడంటే వాకింగ్‌కి తనూ వస్తానని పేచీ పెడతాడు. వాడితో నడిస్తే చీమ గంగాయాత్ర చేసినట్లే"

రెండునిమిషాల్లో బాత్‌రూమ్‌లోంచి తిరిగి వచ్చింది శారద. అలా ఉదయాన్నే ఎవరో సిద్ధంచేసి పట్టుకొచ్చిన వేడివేడి కాఫీ తాగుతుంటే ఏదో తమాషాగా అనిపించింది ఆ పిల్లకి.

అదే తమ ఇంట్లో అయితే కాఫీకి ఎంత సరంజామా తయారు చెయ్యాలి! ముందు బొగ్గులు కొట్టి కుంపట్లో వెయ్యాలి, నిప్పు చెయ్యాలి, నీళ్ళు మరగాలి, ఆవెనక పాలు రావాలి. అప్పుడు కాఫీ కలుపుకు తాగాలి. ఆ కాఫీ అయినా ఏం గొప్పగా ఉంటుంది కాబట్టి! దస్తాగిన్నెడు నీళ్ళకి నాలుగు చెంచాలు గుండవేసి డికాక్షన్ తీస్తుంది తల్లి. పైగా ఆ పైదమ్మపోసేవి నీళ్ళపాలు. ఒకొక్కసారి ఉదయాన్నే ఆ కాఫీ తాగుతుంటే కడుపులో తిప్పేది శారదకి. "నాకు కాఫీ వద్దమ్మా" అంటే తల్లి వినేది కాదు. "మళ్ళీ పదిగంటలదాకా ఉండద్దూ?" అక్కడికి కాఫీ అనబడే ఆ వేడినీళ్ళు అనేది గొంతుకలో పోసుకొంటే ఏదో శక్తి పొదులుకొనేటట్లు.

"ఏమిటంత దీక్షగా ఆలోచిస్తున్నావు?" అరవింద ప్రశ్నించింది.

"ఏం లేదు. నేనిలా పళ్ళు తోముకోకుండా పాచిముఖంతో కాఫీ తాగేనని అమ్మకితెలుస్తే ఇంకేమైనా ఉందా?"

"మరేం భయపడకు. నేను చెప్పనులే" నవ్వుతూ అంది అరవింద.

"అహఁ. నువ్వు చెపుతావని కాదు. ఒకవేళ ఎలాగైనా తెలిసిందంటే చదువూ వద్దు చట్టుబండలూ వద్దు. వెంటనే తిరిగి రా— అంటుంది."

"అంటే వెళ్ళిపోతావా, శారదా?"

"ఊంహూం. వెళ్ళను. దేనికోసం వచ్చేనో అది పూర్తి కానిదే...."

"భేష్! అలా గట్టిగా ఉంటేనే మీ అమ్మలాంటి వాళ్ళదగ్గర పనులు జరుగుతాయి. లేకపోతే నిన్నూ మీ అక్కల్లాగే ఏ త్రాష్టుడికో అంటకట్టి ఊరుకొంటుంది."

"నా విషయంలో అలాటి భయం లేదు. నేను పెళ్ళి చేసుకోనని వాళ్ళతో చెప్పేసేను."

"అంటే?"

"చదువుకొంటాను. ఉద్యోగం చేస్తాను."

"ఊఁ. తరవాత?"

'ఆ తరవాత?' తండ్రిలాగే నిలతీసి అడుగుతున్న అరవిందకి ఏం చెప్పాలో అర్థం కాలేదు శారదకి.

"మనసుకి నచ్చినవ్యక్తి లభ్యమయితే చదువుకొన్నా, పెళ్ళి చేసుకోవడంలో తప్పు లేదు, శారదా. నిజానికి పెళ్ళితోకాని ఆడదానికైనా, మగాడికైనా జీవితానికి నిండుతనం రాదని నా అభిప్రాయం."

కాఫీ తాగడం పూర్తి అయింది. అరవింద మాటకి అవును, కాదు అని జవాబు చెప్పకుండా ఆమెపక్కనే నడక సాగించింది శారద.

* * *

కాఫీ ఫలహారాలు ముగించుకొని పది గంటలకల్లా అరవిందతో పాటు కాలేజీకి బయలుదేరింది శారద. ఆ రోజు భార్యకి ఒంట్లో బాగులేదు, ఆస్పత్రికి తీసుకుపోవాలని డ్రైవరు సెలవుపెట్టేడు. అరవింద స్వయంగా తానే కారు గరాజ్‌లోంచి బయటికి తీసింది. అరవింద కారు తీస్తుంటే ఆశ్చర్యంగా చూస్తూ, "నువ్వు కారు నడపగలవా?" అని ప్రశ్నించింది శారద.

"ఏం బ్రహ్మవిద్యా? కావాలంటే నీకూ నేర్పుతాను. నేర్చుకో" అంది అరవింద.

అంత పెద్ద కారుని ఎంతో ధైర్యంగా బజారులోంచి, మనుషులమధ్యనుంచి అరవింద అవలీలగా అలా నడుపుకుపోతుంటే గుడ్లు మిటకరించుకొని అలా చూస్తూ ఉండిపోయింది శారద.

ఎక్కడా కుదుపన్నమాట లేకుండా, సాఫీగా రోడ్డుమీద జారిపోతున్నాది కారు. అంత మెత్తనిసీటుమీద అలా విశాలంగా కూర్చోవడం కొంచెం ఇబ్బందిగానే అనిపించింది శారదకి. ఒకవంక కారు నడుపుతూనే దారిపొడుగునా కనిపిస్తున్న మేడల్ని, మిద్దెల్ని, వాటి ప్రత్యేకతల్ని, వాటిలో విశేషాల్ని చెప్పుకుపోతున్నాది అరవింద, శారదదృష్టి అరవింద చెపుతున్న మేడలమీదా, మిద్దెలమీదా లేదు. ఆ కారుని ఏ నిమిషాన ఎవరిమీదికి ఎక్కించేస్తుందో, దేనికి గుద్దించేస్తుందో అన్న భయంతో గుండె పట్టుకొని కూర్చుంది. దారిలో ఏ ప్రమాదం జరగకుండానే కారుని కాలేజీ దారి పట్టించింది అరవింద. జనసమ్మర్దమైన వీథులు గడిచి బయటపడేసరికి 'హమ్మయ్య' అనుకొంది శారద.

ఒక పెద్ద గేటులోంచి కంకరరోడ్డును కరకరలాడిస్తూ కారుని మరికొంతదూరం పోనిచ్చి అక్కడ ఆపింది అరవింద. "ఇదే మీ కాలేజీ" అంది, ఎదురుగాఉన్న పెద్ద భవవాన్ని చూపిస్తూ.

అరవింద కారుని పక్కకితీసి, పార్కుచేసి, తాళం వేస్తుంటే, ఎదురుగా ఉన్న ఆ భవనంవంక, దానికి దారితీస్తున్న నల్లని తారు రోడ్లవంక, రోడ్డుకి ఇటూ అటూ విరగబూచి ఉన్న గులాబిమొక్కల వంక ఉత్సాహంగా చూసింది శారద. ఆ కాలేజీని చూస్తుంటే శారదకి చెప్పలేనంత సంతోషం కలిగింది. దానిలో తను చదువుకోబోతున్నది —అని తోచగానే కొంచెం గర్వంకూడా పొడసూపింది. ఇటువంటి అందమైన పరిసరాల్లో, అంతపెద్ద కాలేజీలో తను చదువుకోవడానికి అవకాశం కల్పించిన అత్తకి మనసులోనే మరోమారు కృతజ్ఞత తెలుపుకొంది.

పొడుగుపాటి నాలుగైదువరండాలు దాటి అరవింద ఒక గది ముందు ఆగింది. అక్కడ ఆడపిల్లలు రమారమి శారద ఈడువాళ్లే

చాలామంది ఉన్నారు. వారి మాటల్నిబట్టి వారంతా తనలాగే కాలేజీలో చేరడానికి కొత్తగా వచ్చినవారని శారద తెలుసుకొంది.

"నే నిప్పుడే పదినిమిషాల్లో వస్తాను. నువ్వు వీళ్ళతో మాట్లాడుతూ ఇక్కడ కూర్చో" అని అక్కడ ఉన్నవారిలో ఒకరిద్దరు పిల్లల్ని పరిచయంచేసి వెళ్ళిపోయింది అరవింద.

అక్కడ బెంచీలమీద కూర్చున్న పిల్లలకి ఒకరితరువాత ఒకరుగా గదిలోంచి పిలుపు వస్తున్నాది. వెళ్ళినవాళ్ళు నాలుగైదు నిమిషాల్లో తమపని పూర్తిచేసుకొని తిరిగి వస్తున్నారు.

"మీ కార్డు నంబరు ఎంత?" అంది శారద పక్కగా కూర్చున్న పిల్ల

"ఇరవై అయిదు" అంది శారద.

"నాది ఇరవైమూడు. మనం కనీసం మరొక అరగంటైనా నిరీక్షించవలసి ఉంటుంది" అంది ఆ అమ్మాయి.

అరవింద వెళ్ళిన అయిదునిమిషాలకే శారదకి పిలుపు వచ్చింది. పరాకుగాఉన్న శారద, అంత త్వరలో తనకి పిలుపు రాదన్న అభిప్రాయంతో ఉండడంవల్ల తన పేరు ఒకటికి రెండుసార్లు పిలుస్తున్నా వినిపించుకోలేదు.

"టి. శారద అంటే మీరే కదూ? మీ పేరు పిలుస్తున్నారు." అంతకిపూర్వం నంబరడిగినపిల్ల శారదని హెచ్చరించింది.

తనకన్న ముందు వచ్చినవాళ్ళు ఇంకా పది పన్నెండుమంది ఉండగా తనకి పిలుపెలా వచ్చిందా—అని ఆలోచిస్తూనే లోపలికి వెళ్ళింది శారద.

శారద మనసులో ఆ అనుమానం అట్టేసేపు నిలవవలసినపని లేకుండానే తేలిపోయింది.

"రఘునాథరావుగారి మేనకోడలివి నువ్వేనా, అమ్మా?" అన్నాడు, అక్కడ ఫారాలు సరిచూస్తున్న ముసలి గుమాస్తా.

"అవునండి" అంది శారద.

"ఈ చీటి తీసుకువెళ్ళి కాషియర్ దగ్గర సొమ్ము కట్టి రసీదు తీసుకో" అంటూ ఒక కాగితం ఆ పిల్ల చేతిలో పెట్టేడు అతడు.

శారద గదిలోంచి తిరిగి వస్తుంటే అక్కడ కూర్చున్న మిగిలిన పిల్లలు ఆమెవంక కోపంగా చూసేరు. తమకన్న వెనక నంబరులో ఉన్న పిల్ల తమకన్న ముందుగా పని తెముల్చుకొని వెళ్ళిపోతున్నాదని.

"అరవింద నీ కేమవుతుంది?" అక్కడ కూర్చున్నవారిలో ఒక పిల్ల అడిగింది.

"అత్త కూతురు" అంది శారద.

"అందుకే నీ పని ముందుగా అయిపోయింది." సంగతి అర్థమైనట్లు అంది ఇంకో పిల్ల.

అరవింద తిరిగి వచ్చింది. "అయిపోయిందా నీ పని?" అంది శారద చేతిలో కాగితం చూసి. ఆఫీసులో సొమ్ము కట్టడం పని అయిపోయేక ఒకసారి కాలేజీ, హాస్టలూ—అన్నీ తిప్పి చూపించింది శారదకు

"సెలవులకి ఇళ్ళకి వెళ్ళినవారు అంతా ఇంకా వచ్చినట్లు లేదు. లేకపోతే ఇంకా సందడిగా ఉంటుంది హాస్టలు" అంది.

రంగురంగుల బట్టలతో, రకరకాల అలంకరణలతో, అప్పుడే తోటలో విచ్చిన పుష్పాలంత అందంగా ఉన్నారు ఆ పిల్లలు. వాళ్ళ ముఖాలు చూస్తుంటే ప్రపంచంలో ఉన్న ఆనందమంతా అక్కడే పోగుచేసి ఉన్నట్లు ఉంది.

శారదకి తను అంతకుపూర్వం చదివిన బోర్డు హైస్కూలు గుర్తుకి వచ్చింది. దానికి, దీనికి పోలికేలేదు. తమ ఇంటికి, అత్తగారి ఇంటికి ఉన్నంత తేడా ఉంది అనుకొంది.

ఆ సాయంకాలం తండ్రికి తను క్షేమంగా చేరుకొన్నట్లు ఉత్తరం రాసింది శారద. "ఇక్కడికి రాకపూర్వం ఈ వాతావరణం ఎలా ఉంటుందో, నేను ఇందులో ఇమడగలనో, లేనో అని ఎంతో కంగారుపడ్డాను, నాన్నా! కాని అత్త, మామయ్య ఎంతో ఆదరంగా

పలకరించేరు. నిన్న నేను బయలుదేరిన రైలు గంటన్నర లేటు. పాపం, అరవింద నాకోసం రెండుసార్లు రైలుస్టేషనుకు రావలసి వచ్చింది.

"నా గురించేం బెంగ పెట్టుకోవద్దని అమ్మతో చెప్పండి. ఇక్కడ అంతా బాగుంది. ఈ రోజు ఉదయం అరవిందతో కలిసి కాలేజీకి వెళ్ళి సొమ్ముకట్టి వచ్చేను. నా ఈడు పిల్లలు, నాలాగే అమ్మా, నాన్నలకి దూరంగా ఉన్నవాళ్ళు ఎంతోమంది ఉన్నారు. హాస్టలుకూడా ఎంతో బాగుంది. మనలాంటివాళ్ళకి అందుబాటులో లేకపోయినా, అన్నిసౌకర్యాలతో చక్కగా ఉంది.

"నేను మొదట్లో అనుకొన్నట్లు టెక్స్టు పుస్తకాలు అన్నీ కొనుక్కోనక్కర లేదుట. ముఖ్యమైనవి కొన్ని కొనుక్కొంటే, మిగిలినవి లైబ్రరీలోంచి ఎరువు తీసుకోవచ్చుట. నిజానికి మామయ్యగారి ఇంట ఒక గదినిండా పుస్తకాలు ఉన్నాయి. అవి ఏం పుస్తకాలో, వేటికి సంబంధించినవో నేనింకా చూడలేదు. వాటిని అమర్చిన తీరు, రూపరేఖలు చూస్తుంటే ఏవో విలువైన పుస్తకాలే అనిపిస్తుంది.

"మిగిలిన విశేషాలతో రెండు, మూడు రోజుల్లో మళ్ళీ ఉత్తరం రాస్తాను. గోపీ ఎలా ఉన్నాడు? వాడిని అడిగేనని చెప్పండి. అమ్మకి నమస్కారాలు."

పూర్తిచేసిన ఉత్తరాన్ని స్వయంగా పోస్టుచేసి వచ్చింది శారద.

అత్తగారి ఇంటి అలవాట్లు శారదకి మొదట్లో కొత్తగా కనిపించేవి. మనిషి కో గది. గది కో బాత్ రూమ్. తండ్రి గదిలోకికూడా పిల్లలు ముందుగా తలుపుతట్టి అడగందే వెళ్ళకపోవడం వింతగా కనిపించేది.

ఉదయం లేచినదగ్గరినుంచి ఎవరిపనులు వారివి. ఎవరి వేళలు వారివి. ఆ రాత్రికి ఈ రాత్రి భోజనాల బల్లదగ్గర తల్లీ, తండ్రీ,

పిల్లలూ అంతా కలుసుకొనేవారు. అదైనా అత్తా, మామయ్యా బయటికి పార్టీలకో, ఫంక్షన్లకో వెళ్ళనినాడు. లేకపోతే ఇంట్లో నలుగురు ఒకచోట కూర్చుని మంచీ చెడ్డా అనుకొనేసమయాలే అరుదుగా ఉండేవి.

"అతడు వెయ్యికాళ్ళ జర్రి. అదేమో ఇల్లు పట్టకుండా తిరుగుతుంది. ఇంక ఇంట్లో పిల్లల ఆలనా, పాలనా చూసేవాళ్ళు ఎవరు? ఎంతచేసినా, నౌకర్లపని ఇంటివాళ్ళు చూసుకొని చేసుకొన్నట్లు ఉంటుందా?" అని తల్లి వీరి ఇంటి అలవాట్లగురించి అంటూండడం శారద వినకపోలేదు. కాని ఇల్లు, పిల్లలు అన్నతరవాత అత్త మరీ అంత అంటా ముట్టకుండా ఎలా జరుపుకోగలుగుతుంది? అమ్మ చాదస్తంకొద్దీ ఏదో అలా అంటుంది అనుకొంది.

ఆ ఇంట కాలుపెట్టి ఒక నెలరోజులు గడిచేసరికి తల్లి అన్న మాటల్లో కొంత అతిశయోక్తి ఉన్నా, బొత్తిగా నిజం లేకపోలే దనిపించింది. కాని, అందులో తల్లి ఎత్తిచూపే చెడునుమాత్రం శారద చూడలేకపోయింది.

పిల్లలు కట్టుకొనే బట్టదగ్గరినుంచి పెట్టుకొనే బొట్టువరకు తలిదండ్రులు కల్పించుకొని, తమ ఇష్టాల్ని, అభిప్రాయాల్ని వయసు వస్తున్న పిల్లలమీద రుద్దేకన్న, ఇలా కొంతవరకు వారి ఇష్టాలకి, అభిప్రాయాలకి వారిని వదిలిపెట్టడమే మంచిదేమో అనిపించేది శారదకి. ఇందువల్ల పిల్లలు వ్యక్తిగతమైన అభిరుచులు, అలవాట్లు ఏర్పరుచుకొనేందుకు, అందులో లోటుపాట్లు జరిగితే తమంతట తాము సరిదిద్దుకొనేందుకు అవకాశం ఉంటుంది. ఎల్లకాలం అమ్మా, నాన్నా ఏది చెపితే అది చేస్తూ, ఏది పెడితే అది తింటూ అలా బాధ్యతారహితంగా కాలం వెళ్ళబుచ్చుతుంటే, ఏదో ఒకనాటికి తమ బ్రతుకు తాము బ్రతకవలసిన పరిస్థితి ఏర్పడి, తమ నిర్ణయాలు తాము తీసుకోవలసిన తరుణం వస్తే, ధైర్యంగా జీవితాన్ని ఎదుర్కోలేక, కాళ్ళు తేలవేసి సహాయంకోసం ఇటూ అటూ వెతుకుతూ ఉండిపోతారు.

ఒకరోజు శారద పెట్టె తెరచి బట్టలు తీసుకొంటుంటే అరవింద చూసింది.

"ముదినాపసానిలా ఈ నేతచీర లేమిటి? ఏ వాయిల్సో కొనుక్కోలేకపోయావా" అంది అరవింద

"గుంటూరు నేతచీరలు చిరిగిపోయేదాకా రంగు వెలవవని అమ్మ వాటినే కొంటుంది. ఆ రంగులంటే అమ్మకి చాలా ఇష్టం" అంది శారద

"మీ అమ్మకి ఇష్టం అయితే ఆవిణ్ణి కట్టుకోనీ నువ్వెందుకు కట్టాలి?"

తమ ఇంట పిల్లలకి తలిదండ్రుల ఇష్టాల్నిమించి తమని అంటూ వేరుగా ఇష్టాలు, ఆలోచనలు ఉండవని శారద అరవిందతో చెప్పలేదు.

"కొన్నవి ఇంట్లో ఉన్నాయిగదా అని పడేసుకొన్నాను" అంది.

మరునాడు తన బీరువాలోంచి రెండు మూడు పుల్‌వాయిలు చీరలు, నైలాన్ చీరలు తీసి ఇచ్చింది అరవింద.

"కనీసం కాలేజీకి వెళ్ళేటప్పుడైనా ఆ నేతచీరలు కట్టడం మానేయి. అనవసరంగా అమ్మమ్మ, నాన్నమ్మ అని పేర్లు పెట్టి చంపుతారు పిల్లలు" అంది.

"ఈసారి ఇంటికి వెళ్ళినప్పుడు నేను కొనుక్కుంటాలే. నీ చీర ఎందుకు కట్టుకు పాడుచెయ్యడం" అంది శారద వాటిని పుచ్చుకోవడానికి సంకోచిస్తూ.

"బట్టలు కొనుక్కోవడం కట్టుకోవడానికేగా—పాడుచెయ్యడం ఏమిటి? వెధవకబుర్లు చెప్పక తీసుకో" అంది అరవింద.

అరవింద మాటని కాదనలేకపోయింది శారద. ఆ ఆప్యాయానికి డబ్బుతో విలువ కట్టలేకపోయింది. మౌనంగా ఆ చీరల్ని తీసుకొని పెట్టెలో పెట్టుకొంది.

అరవింద తనకన్న పెద్దది. అందమైనది. మెడిసిన్ చదువుతున్నాది. సిరిసంపదలమధ్య పుట్టి పెరిగిన పిల్ల. అన్నిటా తనకి, ఆమెకి ఎంతో భేదం ఉంది. అయినా ఏపాటి గర్వం, వేర్పాటుతనం లేకుండా తనతో ఎంతో స్నేహంగా, ఆత్మీయంగా మాట్లాడుతుంది. నిజంగా అరవింద లేకపోతే అత్తగారింట తన ఉనికి ఇంత ఆనందంగా, సుఖంగా ఉండకపోవును అనుకొనేది శారద.

రఘునాథరావుగారి ఇంటికి అనేక తరహాలకి చెందిన వ్యక్తులు ఆడా మగా వచ్చి పోతుండేవారు. కొందరు ఇంటి యజమానికోసం, మరికొందరు అమ్మగారికోసం, అరవిందకోసం మెడికల్ కాలేజీ స్టూడెంట్లు, ఇంకా బయటిమిత్రులు వస్తుండేవారు. చిన్నవాళ్ళు రాజు, జ్యోతి వాళ్ళ నేస్తులు వాళ్ళకి ఉండేవారు. ఏనాడూ ఎవరూ పేరు అడుగుతూ రానిది ఒక్క శారదకోసమే.

కాలేజీలో తన చదువేమో, తానేమో అన్నట్లు ఉండేది శారద. మిగిలినవిషయాలేమీ అంతగా పట్టించుకొనేదికాదు. ఇంట్లో ఎవరున్నా, లేకపోయినా కాలేజీనుంచి తిన్నగా అరవింద ఆ వేళకివస్తే కారులోనో, లేకపోతే బస్సులోనో ఇంటికిచేరి తనగదిలో ఏదో ఒక పుస్తకం పట్టుకొని కూచ్చుండేది.

నలుగురిలో కలయిక అలా ఒంటరిగా ఉండడానికి శారద చిన్ననాటినుంచి పెరిగిన వాతావరణం కొంత కారణం. కాలేజీలో ఆడపిల్లలు చెప్పుకునే కబుర్లలో ఆమెకి అందివచ్చే విషయాలు అంతగా లేకపోవడం ఇంకో కారణం. వాళ్ళ కబుర్లు ఎంతసేపు బట్టలు, ఫాషన్లు, సినిమాలు, ప్రేమవ్యవహారాలు — వాటిచుట్టూ తిరుగుతూండేవి.

శారదకి సినిమాలంటే మొదటినుంచీ అంత ఆసక్తి లేదు. దానికి ధనాభావం, ఇంట్లో తలిదండ్రులకట్టడి కొంత కారణం కావచ్చు. ఇంక నగలు, బట్టలు. వాటిపైకూడా శారదకి ఏమంత కోరికలు ఉండేవి కావు. ఉన్నా తీరే అవకాశంలేదని తెలుసుకోగలవయసు కాబట్టి ప్రేమలు, పెళ్ళిళ్ళు — ఆ కబుర్లుకూడా శారదలో ఆసక్తిని కలిగించలేదు. శారద ముభావానికి ఇంకోలా వ్యాఖ్యానించి చెప్పుకొనేవారు మిగిలిన పిల్లలు.

"ఏం చూసుకొని ఆ గర్వం?" అనేవారు కొందరు.

"అరవింద అత్త కూతుర్నని...." వారిప్రశ్నకి వారే సమాధానం చెప్పుకొనేవారు.

"దీనికే అంటారు 'కందకులేని దురద కత్తిపీటకు' అని. అసలుమనిషి అరవింద కేం లేదు కాని...."

శారద ఇటువంటిమాటలు వినకపోలేదు. విన్నా వాటిని పట్టించుకొనేది కాదు. తనని కాదు అన్నట్లు తప్పించుకుతిరిగేది.

అరవిందకోసం ఆడపిల్లలకన్నా మగవాళ్ళు ఎక్కువగా వస్తుండడం శారదకి వింతగా అనిపించేది. తను ఆ ఇంటికి వచ్చిన రెండోరోజున అరవింద ఎవరో యువకునితో చేరువగా సోఫాలో కూర్చుని మాట్లాడుతుండడం చూసి, ఏదో చూడకూడని దృశ్యం చూపినట్లు నాలిక కరుచుకొని వెళ్ళిపోయింది. ఆ వెనక కొంతసేపు తోటలో తిరిగి ఇంటికి వెనకదారిగుండా లోపలికి వచ్చింది.

సాధారణంగా అరవింద స్నేహితులు ఎవరువచ్చినా ముందు హాలులో కూర్చుని కాఫీ ఫలహారాలు సేవించి, కాస్తసేపు కబుర్లు చెప్పి వెళ్ళిపోతుండేవారు. ఈ అలవాటుకి భిన్నంగా ఇంటిలోపలిదాకా వచ్చి మాలతిని, రఘునాథరావుని పలకరించివెళ్ళే ఆచారం అలా వచ్చేవారిలో ఇద్దరికిమాత్రం ఉండేది. ఆ ఇద్దరిలో ఒకడు అనిల్ కుమార్ బెనర్జీ అని ఒక బెంగాలీ యువకుడు. అక్కడ కాలేజీలో అసిస్టెంట్ లెక్చరర్గా పనిచేస్తూ, రీసెర్చి చేసుకొంటున్నాడు.

"అనిల్ తండ్రికి, నాన్నగారికి చిన్ననాటి స్నేహం. నాన్నగారు కలకత్తా ఎప్పుడువెళ్ళినా వారి ఇంటే బస. అలాగే అంకుల్ ఎప్పుడువచ్చినా ఇక్కడే దిగుతారు" అంది అరవింద, అనిల్ బెనర్జీని పరిచయం చేస్తూ.

రెండు మూడేళ్ళుగా ఆంధ్రలో ఉంటున్నా అనిల్కుమార్కి తెలుగు అంతగా రాలేదు. వచ్చిన కొద్దిపాటిమాటలైనా ముద్దముద్దగా చిన్నపిల్లలు మాట్లాడినట్లు వత్తి వత్తి మాట్లాడేవాడు. రఘునాథరావు గారి ఇంట సంభాషణకి సాధారణంగా చిన్నా, పెదా అంతా ఇంగ్లీషే

ఉపయోగించేవారు. మొదటిసారి శారదని అరవింద పరిచయం చెయ్యగానే— "ఏం చదువుతున్నారు....ఏ కాలేజీలో చేరేరు'' వంటి విషయాలు ప్రశ్నించేడు అనిల్.

శారదకి ఇంగ్లీషు చదువను, రాయను వచ్చినా మాట్లాడ్డం అలవాటులేక తిన్నగా రాదు. అతడు అడిగినదానికి బెక్కుతూ తుంచేసినట్లు పొడిపొడిగా రెండుమాటలు సమాధానంచెప్పి ఊరుకొంది.

అయినదానికి, కానిదానికి కల్పించుకొని వటవటవాగే ఆడపిల్లలంటే అనిల్‌కి ఇష్టం ఉండదు. మితభాషిత్వం, వినయం. సిగ్గు ఆడదానికి పెట్టని ఆభరణాలని అతడి అభిప్రాయం. పై కారణంవల్లనే శారదని మొదటిసారి చూడగానే అతడికి ఆ పిల్లపట్ల ఇష్టం ఏర్పడింది.

అనిల్‌కుమార్‌లాగే ఆ ఇంట చనువుగా తిరిగేవ్యక్తి రాజేందర్‌సింగ్. రమారమి ఆరడుగుల పొడుగు, పొడుగుకితగ్గ ఒళ్ళు, పసిమివర్ణపు ముఖంపైన నల్లనిగడ్డం, దుబ్బుమీసాలు, తలమీద పగిడి ఉన్నవయసుకన్న ఎక్కువగా కనిపిస్తుంది అతడిముఖంలో. ఎప్పుడూ నవ్వుతూ, నవ్విస్తూ సరదాగా మాట్లాడేవాడు.

"మా బావ రాజేందర్‌సింగ్" అంది అరవింద, అతన్ని పరిచయం చేస్తూ

''మా అన్నపూర్ణ అత్తకూతురు వస్తుందని చెప్పేనే.... ఇదిగో, ఈ అమ్మాయే. పేరు శారద.''

అంతవరకు సోఫాలో వెనక్కి జారబడి కూర్చున్నవాడల్లా అరవింద శారదని పరిచయం చెయ్యగానే బంతిలా తుళ్ళిలేచి, ఒక అడుగు ముందుకువేస్తూ, ''హల్లో! హౌ డు యు డూ, మిస్ శారదా?'' అన్నాడు చెయ్యి ముందుకి పెడుతూ.

శారద ఒక అడుగు వెనక్కివేసి, రెండుచేతులు జోడించి, 'నమస్కారం' అంది.

దానితో రాజేందర్ తన తప్పుని తెలుసుకొని, చెయ్యి వెనక్కిలాక్కొంటూ, ''నమస్కారం....నమస్కారం'' అన్నాడు తడబడుతూ.

ఆ ఇద్దరి తడబాటుచూసి అరవింద చిన్నగా నవ్వుతూ, "మా బావ ఆమధ్య వాళ్ళ నాన్నడబ్బుతో ఓ ఆర్నెల్లపాటు ప్రపంచపర్యటన చేసివచ్చేరులే. అప్పటినుంచి మనదేశం ఆచారాలు, అలవాట్లు అన్నీ మరిచిపోయేడు, పాపం" అంది.

"మరోలా అనుకోకండి, శారదా. అలవాట్లో పొరపాటు. అంతకన్న ఏం లేదు" అన్నాడు రాజేందర్.

రాజేందర్‌సింగ్ చర్యకి శారద ఏమీ అనుకోలేదు. కాని, ఆ దాడీవాలా అరవిందకి బావ ఎలా అయేడా అని అనుకోకుండా ఉండ లేకపోయింది.

ఆ విషయం ఎవర్ని, ఎలా అడిగి తెలుసుకోవాలో శారదకి అంతుపట్టలేదు. రాజేందర్ అంటే అరవిందకి చాలా ఇష్టం అని మొదటిరోజు అతన్ని కలుసుకొన్నప్పుడే గ్రహించింది శారద. ఇంట్లో అత్తయ్యా, మామయ్యకూడా ఆతని రాకపోకల్ని ప్రోత్స హిస్తున్నట్లే అనిపించింది. అరవిందకి, అతడికి మధ్య కేవలం స్నేహమేకాక అంతకుమించిన దృఢమైన అనుబంధం ఏదో ఉన్నట్లే ఉంది. ఒకటి రెండుసార్లు అత్త అన్న మాటలవల్లకూడా ఆ అభి ప్రాయం బలపడింది.

రాజేందర్‌సింగ్ ఎమ్.బి.బి.ఎస్. పూర్తిచేసుకొని అక్కడ గవర్నమెంటు హాస్పిటల్‌లో హౌస్ సర్జనుగా పనిచేస్తున్నాడు. ఆ ట్రెయినింగ్ కాస్తా పూర్తి అయిపోతే ఆ ఊళ్ళోనే ప్రైవేటు ప్రాక్టీసు పెట్టుకోవాలని అతడి ఆలోచన. "అప్పటికి ఆరూ చదువుకూడా ఇంకొక్క ఏడు మిగిలిఉంటుంది" అంది ఒకసారి మాటల్లో మాలతి. అత్త ఆ రెండింటిని కలిపిచెప్పడంలో ఏదో అభిప్రాయం ఉండే ఉంటుంది అనుకొంది శారద.

సాధారణంగా సాయంకాలంపూట అనిల్, రాజేందర్-ఆ ఇద్దరిలో ఎవరు వచ్చినా రాత్రిభోజనానికి ఉండి మరీ వెళ్ళేవారు. భోజనాల సమయంలో రఘునాథరావు వారిని మంచీ చెడ్డా విషయాలు అడిగి తెలుసుకొని, తనకి తోచినసలహాలు ఇస్తుండేవారు. వారిద్దరూ రఘు

నాథరావుని "అంకుల్" అని, మాలతిని "ఆంటీ" అని పిలుస్తుండే వారు.

ఒక్కొక్క వ్యక్తిని చూడగానే మంచివాడు అన్న అభిప్రాయం కలుగుతుంది. ఇంకొకరిపట్ల మొదటిపరిచయంతోనే విముఖత ఏర్పడుతుంది. ఈ అభిప్రాయాలకి, అనుభూతులకి ప్రత్యేక కారణాలంటూ పెద్దగా ఉండవు. చూపుమాత్రంగా మనిషిలోని మంచి చెడ్డల్ని విడదీసి ఇష్టపడ్డం, ద్వేషించడం జరుగుతుందని ఎవరైనా చెప్పినా అది నమ్మదగ్గవిషయం కాదు. అయితే, ఈ ఇష్టాయిష్టాలు ఎందుకు, ఎలా ఏర్పడుతాయి అంటే 'ఇదీ' అని కారణం చెప్పడం కూడా అంత సులవైన పనికాదు. సాధారణంగా మనిషికి తన తత్వానికి, అభిరుచులకు అనుకూలంగా ఉన్నవారిపట్ల ఇష్టం, వేరువిధంగా ఉన్నవారిపట్ల అయిష్టం కలగడం జరుగుతుంటుంది. ఒకసారి ఎదుటి వ్యక్తిపట్ల ఇష్టమో, అయిష్టమో ఏర్పరుచుకొన్నాక, ఆ మనిషిలో మంచిచెడ్డల్ని నిర్ణయించడానికి అదే సహాయకారిగా నిలుస్తుంది.

శారదకి అనిల్‌కుమార్ మంచివాడు అన్నభావన కలగడానికి, 'జేందర్ అంటే ఏదో వ్యతిరేకభావం మొలకెత్తడానికి పైన చెప్పిన వాటికంటె పెద్దగా కారణా లేమీ కనిపించవు. స్వతహా మితభాషి అయిన అనిల్ కంటే రాజేందరే శారదని ఎక్కువగా కవ్వించి మాటల్లోకి లాగి. చనువు ఏర్పరుచుకొనేవాడు. అతడికి తెలుగు రావడం దానికి కొంత కారణం. కాని, ఆతడు తనతోతప్ప ఇతరులతో తెలుగులో మాట్లాడుతుండగా శారద ఎప్పుడూ చూడలేదు. "నీకు ఇంగ్లీషులో మాట్లాడం అంత బాగా రాదుకదాని మా బావ శ్రమ తీసుకొని నీతో తెలుగులో మాట్లాడుతున్నాడే కాని, లేకుంటే తెలుగు, పంజాబీ, హిందీవంటి దేశభాషల్లో మాట్లాడమేమిటి? మనసులోని అతి చిన్న భావం వ్యక్తం చెయ్యడానికి హనుమంతుడి తోకంతమాట ఉపయోగించాలి" అనేది అరవింద, రాజేందర్‌మాటల్ని అనుకరిస్తూ.

రాజేందర్‌తో సంభాషణ ఎప్పుడు, ఎక్కడ, ఎలా మొదలైనా భూమి గుండ్రంగా ఉంది అన్నట్లు స్త్రీ పురుషులు, సెక్సు, ప్రేమ, పెళ్ళి దగ్గరికివచ్చి ఆగేది.

అతడికి ప్రేమ, పెళ్ళిపట్ల వింతయినభావాలు ఉండేవి. మనిషి ప్రేమో, పెళ్ళో ఏదో ఒకటిమాత్రమే కోరుకోవాలిట. రెండూ కావా లని అత్యాశకిపోతే ఒక్కటీ దక్కకుండా పోతుందిట. ఇటునుంచి పెళ్ళిబాజాలు ఇంట్లో వినపడగానే అటునుంచి ప్రేమపలాయనం చిత్తగిస్తుందిట. "ప్రేమలేని పెళ్ళి చెరుకుపిప్పితో సమానం. దవడలు నొప్పి పుట్టేలా ఆ పిప్పిని నములుతూ, దానిలోంచి తీయనిరసం ఏదో నోటిలోకి వస్తున్నాదని భ్రాంతిపడ్డమే పెళ్ళి అంటే" అనేవాడు.

ఎవరైనా కాదు, కూడదు అని కక్కుర్తిపడి పెళ్ళికి సిద్ధపడ్డా పిల్ల కన్నుముక్కుతీరు, ఒంటిమీద బంగారం, మామగారు వేయించబోయే ఉద్యోగం—ఇటువంటి ప్రలోభాలకి గురిఅయి చేసుకొంటే కళ్ళు మూసుకొని గోతిలో దిగుతున్నట్లే అనేవాడు.

వివాహానికి ముఖ్యోద్దేశం అయిన సెక్సు జీవితంలో యువతీ యువకులు ఒకరి కొకరు ఎలా నచ్చుతారో, ఎలా నప్పుతారో అనుభవంతో నిదానంగా తేల్చుకొని, ఇద్దరి అనుభూతులు, ఆవేశాలు కలిసిననాడు అప్పుడు పెళ్ళి చేసుకోవాలిట.

అమెరికావంటి కొన్ని పురోగామి దేశాల్లో కొన్నిచోట్ల కాలేజీల్లో, యూనివర్సిటీస్‌లో యువతీ యువకులకు ఇటువంటి అవకాశాలు కల్పించి, వారి దాంపత్యజీవిత భాగస్వామిని ఎన్నుకోవడానికి ఎన్నో రకాలైన వీళ్ళు కల్పిస్తున్నారట. పారిస్‌వంటి మహానగరాల్లో స్త్రీ పురుష సంబంధాన్ని ఇరుకుగదుల నాలుగుగోడలమధ్యనుంచి బయటికి లాగి, దానికి ఆరోగ్యవంతమైన గాలి, వెలుతురు తగిలేలా చేసి, వివాహవ్యవస్థ వెనక శవప్రాయంగా పడిఉన్న శృంగారతత్త్వానికి జీవంపోసి ప్రజలకి అందిస్తున్నారుట.

ఒకానొకకాలంలో మనదేశంలో స్వేచ్ఛాప్రేమతత్త్వం ఎంత ఉచ్ఛదశలో ఉండేదో మన దేవాలయ కుడ్యశిల్పాల్ని చూసినా, ప్రసిద్ధ కావ్యాల్ని చదివినా, పురాణకథల్ని తెలుసుకొన్నా కనిపిస్తుంటుంది. భాగవతంలో శ్రీ కృష్ణుడికి ఎనమండుగురు భార్యలుట. పైగా పదహారువేల గోపికలట. భారతంలో ద్రౌపదికి అయిదుగురు భర్తలు, పాండురాజు, ధృతరాష్ట్రుడు, వారి పుట్టుకలు—అదో కథ. వీటికి

కారణాలు అంటూ ఏవో వరాలు, శాపాలు కథలు ఉన్నాయి. కాని, అసలువిషయం స్త్రీ పురుష సంబంధానికి ఇప్పుడు ఉన్నన్ని అడ్డు గోడలు అప్పుడు లేవని తెలుస్తుంది. పెళ్ళి అనే ముద్ర విధిగా పడ వలసిన అవసరం ఉండేదికాదని తెలుస్తుంది.

దురదృష్టవశాత్తు ఆ సంస్కృతి కాలపుపొరల్లో కలిసిపోయింది. మనిషిలో స్వార్థం పెరిగిపోయింది. తనది తనకే ఉండాలని, ఇతరులు దాన్ని కన్నెత్తి చూడకూడదనే లాలస మొలుచుకొచ్చింది. ఈ స్వార్థంతో మనిషి తనచుట్టూ సభ్యతా, సంస్కారం అంటూ తొడు గులు కప్పుకొన్నాడు. కట్టుబాట్లు, ఆచారాలు, పాపం, పుణ్యం— అంటూ గోడలు కట్టుకొన్నాడు. మనం ఈ గోడలమధ్య పడి నలిగి పోతూ పవిత్రులం అని మురిసిపోతున్నాం. పాశ్చాత్యదేశాలవారు ఆ గోడల్ని పడగొట్టి బయటపడి జీవితాల్ని అనుభవిస్తున్నారు— అనేవాడు.

ఒక్కొక్కసారి ఇటువంటిమాటలు అతడినోట వింటుంటే శారదకి నిజంగా భయం పుట్టుకొచ్చేది. ఇతడి స్వేచ్ఛాప్రేమతత్త్వం ఇంకా ఏం పిచ్చితలలు వేస్తుందో, ఏ సమయంలో, ఎలా ప్రత్యక్ష మవుతుందో అని కంగారుపడేది. త్వరగా ఈ చదువు పూర్తిచేసుకొని తమ ఇంటికి వెళ్ళిపోగలిగితే బాగుండును అనుకొనేది.

ఇటువంటి అతడి ధోరణికి అలవాటు పడలేక, అటువంటి మాటలు వింటూ అట్టేసేపు కూర్చోలేక మధ్యలో శారద లేచిపో బోతూంటే, తటాలున ఆమె చెయ్యిపట్టుకొని, "ఉండు, ఉండు.... ఈ కాస్త విని మరీ వెళ్ళు" అనేవాడు రాజేందర్.

అటువంటిసమయాల్లో అతడు చెయ్యి వదిలిన ఎంతోసేపటి వరకు శారదగుండె దడదడ కొట్టుకొనేది. కాళ్ళు గడగడ వణుకు తూండేవి.

ఈ విషయాలన్నీ ఆ ఇంట ఎవరితో చెప్పేందుకు లేదు, ఇంటికి ఉత్తరం రాసేందుకు కాదు. ఆ ఉత్తరం తల్లిచేతిలో పడిం దంటే—"చదువూ వద్దు, పాడూ వద్దు. వెంటనే అందిన మొదటి

రైల్లో ఇంటికి తిరిగి రా'' అంటూ ఆజ్ఞ జారీచేస్తుంది. పోనీ, అర విందతో చెప్పుకొని మనసు చులకన పరుచుకొందామనుకొంటే. ఆమె అంతగా ఇష్టపడుతున్న వ్యక్తిమీద చెడగా చెప్పినట్లు అవుతుంది. కాదు. కూడదని తెగించిచెప్పినా, అరవింద ఇచ్చే జవాబు ఎలా ఉంటుందో శారద ఊహించగలదు.

''బావకి అలా ఆవేశంగా మాట్లాడ్డం అలవాటు, శారదా. అంతకన్న మరో చెడుతలంపుతో చేసినపని కాదు'' అంటుంది.

ఆ మాట నిజమే కావచ్చు. అతడు ఊహించుకొంటున్న సమాజంలో తిరిగివచ్చిన దేశాల్లో అది అసభ్యత కాకపోవచ్చు. అరవిందవంటి పిల్లలు దానిని అర్థం చేసుకొని, అతడిమాటల్ని కాక వాటివెనకఉన్న భావాలకి విలువఇచ్చి ఆదరించవచ్చు. కాని శారద వంటి పల్లెటూరిపిల్లకి, తలిదండ్రుల అదుపాజ్ఞలకింద, సంఘపు కట్టు బాట్లకింద పెరిగిన అమ్మాయికి కొరుకుడుపడని విషయంగానే తయా రయింది రాజేందర్ స్వేచ్ఛా ప్రేమతత్త్వం.

రాజుగారి చిన్నపెళ్ళాం మంచిది అంటే పెద్దావిడ కాదు అన్న మాట వేరుగా ఎత్తి చెప్పుకోకుండా తేలిపోతుంది. రెండు వస్తువుల్ని కాని, ఇద్దరు వ్యక్తుల్ని కాని పోల్చి చూసినప్పుడే తరతమ భేదం, ఇష్టాయిష్టాలు తెలియవచ్చేవి.

రాజేందర్ ఆలోచనలు, అతడి అభిప్రాయాలు తెలుసుకుంటు న్నప్పటినుంచి, అతడితోపాటే పరిచయం అయిన అనిల్‌కుమార్ పట్ల గౌరవం. అతడి ప్రవర్తనపట్ల మెప్పుదల శారద మనసులో రోజురోజుకి అభివృద్ధి కాసాగేయి.

అనిల్ ఎంత నెమ్మదిగా ఉంటాడు! ఏ మాట మాట్లాడినా ఎంత గౌరవంగా మాట్లాడుతాడు! మళ్ళా ఇద్దరూ చదువుకొన్నవాళ్ళే. పెద్ద ఇళ్ళల్లో పుట్టి పెరిగినవాళ్ళే. సభ్యతా ప్రపంచంలో మసలుతున్న వాళ్ళే. అయినా ఇద్దరిమాటల్లో, వ్యక్తిత్వాల్లో ఎంత భేదం! అను కొనేది శారద. అరవింద వ్యాఖ్యానం శారద అభిప్రాయాలకి విరు ద్ధంగా ఉండేది.

"అనిల్ ఉట్టి మందకొడి మనిషి. ఓ మాటకి, ఓ పనికి ధైర్యం, తెగింపు అన్నది అతడిలో మచ్చుకికూడా కనిపించదు. పాము చావకుండా కర్ర విరగకుండా ఏ పనినైనా ఏళ్ళతరబడి నడుపుకు రాగల చాకచక్యంమాత్రం అతడిలో నిండుగా ఉంది. తనది అనే ఒక వ్యక్తిత్వం, ఆలోచనా లేకుండా అన్నిటికి అమ్మ ఇష్టం, అమ్మ కోరిక అంటూ కబుర్లు చెబుతాడు.

ప్రస్తుత పరిస్థితుల్లో దేశానికి కావలసింది అనిల్‌కుమార్‌వంటి నాన్పుడుగాళ్ళు కాదు. రాజేందర్‌వంటి కార్యశూరులు. విషయాన్ని సూటిగా అర్థం చేసుకొని, మంచో చెడో మనసులోమాట ధైర్యంగా చెప్పగలిగేవాళ్ళు. మనసారా నమ్మినదాన్ని ఆచరణలో పెట్టగలిగే వాళ్ళు."

ఆరునెలలకాలంలో ఇన్ని విషయాలు అరిగించుకోవడం శారదకి కొంచెం కష్టమైనపనిగానే తయారయింది. అటు కాలేజీ వాతావరణం కొత్త. ఇటు ఇంట్లో దినచర్య కొత్త. కలుస్తుండే మనుషులు కొత్త. వారి మాటలతీరులు కొత్త. ఇన్ని కొత్తలమధ్య కాలం గడుపుతూ పొందే అనుభూతులు కొత్త. పండుగ సెలవుకి ఇంటికి వెళ్ళేక ఈ సంగతులన్నీ తండ్రితో చెప్పుకొని మనసు తేలిక చేసుకోవాలనుకొంది.

శారదకి చిన్ననాటినుండి తల్లిదగ్గర చేరిక తక్కువ. మనసులోని ఆరాటాల్ని, ఆలోచనల్ని తండ్రితో చెప్పేటంత స్వేచ్ఛగా తల్లితో ఏనాడూ చెప్పలేకపోయేది. కారణం—తండ్రి పిల్లలమాటల్ని, చేతల్ని సానుభూతితో అర్థం చేసుకోవడానికి ప్రయత్నించి, తగిన సలహాలు ఇచ్చేవాడు. తల్లి అలా కాదు. అలవాటుకి భిన్నంగా ఏ చిన్న పని జరిగినా అదిరిపోయేది. ఆ అదిరిపాటుని కోపంగా మార్చి పిల్లల మీద విరుచుకుపడేది.

ఆశించినవిధంగా శారద పండుగసెలవులకి ఇంటికి వెళ్ళలేకపోయింది. పరీక్షలు దగ్గరి కొస్తున్నాయి. కోర్సు పూర్తికాలేదంటూ కొందరు టీచర్లు ప్రైవేటుక్లాసులు పెట్టేరు.

కూతురు ఇంటికి రావడానికి అది తగినంత కారణంగా కని పించలేదు అన్నపూర్ణకి. "ఆ చదువేదో ఇక్కడ చదుపుకొంటే పోలే. ఆర్నెల్లు కావస్తున్నాది ఆడపిల్ల ఇల్లు వదిలి. ఎలా ఉందో, ఏం చేస్తు న్నాదో అన్న బెంగే లేదు మీకు" అంటూ భర్తని సాధించ సాగింది.

"ఒకసారి చదువులో పెట్టడం అంటూ జరిగేక అది పూర్తి అయ్యేమార్గం చూడాలి కాని, ఇలా పండుగలు, పబ్బాలు అంటూ దాన్ని ఇంటికి పిలుచుకురావాలంటే ఎలా? అక్కడైనా శారద అత్త గారి ఇంట్లో ఉంది కాని ఏదో హాస్టల్లోనో లేదు కదా....వాళ్ళు చేసు కొంటారు పండుగ" అని భార్యని సమాధానపరిచేడు రామస్వామి.

రామస్వామి అన్నట్లు రఘునాథరావుగారి ఇంట భోగిపండుగ, సంక్రాంతి అట్టహాసంగానే జరిపించేరు. కొందరు స్నేహితుల్ని, పరి చయస్థుల్ని పెద్దపండుగనాడు భోజనానికి పిలిచేరు. ఇంట్లో చిన్నా పెద్దా అందరికి కొత్తబట్టలు కొన్నారు. అత్త అరవిందకి, తనకి ఒక్కలాంటి చీరలే కొని తేవడం శారదకి ఆశ్చర్యం కలిగించింది. ఆమె హృదయ విశాలతకి, ఉదార బుద్ధికి చిహ్నంగా ఉంది అందాలు చిందే ఆ పట్టు చీరె. శారద అంత విలువైనచీరె అంతకుముందు ఎప్పుడూ కట్టలేదు. పండుగనాడు తలంటి నీళ్ళు పోసుకొని ఆ చీరె కట్టుకొంటే ఏదో కొత్తగా అనిపించింది. ఆ చీరెతో అద్దంలో చూసు కొంటే తను తనుకాదేమో అన్నంత భ్రాంతి కలిగింది.

"ఇంటికి నలుగురు వస్తున్నారు. ఇది వేసుకో" అంటూ ఒక పగడాల నెక్లేసు తీసి ఇచ్చింది అరవింద. అటువంటివే చేతికి గాజులు, చెవులకి కమ్మలు.

తనకి అవి వద్దని చెప్పాలనుకొంది శారద. కాని ఒక్కసారి అందమైన బట్టల్లో, ఖరీదైన నగలతో అలంకరించుకొంటే తనరూపు ఎలా ఉంటుందో చూసుకోవాలన్న కోరిక మనసుని పట్టిలాగి, అంద్దా మనుకొన్నమాట పెదవిదాటి రాకుండా అరికట్టింది.

''నిజం చెప్పాలంటే చామనఛాయలో ఉన్న అందం తెలుపుకి లేనేలేదు.'' భోజనాలదగ్గర శారద పక్కగా ఉన్న కుర్చీలోకూర్చుంటూ మెల్లగా అన్నాడు అనిల్.

ఇటువంటి పొగడ్తలు అవసరమున్నా, లేకున్నా సమయాన్ని చూసి జారవిడవడం రాజేందర్‌కి బాగా అలవాటు. ఆ రోజు అనిల్ నోటివెంట అటువంటిమాట విని శారద నివ్వెరపోయింది. తన పక్క కుర్చీలో కూర్చున్నది నిజంగా అనిల్‌కుమార్ బెనర్జీయేనా, లేక ఇంకొకర్ని చూసి తను అనిల్ అని భ్రాంతి పడ్డదా అన్నట్లు అతడి వంక ఆశ్చర్యంగా చూడసాగింది.

మనసులో కదిలినమాట కాస్తా అప్రయత్నంగా అలా నోటి వెంట బయటికి వచ్చేసేక—'ఇదేమిటి ఇలా అనేసేమే' అని అనిల్ కూడా కంగారుపడ్డాడు.

అనిల్ పరిస్థితిని శారద గుర్తించింది. అలా ఇద్దరి కిద్దరూ కంగారుపడుతూ ముఖాలు చూసుకొంటుంటే, అనవసరంగా చుట్టు పక్కల ఉన్న అందరిదృష్టిని ఆకర్షించినట్లు అవుతుందని అనిల్ నుంచి అటువంటిమాటలకి అలవాటు పడినదానిలా చిన్నగా నవ్వుతూ, 'థాంక్స్' అంది.

ఆ సంఘటన అంతటితో సమసిపోక ఆ రోజు పొడుగునా శారద మనసులో తిరుగుతూనే ఉండిపోయింది.

ఆ రోజు విందు భోజనాలకి అరవింద ఫ్రెండ్స్, మాలతి స్నేహితురాళ్ళు, రఘునాథరావు ఇష్టులు చాలామందే వచ్చేరు. ఆడా మగా మొత్తం ముప్ఫయిమందికి పైగా ఉన్నారు. నీటుగా ముస్తాబు చేసుకొన్న మగవాళ్ళతో, రంగురంగుల చీరెల్లోఉన్న అందమైన ఆడవాళ్ళతో భోజనాలగదంతా కిటకిట లాడుతున్నాది. అటువంటి సమయంలో ఇటువంటి విందుభోజనాలకి అలవాటుపడని శారద బెదురుగా ఒకమూల కుర్చీలో కూర్చుంటే అంతమందిలో ఆ పిల్ల ఉనికిని గుర్తించడమే కష్టం. అటువంటిది పనిపెట్టుకొని అక్కడికి వచ్చి, కళ్ళు నిండుగా ఆమెవంకచూస్తూ । అనిల్‌కుమార్‌వంటి మొగ

మాటస్థుడు అలా మెచ్చుకోవడం అన్నది సాధారణవిషయం కాదు. శారద మనసు ఆ సంగతిని గ్రహించింది కాబట్టే దానికి పలవలు, చిలవలు కల్పించి ఆ పిల్లని రోజంతా ఆటలు పట్టించింది.

మేడపై వరండాలో చివరగా నిలిచి తోటలోకి చూస్తూ ఈ విధమైన ఆలోచనల్లో తేలిపోతున్న శారద, తన వెనకగా వినవచ్చిన అడుగులచప్పుడు గుర్తించలేదు. ఆకస్మికంగా ఎవరివో రెండుచేతులు వెనకనుంచి పొదివి పట్టుకొనేసరికి ఉలిక్కిపడి, "అనిల్" అంటూ తిరిగిచూపింది. అక్కడ ఉన్న మనిషినిచూసి కెవ్వున కేకేసింది. అదృష్టవశాత్తు ఆ చుట్టుపక్కల ఎవరూ మనుషులు లేకపోవడంచేత ఆ కేక ఇంట్లో అలజడి రేపలేదు. కాని, ఎదుటఉన్న వ్యక్తిమాత్రం కంగారుపడి చేతులు సడలించేడు.

"సారీ, శారదా....అరవింద అనుకొన్నాను" అన్నాడు రాజేందర్, అక్కడినుండి వెళ్ళిపోతూ.

శారద ఆతడిమాట నమ్మలేకపోయింది. నమ్మకుండా ఉండనూ లేకపోయింది. ఆ రోజు శారద, అరవింద ఒక్కలాంటి చీరెలు కట్టు కున్నమాట వాస్తవమే. కాని, అంతమాత్రాన శారదని అరవింద అనుకోవడం అవతలివ్యక్తి ఏదో విధమైన తొందరలోనో, మైకం లోనో ఉంటేనే జరుగుతుంది. అరవిందకన్నా శారద బాగా పొడుగు.

శారద అనుమానం అట్టేసేపు నిలవలేదు. రాజేందర్ తొందర పాటువల్లే అటువంటి సంఘటన జరిగిందని తేలిపోయింది. ఆ రోజు పండుగ కాబట్టి రాజేందర్ మిత్రబృందం అంతా సినీమాకి వెళ్ళా లనుకొన్నారు. ఆ వార్త అరవిందకి అందజేసి ఆమెని ఒప్పించి తీసుకుపోవడానికి అలా వచ్చేడు రాజేందర్.

"నువ్వూ రా, శారదా" అంది అరవింద,

"మీరు వెళ్ళిరండి. నాకు తలనొప్పిగా ఉంది" అని తప్పించు కొంది శారద. వాళ్ళు వెళ్ళిపోయేరు.

అనిల్ వచ్చేడు. "వీళ్ళంతా ఏరీ?" అన్నాడు, ఒంటరిగా ఉన్న శారదని చూసి.

"సినీమాకి వెళ్ళేరు. మీరు వస్తే 'నలంద'కి వచ్చి కలుసుకో మని మీతో చెప్పమన్నారు."

"మీరు వెళ్ళలేదేం" కుతూహలంగా ప్రశ్నించేడు.

శారద జవాబు చెప్పలేదు. అరవిందతో చెప్పిన అబద్ధం అతడితో చెప్పాలనిపించలేదు.

"సరే, నే వెళతాను."

"సినిమాకేనా?" ఎందు కడిగిందో తనకే తెలియకుండా అడి గేసింది శారద.

"ఊహూఁ. అటువంటి ఇంగ్లీషు సినిమాలు నాకు నచ్చవు. ముద్దులు, నగ్నదృశ్యాలు తప్పిస్తే ఇంకేం చూడ్డానికి ఉండవు."

"నాకూను." మనసులో అనుకోబోయిన మాటని పరాగ్గా పైకే అనేసింది.

'అభిరుచులు కలిసేయి కాబట్టే మనం ఇద్దరం మిత్రులం అయేము.' ఈ మాట అనిల్ అనలేదు. అలా అర్థమిచ్చేలా నవ్వి వెళ్ళిపోయేడు.

# 4

నెల గంటు పెట్టగానే పండక్కి పుట్టింటికి వచ్చిన అనసూయని పండుగ వెళ్ళి మూడునెలలు కావస్తున్నా భర్త పిలుచుకు పోక పోవడం ఇరుగు పొరుగు ఇళ్ళలో అమ్మలక్కలమధ్య ఒక వార్త అయి కూర్చుంది. అన్నపూర్ణకికూడా అల్లుడి ఈ విధమైనచర్య అర్థం కాలేదు. పైకి ఏమైనా అంటే కూతురు మనసు కష్టపెట్టుకొంటుందని తన అనుమానాల్ని, ఆరాటాల్ని మనసులోనే నిలిపి ఉంచుకొంది.

"ముందు నువ్వు వెళ్ళు, పండుగనాటికి నేను వస్తాను" అన్న మగడు పండుగవెళ్ళి మూడునెలలు గడుస్తున్నా స్వయంగా రావడం కాని, ఒక ఉత్తరమైనా రాయడం కాని చెయ్యకపోతే ఆ ఇల్లాలి మన సులో ఎన్ని ఆందోళనలు రేగుతాయో, ఎన్ని అనుమానాలు పుట్టు కొస్తాయో అనసూయ మనసులోకి ఎవరైనా క్షణకాలంపాటు తొంగి చూస్తే తెలియవస్తుంది.

తన కాపురం సూటిలేదంటే తన పెళ్ళిమూలంగా అప్పుల పాలై, అగచాట్లు పడుతున్న తలిదండ్రుల్ని మరీ బాధ పెట్టినట్లు అవు తుందని బాధల్ని, అవమానాల్ని నోరుమూసుకు భరిస్తున్న అనసూయ ఈనాడు మొగుడుగురించి చెడ్డగా ఏం చెప్పుకొంటుంది? అలాగని ఎంతకాలం ఇలా పుట్టింట పడిఉంటుంది? నెలరోజులపైగా ఈ విధ మైన ఆరాటంతో కొట్టుమిట్టాడేక చివరికి ఒక నిశ్చయానికి వచ్చింది.

"నా ఇంటికి నేను వెళ్ళడానికి ఒకరి పిలుపెందుకమ్మా! రేపు వెళ్ళిపోతాను" అంది తల్లితో.

అన్నపూర్ణ కూతురు అన్నమాట భర్తతో చెప్పింది. పరిస్థితి ఏమిటో అర్థం చేసుకొన్న రామస్వామి కూతురిమాటకి కాదనలేదు.

"ఒంటరిగా ఎలా పంపుతాము? నువ్వెళ్ళి దిగబెట్టి రా" అన్నాడు.

ఆ మాట అన్నపూర్ణకికూడా బాగుందనిపించింది. వారం రోజులలో తనకి సెలవులు ఇస్తున్నట్లు శారద ఉత్తరం రాసింది. అనసూయని అల్లుడిదగ్గర దిగవిడిచి, అలా వెళ్ళి శారదను వెంటబెట్టుకొని రావచ్చు అనుకొంది. ఆ విషయం అల్లుడికి కార్డు రాసి పడేసేడు రామస్వామి.

"చూసేరా—నేను రాకపోబట్టే మీరు మా ఇంటికి వచ్చేరు. లేకపోతే ఇంతకాలం అయింది ఒక్కసారైనా వచ్చేరా?" అంటూ కలుపుగోలుగా అత్తగారిని పలకరించేడు గోపాలకృష్ణ.

"ఇంతకాలానికి దేవిగారికి ఇంటిమీదా, ఇంటాయనమీదా దయ కలిగిందన్నమాట" అంటూ భార్యని ఆహ్వానించేడు.

అల్లుడి కలుపుగోలుతనం, మాటలతీరు చూసేక అన్నపూర్ణ మనసులో అంతకుపూర్వం గూడుకట్టుకొన్న అనుమానాలు, భయాలు చాలావరకు తొలగిపోయేయి.

నాలుగురోజులు ఉండి వెళ్ళిపోయే అత్తగారిముందు తను తేలిపోకూడదని నిశ్చయించుకొన్నాడు గోపాలకృష్ణ. భార్యపట్ల ఎక్కడలేని అభిమానాన్ని ఒలకబోస్తూ, ఇంట్లోకి ఇది కావాలా, అది కావాలా అని అడుగుతూ ఎంతో బాధ్యతగల గృహస్థులా ప్రవర్తించసాగేడు.

అల్లుడి తీయతీయని మాటలకి, ఆడే నాటకాలకి బుట్టలో పడింది అత్తగారు. ఏమేమో అనుకొన్నాను కాని నా చిన్నల్లుడు ఎంతో మంచివాడు. నా తల్లి అనసూయ అదృష్టవంతురాలు—అని మురిసిపోయింది అన్నపూర్ణ.

అమ్మ ఉన్న నాలుగురోజులైనా ఈ బుద్ధి నిలబడితే అంతే చాలు. కూతురు సుఖంగా కాపురం చేసుకొంటున్నాది అనే తృప్తితో

ఆవిడ ఇంటికి వెళుతుంది. ఆవెనక తన గొడవలు తనకి ఎలాగా ఉండేవే అనుకొంది అనసూయ

అన్నపూర్ణ అల్లుడి ఇంటికొచ్చి నాలుగురోజులయింది. ఆ రోజు ఆదివారం. ''సినిమాకి వెళదాం బయలుదేరండి'' అన్నాడు గోపాలకృష్ణ.

''నే నెందుకు, నాయనా? మీ రిద్దరూ వెళ్ళిరండి'' అంది అన్నపూర్ణ.

''అలా కాదు. మీరుకూడా రావాలి. ఈ సినిమాలో మీ కొక తమాషా చూపిస్తాను.''

కూతురు, అల్లుడు రమ్మని బలవంతం చేస్తుంటే ఇంక తప్ప దన్నటు బయలుదేరింది అన్నపూర్ణ.

అది ఒక దొంగలముఠాకి చెందిన కథ. అందులో దొంగలు ఒక అబ్బాయిని చేరదీసి ఒక ఇంట్లో కన్నం వెయ్యడానికి సహాయం చెయ్యమని పంపిస్తారు. ఒకవేళ దొరికిపోతే ఎవరు పంపించింది చెప్పవద్దంటారు. చెప్పేవంటే చంపేస్తాం అని బెదిరిస్తారు. ఆ పిల్లడు ఇంటివాళ్ళకి దొరికిపోతాడు. ఎంత అడిగినా ఆ పనికి తనని వినియోగించినవాళ్ళ పేరు చెప్పడు. పోలీసులు చితక తన్నుతారు. తెలివితప్పి పడిపోతే ఈడ్చి జైల్లో పారేస్తారు.

''అమ్మా....అమ్మా'' అని చెయ్యి అడ్డంపెట్టుకొని ఆ పిల్లడు దెబ్బలు తింటుంటే అన్నపూర్ణకి వాసు జ్ఞాపకం వచ్చేడు. క్షణకాలం ఆ పిల్లడివంక నిదానంగా చూసేసరికి ఆ పిల్లడు వాసే అనిపించింది ఆమెకి.

''అయ్యో, నాయనా! సినిమాలో వేషాలు వెయ్యడం అంటే ఇదట్రా? ఎన్ని దెబ్బలు తిన్నావురా, నా తండ్రీ'' అంటూ కుమిలి కుమిలి ఏడవసాగింది.

''సినిమాలో ఆ కుర్రాడు వాసులా లేడూ?'' ఇంటికి వచ్చేక అన్నాడు గోపాలకృష్ణ.

''ఉండడమేమిటి, నాయనా....వాడు వాసే నా బంగారుతండ్రి వాసే'' అని ఏడవడం మొదలుపెట్టింది అన్నపూర్ణ.

ఆమె అలా అనుకోవడానికి స్పందించిన మాతృహృదయం తప్ప వేరే నిదర్శనాలు లేవు. తెరపై ఆ పాత్రధారిపేరు రాధేశ్యాం.

కొడుకు అడ్డమైనవాళ్ళచేత అలా తన్నులుతింటూ బ్రతుకుతున్నాడని ఆ రాత్రి పొడుక్కి ఏడుస్తూ ఉంది అన్నపూర్ణ.

''నే నేదో సరదాకి అంటే మీరు నిజంగా పట్టుకొన్నారేమిటి?'' అన్నాడు గోపాలకృష్ణ.

"మీరు అనడం కాదు. అమ్మ సినిమాలో ఉన్నంతసేపూ ఏడుస్తూనే ఉంది'' అంది అనసూయ.

''అయితే నిజమేనంటారా? ఉండండి, రేపు ఆ కంపెనీ వాళ్ళకి రాసి కనుక్కొందాం'' అన్నాడు గోపాలకృష్ణ. అత్తగారికి ధైర్యం చెబుతూ. అత్తగార్ని ఓదార్చడానికి గోపాలకృష్ణ ఆ మాట అన్నాడే కానీ, ఏ కంపెనీవాళ్ళకీ ఉత్తరం రాయలేదు. ఆ కుర్రాడు వాసనే నమ్మకం అతడికి కలగలేదు. ఈపాటికి వాసు ఎక్కడైనా బ్రతికిఉంటే ఇంతకన్నా బాగా పెద్దవాడు అయి ఉంటాడు—అనుకొన్నాడు.

తల్లిని సాగనంపుతూ కూతురు కళ్ళలో నీళ్ళు పెట్టుకొంది.

''తన కాపురాన్ని బాగుచేసుకోవడం, పాడుచేసుకోవడం ఆడదానిచేతిలో ఉంటుందే, తల్లీ! నలుగురిలో తిరిగే మగాడిగురించి నాలుగురకాలుగా అనుకొంటారు పైవాళ్ళు. అవన్నీ నమ్మకూడదు'' అంటూ కూతురుకి బుద్ధులుచెప్పి ఓదార్చింది అన్నపూర్ణ.

* * *

పరీక్షలు పూర్తి అయేయి. మరునాటినుండి వేసవి సెలవులు ప్రారంభమవుతాయి. కాలేజీ విడిచిపోయే ముందు జూనియర్స్ సీనియర్స్‌కి పార్టీ ఇచ్చి వీడ్కోలు పలకడం, వారూ వీరూ కలిసి నాటకాలని, పాటలని, పద్యాలని ఒక పూటంతా కాలేజీ ఆడిటోరియమ్‌లో అట్టహాసం చెయ్యడం, అడ్రసులు ఇచ్చి, పుచ్చుకోవడం—ప్రతి ఏడూ అలవాటుగా జరిగే కార్యక్రమమే. కాని, ఆ ఏడే కాలేజీలో

కాలుపెట్టిన పిల్లలకి ఇదంతా ఏదో కొత్తగా, ఎంతో ఉత్సాహంగా ఉంటుంది.

కాలేజీ మూతపడేముందు జరిగే ఈ హడావిడి అంతా శారదకి కొత్తగా కనిపించింది. అంతకాలం ఒకే గదిలో అక్కచెల్లెళ్ళ కన్న ఆత్మీయంగా గడిపిన కొందరు పిల్లలు, తప్పనిసరిగా విడిపోతూ చెప్పుకొంటున్న వీడ్కోలుమాటలు వింటుంటే మెత్తని మనసుగల అమ్మాయిల కళ్ళలో నీళ్ళు తిరగడం శారద చూసింది. తల్లీ, తండ్రీ-అక్కల పెళ్ళిలో అప్పగింతలు పెడుతూ కళ్ళ నీళ్ళు పెట్టుకోవడం గుర్తుకి వచ్చింది. ఆ బాధ, ఈ బాధ ఒక్కలాంటిదేనా? ఆలోచిస్తూ ఉండిపోయింది శారద.

"ఇంక వెళదామా?"

గ్రీన్ రూమ్‌లోంచి బట్టలు మార్చుకొని వచ్చింది అరవింద. అరవింద ఆ కాలేజీలో పి. యు. సి. చేసింది. ఎక్స్‌—స్టూడెంట్స్ ప్రోగ్రామ్‌లో ఓ చిన్నపార్టు తీసుకొంది.

"ఎంతబాగా నటించేవే, అరవిందా! ఆ వేషంలో చూసి నిన్ను నిజంగా పోల్చుకోలేకపోయే ననుకో" అంది శారద. ఉత్సాహంగా అరవింద చెయ్యి పట్టుకొంటూ.

"నీ పరీక్షలబెడద తీరిందికదా—కాస్తసేపు అలా తిరిగొద్దాం, పద" అంది అరవింద.

కాస్తసేపు బజార్లో తిరిగి, పక్కగాఉన్న ఒక రెస్టారెంటులోకి దారితీసింది అరవింద.

"సాయం అక్కడ ఏదో తిన్నాంగా—మళ్ళీ ఎందుకు?" అంది శారద.

"టిఫిన్ కాదు, భోజనం. మినర్వాలో ఏదో హిందీ సినిమా ఆడుతున్నాది. పంకజం బాగుంది అంది. చూసిపోదాం" అంది అరవింద. మెనూకార్డులో తమకి కావలసిన పదార్థాలుపేర్లు చూస్తూ.

"ఇంటిదగ్గర అత్తయ్య చూస్తుంటుందేమో?"

కాని, అరవింద ఫోను చేసేసరికి తల్లి ఇంకా ఇంటికి చేర లేదు. కొత్తగా పనిలోచేరిన బేరర్ ఫోన్ తీసేడు.

''అమ్మగారు వస్తే చెప్పు, కాస్త ఆలస్యంగా వస్తామని. మా కోసం భోజనం ఉంచక్కర్లేదు.''

''అలాగేనమ్మా! అమ్మగారు రాగానే చెపుతాను'' అన్నాడు వాడు.

అరవింద రిసీవర్ పెట్టేయబోతుంటే—''ఎవరో చుట్టాలు వచ్చేరమ్మా'' అన్నాడు.

''ఎవరు? వచ్చి ఎంతసేపయింది?'' తెలుసుకోవాలని పెద్ద కుతూహలం లేకపోయినా అడిగింది అరవింది.

వచ్చిన చుట్టా లెవరో వాడికి తెలియదు.

''గోపన్నని అడిగి రమ్మంటారా!'' అన్నాడు.

గోపన్న ఆ ఇంట చాలాకాలంగా ఉన్న నౌకరు. ఇంటికి వచ్చే పోయేవాళ్ళలో అమ్మగారివంక చుట్టాలు, అయ్యగారివంక ఆప్తులు అందర్నీ పేరు పేరునా వాడికి తెలుసు.

''అక్కర్లేదు'' అంటూ ఫోను పెట్టేసింది అరవింద.

గడియకో, గంటకో తల్లి రానే వస్తుంది. ఆ చుట్టపక్కా లెవరో ఆవిడే చూసుకొంటుంది. తనెందుకు లేనిపోని బెడద తల కెత్తుకోవటం అని ఆ విషయాన్ని అంతతో మనసులోంచి నెట్టి వేసింది.

అరవింద, శారద భోజనం ముగించుకొని రెస్టారెంటులోంచి బయట పడేసరికి తొమ్మిదిన్నరకిపైగా అయింది. టికెట్లు తీసికొని సినీమాహాలులో కాలు పెట్టేసరికి పిక్చరు మొదలయింది.

ఇంకా టైటిల్స్ తిన్నగా పూర్తి అయేయో లేదో ఒక చావు సీను. దానివెంటనే కాలేజీ పిల్లల పిక్నిక్ అంటూ అర్ధ నగ్నదుస్తుల్లో ఉన్న అమ్మాయిలు, గొట్టం ప్యాంట్లు తొడుక్కుని అడుగు కదప డానికి అవస్థలు పడే అబ్బాయిలు డాన్సుపేరుతో వేసే పిచ్చిగంతులు—

వారి మధ్యలోంచి విడివడ్డ హీరో. హీరోయిన్‌ల జంటపాట పాడు కొంటూ తోటలంట, పార్కులవెంట పరుగులు—ఇంటర్‌వెల్ దగ్గిరికి వస్తున్నాదనేసరికి కోరమీసాలు మెలివేస్తూ, విలన్ నవ్వు నవ్వుతూ ఒక విలన్‌గాడుకూడా వెండితెరపై అవతరించేడు.

అంతవరకు చూసేసరికి అరవిందకి తలనొప్పి మొదలయింది. ''చెత్త వెధవ సినీమా, పంకజానికి ఎలా నచ్చిందో కాని'' అంది శారదవైపు తిరిగి.

పరీక్షలమూలంగా నెల రోజులకిపైగా సరిగా నిద్రలేని శారద హాయిగా కుర్చీలో వెనక్కి చేరబడి నిద్రపోతున్నాది. అరవింద మాటతో తుళ్ళిపడిలేచి అటూ ఇటూ కంగారుగా చూసింది. హాలు నిండా లైట్లు వెలుగుతున్నాయి. మనుషులు లేచి బయటికి వెళు తున్నారు.

"సినిమా అయిపోయిందా?'' నిద్రమత్తులో ఎర్రగా ఉన్న కళ్ళని రుమాలుతో తుడుచుకొంటూ అడిగింది.

''ఇంకా అయిపోలేదు. ఇది ఇంటర్‌వెల్. పద, ఇంటికి పోదాం'' అంది అరవింద సీటులోంచి లేస్తూ.

తనా విధంగా నిద్రపోవడంతో ఉత్సాహం తగ్గి అరవింద అలా మధ్యలో లేచిపోతున్నాది అనుకొంది శారద.

''సారీ, అరవిందా! నిద్ర ఆపుకోలేకపోయేను. ఒకసారి బయటికివెళ్ళి ముఖం కడుక్కొస్తాను, కూర్చో'' అంటూ లేవ బోయింది శారద, తన ప్రవర్తనకి నొచ్చుకొంటూ.

''అంత కష్టపడి చూడ్డానికి ఇందులో ఏం లేదు. నాకూ తల నొప్పిగా ఉంది. బాధపడుతూ ఈ చెత్త చూసేకన్నా, హాయిగా ఇంటికి పోయి నిద్రపోవడం మంచిది'' అంది అరవింద బయటికి దారితీస్తూ.

వాళ్ళు ఇల్లు చేరేసరికి ముందుహాలులో ఇంకా దీపాలు వెలుగు తున్నాయి. ''అమ్మ ఇంకా పడుకోలేదులా ఉంది'' అంది అరవింద తలుపు తోస్తూ.

ఎదురుగా సోఫాలో తల్లి కూర్చుని ఉంది. చేతిలో ఏదో పుస్తకం ఉన్నా దృష్టి దానిమీద లేదు. కొద్దిగా వంగి పక్కనున్న వ్యక్తితో ఏమో మాట్లాడుతున్నాది. ఎవరో చుట్టాలు వచ్చేరంటూ రంగనాథం చెప్పినవిషయం గుర్తుకొచ్చింది.

ఎవరబ్బా ఉత్తరం పత్తరం లేకుండా ఇలా ఊడిపడ్డ చుట్టాలు —అనుకొంటూ అటు తల తిప్పి చూసింది.

అరవింద వెనకనే హాలులో కాలు పెడుతున్న శారద సోఫాలో అత్తపక్కన ఉన్నవ్యక్తినిచూసి "అమ్మ" అంది ఆశ్చర్యంగా. గోడకున్న గడియారంలో చిన్నముల్లు చూపుతున్న అంకెనిచూసి 'అమ్మో' అంది శారద మనసు.

తలుపు తెరిచిన అలికిడికి మాలతి, అన్నపూర్ణ—ఇద్దరు ఒక్కసారే అటు తిరిగిచూసేరు.

"ఇదుగో శారదా, ఎవరొచ్చారో చూసేరా?" అంది మాలతి ఉత్సాహంగా.

అనుకోకుండా తల్లి అలా వచ్చినందుకు ఆశ్చర్యపోయింది శారద. ఆ ఆశ్చర్యంతోపాటు ఆనందం, ఆందోళనాకూడా శారద మనసులో ప్రవేశించేయి. 'రాకరాక అమ్మ ఈ రోజే రావాలా? వెళ్ళక వెళ్ళక తను ఈరోజే సినిమాకి వెళ్ళాలా?' అని మనసులోనే విసుక్కొంది.

"బాగా రాత్రయింది. ఇప్పటివరకు అక్కడే ఉన్నారా?" ప్రశ్నించింది.

"రంగనాథం చెప్పలేదూ, కాస్త ఆలస్యంగా వస్తామని? మాకోసం భోజనం ఉంచద్దని చెప్పేనే?"

"వాడి పెళ్ళానికి పురిటి సమయంగా ఉందిట. నేను వచ్చేసరికే వెళ్ళిపోయేడు, ఇంతకీ ఎక్కడికి వెళ్ళేరు?"

"సినిమాకి."

ఇదన్నమాట సంగతి—అన్నట్లు కూతురివంక తీక్ష్ణంగా చూసింది అన్నపూర్ణ. పైకిమాత్రం "బాగున్నావా, అమ్మా, పరీక్షల బడలికే నేమిటి అంతలా నీరస పడిపోయేవు?" అంది లాంఛనంగా.

ఇదే ఇంకోరోజున అనుకోకుండా తల్లి రావడం జరిగితే "అమ్మా" అంటూ ఎగిరి గంతేసి తల్లిని వాటేసుకొనేది శారద. పది నెలల ఎడబాటు పగిలిపోయేలా ఎన్నో విషయాలు గుక్కతిప్పకుండా ప్రశ్నించి ఉండేది. కాని, ఆ రోజు తల్లిని చూడగానే రావలసిన ఆనందం శారద మనసులోకి, పైగా భయంకూడా వేసింది. మామూలు పలకరింపులకిమించి చనువుగా మాట్లాడలేకపోయింది. ఏదో తప్పు చేసినదానిలా తల వంచుకొని గదిలోకి నడిచింది.

అరవింద అత్తని పలకరించి క్షేమసమాచారాలు అడిగి, శారదకి గుడ్‌నైట్ చెప్పి తన గదిలోకి వెళ్ళిపోయింది. అరవింద వెళ్ళిపోయేక గదితలుపు దగ్గరికేసి కూతురివంక తీక్ష్ణంగా చూస్తూ, "ఊఁ, ఇదన్నమాట ఇక్కడ నువ్వు వెలగబెడుతున్న చదువు" అంది కటువుగా అన్నపూర్ణ.

అంతకు ముందురోజువరకూ ఒక్క నిమిషం అయినా వ్యర్థ పుచ్చక తనెలా చదివిందీ, ఆ రోజైనా అరవింద బలవంతంమీద సినిమాకి వెళ్ళవలసి వచ్చిందనీ, అంతకిపూర్వం ఈ పదినెలల్లో ఇలా వేళతిరిగి తను ఇంటికి వచ్చినరోజు ఒక్కటికూడా లేదనీ—ఇలాగే ఎన్నో విషయాలు తన్ను తాను సమర్థించుకొంటూ తల్లితో చెప్పా లనుకొంది శారద. కాని, తల్లి చూపిన ఆ చూపుతో ఆ పిల్లనోట తడారిపోయింది. ఒక్క మాటకూడా గొంతుక పెగుల్చుకొని బయటికి రాలేదు.

తల్లి తనని దోషిని చూపినట్లు అలా చూడ్డంతో శారద మన సుకి కష్టం కలిగింది. తనలో తప్పు లేనప్పుడు ఎవరికైనా తను సంజాయిషీ ఎందుకు చెప్పుకోవాలి—అనే అహం పొడుచుకొచ్చింది. మారుమాట లేకుండా బట్టలు మార్చుకొని, మంచంమీదపడి కళ్ళు మూసుకొంది.

కూతురి మౌనానికి కారణం మరోలా అర్థం చేసుకొంది అన్న పూర్ణ. చేస్తున్న వెధవపని బయటపడ్డాక ఇంకేమని వాదిస్తుంది ? ఎలా సమర్థించుకొంటుంది ? అందుకే నోరు మూత పడిపోయింది అను కొంది.

మరునాడు ఉదయమే కూతుర్ని తీసుకొని ప్రయాణమయింది అన్నపూర్ణ.

"రాకరాక ఇల్లు కదిలివచ్చేవు. రెండు రోజులుండి వెళ్ళు" అంది మాలతి.

"ఇల్లు వదిలి పది రోజులకుపైగా అయింది. ఆ గోపిగాడితో మీ అన్నయ్య ఏం తంటాలు పడుతున్నారో? లేకపోతే ఉండనా?"

వదినగారు ఒకమాట మనసులో అనుకొంటే దానిని తిప్పడం ఇంక జరిగేపనికాదని మాలతికి తెలుసు. అందుకే మరేమంత పట్టు పట్టకుండా ఊరుకొంది.

శారద తన బట్టలు, పుస్తకాలు సర్దుకొంటుంటే అరవింద వచ్చింది. "ఆ పుస్తకాలన్నీ ఎందుకు మోసుకుపోవడం? కాలేజీలు తెరవగానే మళ్ళా వస్తావుగా" అంది.

"అది వచ్చినప్పుడు దాని సామాన్లు రాకుండా ఉండిపోతాయా?" అంది అన్నపూర్ణ, అన్నీ సర్దు అన్నట్లు కూతురివైపు చూసి.

తను ఈ ఊరు మళ్ళీ తిరిగివస్తుందా? తల్లి అసలే అనుమానపు మనిషి. తిరిగి అత్తగారింటికి పంపిస్తుందా? ఈ చదువు ఇంతటితో సరేనా, లేక ముందుకిసాగే యోగం ఉందా? ప్రయాణం పొడుక్కీ శారద ఈ ఆలోచనలతో సతమతమవుతూనే ఉంది.

* * *

అంతవరకు మనసులో నిలబెట్టుకొన్న కోపాన్ని ఇంట్లో కాలు పెట్టగానే బయటికి వెళ్ళగక్కింది అన్నపూర్ణ. ఆడపిల్లని పైచోట వదిలి ఏడాదిపాటు ఏమీ పట్టించుకోని భర్తమీద విరుచుకుపడింది. ఆ ఏడు శారద పరీక్ష ఎలాగా పాసు కాదని జోస్యం పలికింది.

తల్లి ఎన్నిమాటలు అంటున్నా వింటూ ఊరుకొంది శారద.

శారద కార్యవాది. ఈ రోజు కోపంకొద్దీ తల్లి ఏదో అంటున్నా తను మంచిమార్కులతో పరీక్ష పాసయిందని విన్ననాడు తనంతట తనే చల్లబడుతుంది. ఇప్పుడు ఏమన్నా మాటకిమాట తెగులు అన్నట్లు కార్యం చెడడం మినహా ఫలితం ఉండదు

"అసలు అది అక్కడ చదువుకోవడానికి వెళ్ళిందా? అత్త వెనక, అరవింద వెనక తిరగడానికి వెళ్ళింది కాని.... అలా చూస్తాం డండి మరి రెండునెలల్లో తెలుస్తుంది—అక్కడ మీ కూతురు వెలగ బెట్టిన చదువేమిటో? ఈ ఏడు దానిపరీక్ష పాసైతే నా చెవి కోసి ఇస్తాను."

తల్లి అలా అంటూంటేమాత్రం శారదకి కష్టం తోచింది. వాసు తనంతట తను లెక్కలపేపరు పాడుచేసేను అని చెప్పినా, ఏమో అదృష్టం బాగుండి ఆపాటి పాసుమార్కులైనా ఆ పేపర్లో వచ్చి, కొడుకు పరీక్ష పాసుకాకపోతాడా—అని ఆశతో ఎదురుచూసిన తల్లి, తన చదువుసంధ్యలగురించి, ఒక్కమాటైనా అడిగి తెలుసు కోకుండానే తన పరీక్ష తప్పిపోతుందని అంత గట్టిగా చెబుతుంటే కొంచెం కోపంకూడా వచ్చింది.

'కన్నతల్లివి నోరారా దీవిస్తున్నావుగా.... నీ దీవన ఫలించ కుండా ఎలా పోతుందిలే' అనాలనుకొంది శారద.

భార్య మాటలతో చిన్నబుచ్చుకొన్న కూతురివైపు జాలిగా చూసేడు రామస్వామి.

"బాగున్నావా, తల్లీ! పరీక్షలన్నీ బాగా రాసేవా?" అన్నాడు అభిమానంగా దగ్గరికి తీసుకొంటూ.

అలా అనడంలో మీ అమ్మసంగతి నీకు తెలియందేముంది? ఆవేశంవస్తే అది మనిషికాదు. ఆ మాటలేం పట్టించుకోకమ్మా అనే ఊరడింపు ఉంది.

"అన్నిపేపర్లు బాగా రాసేను, నాన్నా. సెకండ్ డివిజన్ రావచ్చు" అంది నెమ్మదిగా శారద.

వెయ్యవలసిన నాలుగు అక్షతలు మొగుడుకి, కూతురుకి వేసి, ఇంక తన బాధ్యత తీరిపోయింది అన్నట్లు పెరట్లోకి వెళ్ళిపోయింది అన్నపూర్ణ. అన్నపూర్ణమాట పెరట్లో వినపడగానే పక్కింటి రాజు అమ్మ, మొండిగోడపక్కగా ఉన్న చిక్కుడుపందిరి దగ్గరికివచ్చి,

పాపం, అన్నగారు చయ్యి కాల్చుకోలేక, ఆ గోపిగాడితో పడలేక నానా గడ్డీ కరిచేరనుకో'' అంది.

''ఏం చెయ్యడం, రాజులమ్మోదినా! ఒకచోటుకి వెళ్ళడం వరకే మనిష్టం కాని, తిరిగి రావడం మనచేతిలో ఉన్న పనా? అల్లుడు, రాకరాక వచ్చేరు. ఓ నెలరోజులపాటైనా ఉంటేకాని వల్లకాదని, ఒకటే గొడవ చేసేడు. ఇప్పటికైనా అతన్ని సమాధానపెట్టి వచ్చేసరికి నా తాతలు దిగివచ్చారనుకో.'' నూతిలోంచి బాల్చీతో నీళ్ళు తోడుకొని కాళ్ళూ చేతులూ కడుక్కొంటూ, చిన్నల్లుడు ఎంత బుద్ధిమంతుడో, అతనికి అనసూయ అంటే ఎంత అభిమానమో గుక్క తిప్పుకోకుండా చెప్పింది అన్నపూర్ణ.

అనసూయని మొగుడు వదిలేసేడనీ, అందుకే పుట్టింటికివచ్చి నాలుగునెలలు కావస్తున్నా తొంగిచూడలేదనీ ఈ రాజులమ్మే పుకార్లు పుట్టించి ఆ వార్తని ఊరూ వాడా వ్యాప్తిలోకి తెచ్చింది. ఆ విషయం ఎరిగిఉన్న అన్నపూర్ణ, కుక్క కాటుకి చెప్పుదెబ్బ అన్నట్లు అయినవీ కానివీ జోడించి అరగంటకిపైగా అల్లుడి గొప్పతనం, మంచి, మర్యాదా వర్ణిస్తూ రాజులమ్మకో మంచి డోసు ఇచ్చింది.

అన్నపూర్ణ కూతుర్ని వెంటబెట్టుకొని ఊరుకి వెళుతుంటే, ''చూస్తూండండి, మూడోనాటికి తల్లీ కూతుళ్ళు లబోదిబో అంటూ తిరిగి వస్తారు'' అని రాజులమ్మ చెప్పిన జోస్యం గాలికి ఎగిరిపోయి, అన్నపూర్ణ సలక్షణంగా అల్లుడి ఇంటి గౌరవాలు అందుకు రావడంతో రాజులమ్మకి ఒంటికి ఆవగుండ రాసుకొన్నట్లు చిటపట లాడింది. ఆ మంటని ఎలాగో ఒకలాగ ఇన్ని నీళ్ళు చిలకరించుకొని చల్లబరుచుకోనిదే నిలవలేనిస్థితికి వచ్చింది, అందుకే తన ధోరణిని అనసూయ మీంచి శారదమీదికి తిప్పి, ''మీ శారద వచ్చిందిలాగుందే....పరీక్షలూ అవీ బాగా రాసిందా?'' అంటూ ప్రశ్నించింది.

అంతకుపూర్వం అన్నపూర్ణ భర్తమీద, కూతురిమీదా విరుచుకుపడ్డం, శారద పరీక్ష పాసైతే చెవికోసి ఇస్తాననడం వగైరా వివరాలన్నీ రాజులమ్మ వీధి గడపలో నిలబడి వినసే వింది. ఈ

సందర్భంలో అయినా అన్నపూర్ణని ఓ నొక్కు నొక్కాలనే అభిప్రాయంతోనే అప్పుడు ఆ ప్రస్తావన లేవతీసింది.

రాజులమ్మ తను తెలివైనదాన్ని అనుకొంటే, అన్నపూర్ణేనా అంతకి తక్కువ తిన్నది? అందుకే రాజులమ్మ ముఖం చిక్కడాకంత అయిపోయేలా ఫెడేల్‌మని మాటకిమాట తిప్పికొట్టింది.

"ఆఁ....ఏదో నీ దయవల్ల అన్నీ బాగానే రాపిందిట, వదినా! వాళ్ళత్తయ్యా, మామయ్యా దానికి ఫస్టుక్లాసు వస్తుంది అంటున్నారు. అయినా, పరీక్షల్లో మా శారదకి మార్కులు రాకపోతే ఇంకెవరి కొస్తాయి చెప్పు? నా కూతురని అనుకోవడం కాదు కాని, మా శారద చీమ్మిరపకాయనుకో" అంది అన్నపూర్ణ, అటువంటి కూతురికి తల్లిని నేను అన్నట్లు గర్వంగా.

సబ్బుబిళ్ళ, తువాలు పట్టుకొని స్నానానికని అటుగా వచ్చిన శారద తల్లి తననుగురించి రాజులమ్మతో అంటున్నమాటలు విని నిజంగా అమ్మ తమాషా అయిన మనిషి—అనుకొంది చిన్నగా నవ్వుకొంటూ.

* * *

పి. యు. సి. పరీక్షా ఫలితాలు తెలిసేయి. శారద తన మనసులో అనుకొన్నట్లు ఫస్టు క్లాసు రాలేదుకాని, తండ్రితో చెప్పినట్లు సెకండ్ క్లాసు వచ్చింది. కూతురి పరీక్ష పాసయిందన్న సంతోషంతో చిన్న పిల్లాడిలా భార్యని ఉడికించడం మొదలెట్టేడు రామస్వామి. "శారద పరీక్ష పాసయితే ముక్కో, చెవో ఏదో కోపిస్తానన్నావు కదూ? నా గడ్డం గీసుకొనే కత్తి తెమ్మంటావా, నీ కత్తిపీట పనికి వస్తుందా" అంటూ.

కూతురు మంచి మార్కులతో పరీక్ష పాసయినందుకు అన్నపూర్ణకి ఆనందంగానే ఉంది. కాని, దానిని మనసులోనే దాచిపెట్టుకొని, "ఆఁ చాల్లెండి మహా సంబరపడిపోతున్నారు. ఆడపిల్ల చదువు, మగాడి వంట ఎందుకు ఉపయోగపడేటట్లు? ఏదో ఒక సంబంధంచూపి ఆ మూడు ముళ్ళూ వేయించి అత్తవారింటికి పంపవలసిన పిల్లకి ఎన్ని

మార్కులు వస్తేమాత్రం ఏం ఒరిగిపోయింది!'' అంది, ధోరణి పక్కదోవ పట్టించి.

అమ్మ వాడే కత్తికి రెండువైపుల పదునే. ఎటునుంచి అనువుగా ఉంటే అటునుంచి నరుక్కువస్తుంది—అనుకొంది శారద.

శారద పరీక్ష పాసయినందుకు తమ అభినందనలు తెలుపుతూ అరవింద, మాలతి, అనిల్, రాజేందర్—అంతా ఉత్తరాలు రాసేరు.

"అన్ని ఉత్తరాలు ఎక్కడినుంచి?'' అంది అన్నపూర్ణ.

"అక్కడ తెలిసినవాళ్ళు రాసేరమ్మా—నా పరీక్ష పాసయిందని తెలిపి సంతోషం తెలుపుతూ'' అంది శారద.

అందరికీ ధన్యవాదాలు తెలుపుతూ జవాబులు రాసింది శారద. అరవిందకి రాసిన ఉత్తరంలో కాలేజీలో అప్లికేషనుఫారాలు తీసుకొని పంపమని రాసింది.

వారం తిరక్కుండానే అరవింద పంపిన ఫారాలు అందేయి. అన్నిటినీ జాగ్రత్తగా పూర్తిచేసి, తండ్రికి చూపించి పోస్టుచేసి వచ్చింది.

శారద తిరిగివచ్చేసరికి అనంతరాముడు వంటఇంటి గడపలో పీటమీద కూర్చుని అన్నపూర్ణతో ఏవో మంతనాలు సాగిస్తున్నాడు. అతడికి, అన్నపూర్ణకి బీరకాయ పీచు సంబంధం ఏదో ఉంది. ఆ ఊరు ఎప్పుడు వచ్చినా, ఆ బంధుత్వాన్ని కలుపుకొంటూ 'కోడలా' అంటూ వారిఇంటికి వచ్చి అన్నపూర్ణని పలకరించి వెళ్ళుతుంటాడు. అంతటితో ఊరుకోక అయినవీ, కానివీ చెపుతూ, అయాచిత సలహాలు సరఫరాచేస్తూ తను ఆ కుటుంబంవారికి ఆప్తుణ్ణి, శ్రేయోభిలాషిని అన్నట్లు మాట్లాడుతుంటాడు.

అప్పుడు వారిద్దరిమధ్య జరుగుతున్న మంతనాలు ఏమిటో శారదకి అంతుపట్టలేదు. తెలుసుకోవాలనే కుతూహలం ఉన్నా, ఎదుట పడితే—'ఇదేనా నీ మూడోకూతురు? గుర్రంలా పెరిగి ఉంది. వేగిరం ఏదో ఒక సంబంధంచూపి పెళ్ళి చేసేయి' అని అందుకొన్నాడంటే అక్కడికి తనపని అయిపోయినట్లే. ఏపాటి గాలి తగిలినా

మండటానికి సిద్ధంగా ఉంది తల్లి మనసులో ఆ ఆలోచన. దుష్టులకి దూరం అన్నట్లు ఈ మంతనాలకి తను ఎంతదూరంలో ఉంటే అంత మంచిది అనుకొంది.

అరగంట గడిచి, అనంతరాముడు అన్నపూర్ణ ఇచ్చిన అర్ధ శేరుపట్టే కంచుగ్లాసుడు కాఫీ సేవించి ఆ ఇంటినుంచి కాలు బయట పెట్టేవరకు శారద ఆ చాయలకి పోవడమే మానుకొంది.

సాయంకాలం నాలుగుగంటలవేళ శారద బట్టలు మార్చుకొని, బయటికి వెళ్ళబోతుంటే అడ్డుగా వచ్చింది అన్నపూర్ణ—"ఇంకా ఎండ మాడిపోతున్నాది....ఎక్కడికి ప్రయాణం?" అంటూ.

"ఓసారి సావిత్రి పిన్నిగారి ఇంటికి వెళ్ళొస్తానమ్మా! చాలా రోజులయింది. అటు వెళ్ళడమే పడలేదు" అంది శారద, పాయి తిన్నగారాక జడలోంచి జారిపోతున్న మల్లెచెండుని సరిచేసుకొంటూ.

"వాళ్ళ 'విస్సు' ఇక్కడ లేడు."

విశ్వం శారద చిన్ననాటి స్నేహితుడు. శారదకన్నా పది నెలలో, ఏడాదో చిన్నవాడు. ఇంట్లో ఆ కుర్రాడిని అంతా విస్సు అని పిలిచేవారు. శారదా వాళ్ళింటికి మూడిళ్ళు అవతలగా ఉండేది వారి ఇల్లు. శారద అంటే విస్సుకి చెప్పలేనంత ఇష్టం. ఒక్కనిమిషం ఆ పిల్లని వదిలి ఉండేవాడు కాదు. శారూ, శారూ అని పిలుస్తూ వెంట వెంట తిరిగేవాడు. ఉంగరాల జుట్టు, ఆపిల్ పండ్లలా ఎర్రటి బుగ్గలు, సోగకళ్ళు—ఆ వయసులో చూడ ముచ్చటగా ఉండేవాడు విస్సు. సావిత్రమ్మకూడా ఒక్కడే పిల్లడు కావటాన, ఉన్నంతలో ఆ పిల్లడికి ఏ లోటూ రాకుండా ముద్దుగా చూసుకొనేది.

శారదకికూడా విశ్వం అంటే చాలా అభిమానం ఉండేది. తను ఏపని చేసినా, ఎక్కడికి వెళ్ళినా 'విస్సూ, విస్సూ' అంటూ ఆ పిల్లడిని కూడా తీసుకుపోయేది. ఆ పిల్లడిమీద శారద అంత ఇష్టం పెంచుకోవడానికి కారణం లేకపోలేదు. త నే మాటన్నా విస్సు ఎవరికీ చెప్పేవాడు కాదు. ఏపని చెప్పినా ఎదురుచెప్పి కాదనేవాడు కాదు.

అందమైన ఆ పిల్లడి రూపంకూడా శారదని ఆకర్షించేది. అయినా, పైన చెప్పిన కారణాలే శారదకి విశ్వంపట్ల అంత ఇష్టం ఏర్పడ్డానికి ముఖ్యమైనవి.

ఇంట్లో అన్న వాసుతోకాని, తమ్ముడు గోపీతోకాని శారదకి పడేది కాదు. వాసు తను అన్నని, పెద్దవాడిని అనే అధికారంతో శారదమీద ఆధిపత్యం నెరపడానికి చూసేవాడు. తమ్ముడు గోపీ త నే మాట చెప్పినా తు. చ. తప్పకుండా తల్లికి అందజేసేవాడు. "ఇంటి వారికి పస్తు, పొరుగువారికి పోరట్టూ అని స్వంత తమ్ముణ్ణి వదులు కొని వాడిని పట్టుకు తిరుగుతావేం" అని కేకలేసేది తల్లి.

రోజులో చాలాభాగం విశ్వం, శారదా ఇంటిలోనో, బడి లోనో కలిపి తిరిగేవారు. ఒక్కొక్కరోజు భోజనంకూడా ఎక్కడో దగ్గర కలిసే చేసేవారు. తల్లి తన కేదిపెట్టినా విస్సుకో అని అడిగి దెబ్బలాడి మరీ పుచ్చుకొనేది శారద. సావిత్రమ్మ విస్సు అడగ కుండానే ఇది నీకు, ఇది శారుకి అంటూ రెండువంతులుచేసి కొడుకు చేతిలో పెట్టేది.

చాలాసార్లు రాత్రిపూట శారద పక్కలో కథలు వింటూ అలాగే నిద్రపోయేవాడు విస్సు. ఆ వెనక ఎప్పుడో సావిత్రమ్మ వచ్చి కొడుకుని ఎత్తుకొని ఇంటికి తీసుకుపోయేది. మధ్య దారిలో కాని విస్సుకి తెలివివస్తే—"నేను శారదదగ్గరే పడుకొంటాను" అని రాగం అందుకొనేవాడు. వీ రిద్దరిమధ్య స్నేహాన్ని, ఆత్మీయతని చూసి, "వీళ్ళిద్దరూ కిందటిజన్మలో అక్కా, తమ్ముళ్ళు అయి ఉంటారు. లేకపోతే ఒకరికోసం ఇంకొకరు ఇంతలా పడి చావరు" అనేవారు.

విశ్వంకన్న శారదే పదినెల్లో, ఏడాదో చిన్నదై ఉంటే మొగు డూ, పెళ్ళాం అని ఉండేవారేమో? వయసులూ తిరగబడ్డంచేత ఆ వరస నప్పిరాలేదు. అక్కా, తమ్ముడూ వావిపెట్టినా చివరిరోజుల్లో వీరిస్నేహంపట్ల ఊర్లో గుసగుసలు బయలుదేరకపోలేదు. "ఓ తల్లి కడుపున పుట్టినవారా....ఓ ఇంట పెరిగినవారా....మరీ ఎంత స్నేహం

అయినా అంతలా రాసుకు పూసుకు తిరగడం ఏమిటి ?'' అంటూ అమ్మలక్కలు దీర్ఘాలు తియ్యకపోలేదు. కాని, శారద అత్తగారి ఇంటికి, విశ్వం బాబాయిగారి ఇంటికి కాలేజీ చదువులకి వెళ్ళిపోవడంతో ఆ పుకార్లు భూమిలోకి వేళ్ళుదిగి చిగుళ్ళు పెట్టకుండానే ఆగిపోయేయి.

''విస్సు ఊరికేళ్ళేడని తెలుసమ్మా. బాబాయికి ఒంట్లో బాగు లేదని విన్నాను. ఓసారిపోయి చూసివద్దామని'' అంది శారద.

''ఒక గడియ పోనీ, నేనూ వస్తాను. ఇద్దరం కలిసివెళదాం'' అంది అన్నపూర్ణ.

అనుమానంగా తల్లివంక చూపింది శారద, తల్లికి ఇరుగింటికి పొరుగింటికి పెత్తనానికి వెళ్ళే అలవాటు అంతగా లేదు. అందునా సావిత్రి పిన్నితో ఆపాటి పొత్తుకూడా లేదు. ఎందువల్లో ఈ సమయంలో తను వాళ్ళింటికి వెళ్ళడం తల్లికి ఇష్టంలేదు. అందుకే ఇలా అడ్డుపుల్లలు వేస్తున్నాది—అనుకొంది.

ఎందుకో అన్న శారద అనుమానం అట్టేసేపు నిలవ నక్కర లేకుండానే తేలిపోయింది. వారంనాడు వచ్చివెళ్ళిన అనంతరాముడు గుమ్మంలో ప్రత్యక్షమయేడు. అతడితోపాటు ఇంకో కుందనాల శాస్త్రులు కూడా.

శాస్త్రులుగారిది భారీ విగ్రహం. అన్నపూర్ణ ఎదురువచ్చి వీథి తలుపు రెండోరెక్క తీసేవరకు లోపల కాలు పెట్టలేకపోయేడు. మనిషి ఫరవాలేదు. నదురైన ముఖమే. పొందూరు ఖద్దరు పంచ గోచీపోసి కట్టుకొన్నాడు. పొడుగుచేతులకంటె మెడ లాల్చీమీద ఖద్దరువాణీ అత్తాకోడలు అంచుది జరీ బాగా పైకి కనిపించేలా మడత పెట్టి వేసుకొన్నాడు. కాళ్ళకి తొడుక్కొన్న చెప్పులు కొత్తవి. అక్కడ తమ ఉనికి నలుగురూ గుర్తించాలనే తాపత్రయంతో అడుగు తీసి అడుగు వేసినప్పుడల్లా కిర్రుకిర్రుమని సంగీతం పాడుతున్నాయి. నుదుటిమీద ఉదయం భోజనసమయానికి ముందు పెట్టుకొన్న గంధాక్షతలు చెమటకి కరిగి, చెరిగిపోగా మిగిలింది బొల్లిమచ్చలా కనిపిస్తు

న్నాది. తల వెనకగా పలచని క్రాపింగు మధ్యనే ఒక చిన్న పిలక, దానిలో ఒక వాడిన వాడాంబరం పువ్వు.

''రండి, రండి'' అంటూ తలుపుతీస్తూ ఆదరంగా ఆహ్వానించింది అన్నపూర్ణ.

'ఎవరీయన?' అన్నట్లు చూసేడు రామస్వామి.

నే చెపుతాగా—అన్నట్లు భర్తకి కనుసంజ్ఞచేసి, అతిథులకి కాఫీ తేవడానికి లోపలికి వెళ్ళింది అన్నపూర్ణ.

"ఇదిగో, ఈ పిల్లే శారద. వీరి మూడో అమ్మాయి" అన్నాడు అనంతరాముడు.

అతడికి తన్ను పరిచయం చేయడం ఎందు కవసరం అయింది అని అనుమానంగా చూస్తూనే మర్యాదగా ఉండదని "నమస్కారమండి'' అంది.

అతడు దానిని గుర్తించో, గుర్తించకో పట్టించుకోనట్లు ఆ ఏడు తమ ఊర్లో పంటలు, ఫలసాయాలగురించి రామస్వామితో మాట్లాడ్డం మొదలుపెట్టేడు. ఇంక అక్కడ ఉండడం ఇష్టంలేక శారద లోపలికి వచ్చింది.

''ఇదిగో, ఈ కాఫీ వాళ్ళకి ఇచ్చిరా. నేను పొయ్యిమీద బియ్యం కడిగి పడేసివస్తాను'' అంది అన్నపూర్ణ.

శారదకి తిరిగి ఆ చావిట్లోకి వెళ్ళడం ఇష్టంలేదు వాళ్ళకి కాఫీలు అందించడం అసలే ఇష్టంలేదు. "ఆ బియ్యం పడెయ్యడం ఏదో నేనే చూస్తాను, నువ్వే ఇచ్చిరా'' అంది.

కూతురివంక ఒక్కసారి తీక్ష్ణంగా చూసి, కాఫీగ్లాసులు పట్టుకొని సావిట్లోకి వెళ్ళింది అన్నపూర్ణ.

ఆ వెనకకూడా శారద చావిట్లోకి వెళ్ళలేదు. బియ్యం కడిగి పొయ్యిమీద పడేసి, పెరట్లో మొక్కలకి నూతిలోంచి నీళ్ళు తోడి పోస్తూ అక్కడే ఉండిపోయింది. అలా కొంతసేపు గడిచేక ఆ వచ్చిన వాళ్ళిద్దరూ వెళ్ళిపోయేరని నిర్ధారించుకొన్నాక అప్పుడు లోపలికి వచ్చింది.

''డబ్బుండగానే సరా....ఈడూ జోడూ చూడద్దూ? నాకేం నచ్చలేదు'' అంటున్నాడు తండ్రి.

''మీ కేదీ నచ్చదు. అసలు కూతురికి పెళ్ళిచేసి అత్తారింటికి పంపాలనే అభిప్రాయం మీకుంటేగా....దానిచేత ఉద్యోగంచేయించి, ఆ సొమ్ముతో అప్పులు, సప్పులు తీర్చుకొని బాగుపడా లనుకొంటు న్నారు.'' అక్కసుగా అంటున్నాది తల్లి.

''ఏమిటి సంగతి?'' ఇంక అడక్కుండా ఉండలేకపోయింది శారద.

"ఈ వచ్చినాయన నీకు నచ్చేడా?" నచ్చదులే, నాకు తెలుసు-అన్నట్లు ముఖం పెట్టి అడిగేడు రామస్వామి.

''నాకు నచ్చడం దేనికిట?''

"దేనికేమిటి—పెళ్ళి చేసుకోవడానికి.'' విసురుగా అంది తల్లి.

కథ మళ్ళీ మొదటి కొచ్చిందన్నమాట. క్షణంసేపు ఆగి, ''పెళ్ళివిషయంలో నా అభిప్రాయం ఏమిటో ఇదివరకే చెప్పేను కదమ్మా? మళ్ళా ఇదేమిటి?'' అంది నెమ్మదిగా.

''ఆఁ, చెపుతావు....చెపుతావు, చెప్పవూ? ఆ పట్నంలో అడ్డ మైనవాళ్ళతో తిరగడం మరిగి ఎన్నయినా చెపుతావు. తల్లీ, తండ్రీ అంటూ ఇంకా బ్రతికిఉన్నాక ఆడపిల్లకి పెళ్ళిచెయ్యకుండా అలా రోడ్డుమీద వదిలిపెడితే మా ముఖాన పేడనీళ్ళు జల్లుతారు లోకులు.'' ఆవేశంతో అంది అన్నపూర్ణ.

''మీరు తగినసంబంధం చూసి పెళ్ళిచేసి అత్తారింటికి పంపిస్తా మంటే నే వద్దనడం లేదమ్మా. నిజానికి చదివి పొట్టకూటికి ఉద్యోగం చేస్తున్న ఆడది, పెళ్ళిచేసుకొని ఇల్లు గడుపుకొంటున్న ఆడదానికంటే ఏం సుఖపడిపోవడం లేదు. ఇక్కడ తాళికట్టిన వాడిమాటకి 'జీ హుకుం' అనాలంటే, అక్కడ పదిమంది చేతికింద 'జీ హుకుం' అని సలాములుచేస్తూ పడిఉండాలి. కాని, మీరు ఇలా మీ చేతులు కడుక్కోవడానికి ఎవడికో ఒకడికి కటిపెటి బాధేత తీరుకుంటా

మంటేమాత్రం నేను చచ్చినా పెళ్ళికి ఒప్పుకోను.'' శారదకూడా ఆవేశంగానే జవాబు చెప్పింది.

తల్లి మాటలకి మరి ఎన్నిటికి తలవంచినా, పెళ్ళివిషయంలో మాత్రం దిగి రాకూడదనుకొంది శారద. అమ్మా, నాన్నలు చేసిన అక్కల పెళ్ళిళ్ళు చూసింది. తనకి పెళ్ళంటూ వాళ్ళు చెయ్యగలిగితే అంతకన్న నాసిరకం సంబంధమే వస్తుంది అనడంలో సందేహం లేదు. పెద్దబావ విలువ ఆ రోజుల్లో మూడువేలు. చిన్నబావ ఖరీదు అన్నీ కలుపుకొని అయిదువేలకిపై నే దాటింది. అయినా అక్కల బ్రతుకులు అలా ఉన్నాయి.

వాళ్ళు అప్పట్లో కళ్ళు మూసుకొని ఎదుట ఉన్నది నుయ్యో, గొయ్యో చూసుకోకుండా దూకేసేరు. ఇప్పుడు ఇంక వాళ్ళకి బయట పడేమార్గం లేదు. తల్లి తృప్తికోసం, తండ్రి పరువు ప్రతిష్ఠలకోసం, ఇంటి గౌరవంకోసం తనంత బుద్ధితక్కువపని చెయ్యలేదు. తనకి పెళ్ళి కాకపోయినా సరే, జీవితాంతం కన్యగా ఉండిపోవలసి వచ్చినా సరే ఇటువంటి వరులచేత పెళ్ళిపేరున మెడలో తాళి కట్టించుకొని, ఆ పసుపుతాడునే ఉరితాడుగా మార్చుకొని ఆత్మహత్య చేసుకోలేదు.

శారద తన ఆలోచనల్లో ఉండగానే పెళ్ళికొడుకుని సాగనంప డానికి వెళ్ళిన అనంతరాముడు తిరిగి వచ్చేడు.

''అతడికి పిల్ల నచ్చిందట. పెళ్ళికి రెండువైపుల ఖర్చులు తనే పెట్టుకొంటాడట, పైగా పిల్లకి పాతికతులాల బంగారం, నాలుగు పట్టుచీరలు....మరి నీ కూతు రేమంటున్నాది, అన్నపూర్ణా?'' అన్నాడు.

అన్నపూర్ణ ఏమీ మాట్లాడలేదు. భర్తవంక, కూతురివంక చురచుర చూసింది.

అయేందుకు బసవయ్యశాస్త్రికి—అది అప్పుడు వచ్చివెళ్ళిన పెళ్ళికొడుకు పేరు-ఏభై ఏళ్ళు పైబడ్డా కాయశరీరం కావడాన అంత వయసున్నవాడిలా కనిపించేడు. వాళ్ళ ఊరివాళ్ళదృష్టిలో బసవయ్య గారు బంగారు పిచుక. వాళ్ళింట్లో ఏ గదిలో చూసినా వెండి, బంగా

రాలు తళతళ మెరుస్తుంటాయి. ఏభై ఎకరాల సుక్షేత్రమైన మాగాణీ పొలం, ఏడంకణాల ఇల్లు, ఇవికాక పట్నంలో ఇంకో డాబా ఇల్లు, బట్టల కొట్టు—ఆ బట్టల వ్యాపారం అతడి రెండో బావమరిది చూస్తూం టాడు. అతడు అపర ధర్మరాజులాంటివాడు. నెలనెలా అణా పైస లతోసహా లెక్కలుచెప్పి, ఆ సొమ్మంతా తెచ్చి ఈ బావగారిచేతిలో పోస్తుంటాడు.

బసవయ్యకి ఇంతకిపూర్వం రెండు పెళ్ళిళ్ళు అయేయి. మొదటి పెళ్ళానికి ముగ్గురు ఆడపిల్లలు. రెండో సంబంధానికి ఒక కొడుకు, ఒక కూతురు. మొదటి పెళ్ళాం పిల్లలందరికీ పెళ్ళిళ్ళుఅయి, అత్తవారిళ్ళలో ఉన్నారు. పెద్దకూతురికి ఇద్దరు పిల్లలు. నాలుగో కూతురికి పెళ్ళిప్రయత్నాల్లో సంబంధాలకోసం బసవయ్య వెతుకు తుంటే, అన్నపూర్ణమ్మగారి సంబంధంగురించి అనంతరాముడు అతడి చెవిలో చల్లగా ఒకమాట జారవేసేడు.

"ఏదో నామీద అభిమానంకొద్దీ అంటున్నావు కాని, ఇప్పుడు నాకు పెళ్ళేమిటయ్యా, అనంతరాముడూ ? రెండో పెళ్ళాం ఇంకా బ్రతికుండేరోజుల్లోనే శరీరంలో కోర్కె చచ్చిపోయింది. ఏదో అది ఏడుస్తుంది కదా అని అప్పటప్పట గదిలోకి వెళ్ళేవాడిని'' అంటూ కాస్తసేపు తన వానప్రస్థ జీవితంగురించి వివరాలు చెప్పి, "ఇప్పుడు నీ మాటమీద నమ్మకముంచి పెళ్ళికి మొగ్గుతున్నాను అంటే దేవ పితృకార్యాలు సక్రమంగా జరుగుతాయనే ఆశ తప్పితే ఇంకేం లేదనుకో'' అన్నాట్ట. అనంతరాముడు అతడి సత్కార్మనిరతిని, వైరాగ్యబుద్ధిని, మతాభినివేశాన్ని మరీ మరీ వర్ణించి చెప్పసాగేడు.

అలా కొంతసేపు మాట్లాడేక తన మాటలు అక్కడ ఉన్న ముగ్గురిలో ఒకరూ వినడంలేదని తెలుసుకొని, "మళ్ళీ రేపొస్తాను'' అంటూ వెళ్ళిపోయేడు.

ఆ రాత్రి భోజనాలదగ్గర కూతుర్ని శాంతంగా ప్రశ్నించింది అన్నపూర్ణ—"ఏ మాట అనుకొందుకు రేపు మంచిది. అతడికి ఏదో ఒకటి చెప్పాలి. ఏమంటావు ?'' అంటూ

శారద తింటున్న అన్నం మీంచి తల ఎత్తకుండానే ఏదో అతి సాధారణవిషయం చెబుతున్నట్లు—"ఇంకో సంబంధంకూడా సిద్ధం చేసుకొని మరీ పెళ్ళికి తరలిరమ్మను" అంది.

కూతురు అన్నమాటలు అన్నపూర్ణకి అర్థం కాలేదు. "అదేమిటి!" అంది తెల్లబోతూ.

"భార్య పోయిన పన్నెండు రోజులలోపున అయితే మళ్ళా పెళ్ళికి ముహూర్తాలూ అవీ చూడక్కర్లేదని ఏదో అంటారు కదూ? పాపం! అతడి దేవ పితృకార్యాలకి మళ్ళా ఆటంకం రాకుండా...."

"శారదా" అంది కోపంతో అన్నపూర్ణ.

తింటున్న కంచాన్ని విసురుగా ముందుకితోసి లేచిపోయింది శారద,

"ఏడాదిపాటు అక్కడ ఉండి వచ్చేసరికి దీనికీ వాళ్ళింటి గాలి పట్టింది. లేకపోతే ముందు ఎప్పుడైనా ఇలా ఎదురుతిరిగి సమాధానం చెప్పేదా?" అంది అన్నపూర్ణ కోపంగా.

ఒక గదిలో బంధించి కర్రెత్తి కొట్టబోతే సాధుజంతువు పిల్లి వంటిది ఎదురుతిరిగి గుడ్లు పీకేస్తుంది. కూతురి ఆ విధమైన తెగింపు ఎటూ తప్పుకొనేమార్గం కానరాక అటువంటి కంగారులోంచి పుట్టుకొచ్చిన ధైర్యమే అని గ్రహించేడు రామస్వామి.

"ఇది పెద్దవాళ్ళిద్దరిలా కాదు. మొదటినుండి మొండిఘటమే" అని అన్నపూర్ణ ఆరాటానికి ఆ జవాబు చాలన్నట్లు అక్కడినుంచి లేచిపోయేడు.

తల్లి అన్నమాటలో కొంత నిజం లేకపోలేదనిపించింది శారదకి. కూపస్థమండూకంలా ఈ ఊళ్ళో, ఈ ఇంట్లో ఉంటున్నంత కాలం ఇంతే లోకమని, దీనిలో పడి బ్రతికినన్నాళ్ళు బ్రతికి ఏదోనాడు చావడమే తనలాంటివారికి మిగిలిఉన్న మార్గమని అనుకొనేది. కాని, అత్తగారి ఇంటిజీవితం, అక్కడికి వచ్చిపోయే మనుషుల్ని చూసేక, ముఖ్యంగా అనిల్ బెనర్జీతో పరిచయం ఏర్పడ్డాక, రాజేందర్‌సింగ్

మాటలు ఆకళింపు।చేసుకొన్నాక....ఇంతేకాదు, ప్రపంచం మంచో, చెడో ఇంకా చాలా ఉంది—అని తెలుసుకొంది.

ఆ ప్రపంచం ఈనాడు తనవంటివారికి వాసయోగ్యంగా లేని మాట నిజమే. ఆ జీవితం తనవంటివారికి అందుబాటులో లేనిమాట వాస్తవమే. కాని, ఏదోనాటికి తనకి నచ్చిన జీవితాన్ని, మనసుకి వచ్చే రీతిలో నడువగలిగేమార్గాన్ని తను ఎన్నుకోగలిగే అవకాశం లేకపో లేదు. ఆ మంచిరోజు వచ్చేవరకు—అది నెలలైనా, సంవత్సరాలైనా, యుగాలైనా సరే—నిరీక్షించక తప్పదు. ఈ రోజు తొందరపడితే, ఓరిమి పోగొట్టుకొంటే 'రేపు' అందించే అదృష్టాన్ని చేచేతులా జారవిడుచుకొన్నట్లు అవుతుంది.

శారద తన ఆలోచనల్లో అలా కొట్టుకుపోయింది. అమ్మా, నాన్నా ఆ సంబంధంవిషయంలో ఏ నిర్ధారణకి వచ్చేరో ఆమెకి పట్టనే లేదు.

# 5

"ఈ ఇల్లులాగే ఉంది. రిక్షా ఆపు. కనుక్కొస్తాను" అంది శారద.

ఇంటిముందు అరుగుమీద ఒక విధవావిడ దొండకాయలు ఎంచుతున్నాది. కాయలన్నీ మరీ అంతలా కిందా మీదా చెయ్యవద్దని కూరలమ్మి గోల పెడుతున్నాది.

ఆవిడ కూరలమ్మితో వాదులాడుతుంటే ఏడెనిమిదేళ్ళ పిల్లడు-ఆవిడ మనుమడు కాబోలు—సన్నసన్నగా ఆవిడ కొంగువిప్పి పది పైసలనాణెం ఒకటి జేబులో వేసుకొన్నాడు. మళ్ళా నెమ్మదిగా కొంగు ముడివేసి సన్నగా జారుకొన్నాడు.

మామ్మగారి కూరల ఎంపకం పూర్తయింది. "చిల్లరడబ్బులు లేవు, రేపు రావే" అంటూ కూరలసజ్జ పట్టుకొని లేచింది.

చిల్లరడబ్బులు ఉన్నా వెంటనే ఇయ్యకుండా అరువు పెడుతూ తన ఇంటిచుట్టూ పదిమందిని తిప్పుకోవడం అంటే మామ్మగారికి అదో సరదా. ఎవరైనా వెంటనే డబ్బులు అడిగితే—"వెధవలకి ఇలా వస్తువు తియ్యగానే అలా చేతిలో డబ్బులు పడేయాలి. స్వంత ఇల్లూ, వాకిలీ ఉన్నవాళ్ళం—వీళ్ళడబ్బులు పట్టుకు పారిపోతామా" అంటూ సాధిస్తుంది.

కూరలమ్మి వినీ వినపడకుండా నోట్లో ఏదో గొణుక్కొంటూ తట్ట తలమీదికి ఎత్తుకు వెళ్ళిపోయింది. ముసలావిడ వెనుతిరిగి ఇంట్లోకి వెళ్ళబోతూంటే—"మామ్మగారూ" అంటూ మెల్లగా పిలిచింది శారద.

అటునుంచి ఇటు తిరిగి ఏం కావాలి అన్నట్లు చూసింది ఆవిడ.

"గోపాలకృష్ణ మాస్టారుగారి ఇల్లు ఇదేనాండి?'' కింది మెట్టు మీద కాలుపెడుతూ అడిగింది శారద.

"ఆఁ ఇదే....ఉన్నవాళ్ళు చాలక నువ్వొకత్తెవు కొత్తగా దిగబడ్డావా, తల్లీ!'' అంది ఆవిడ ఈసడింపుగా.

ఆవిడ ఇల్లుగలావిడ అయి ఉంటుంది. అద్దెకున్నవాళ్ళకి చుట్టాలు, పక్కాలు రావడం ఈవిడికి ఇష్టంలేదులా ఉంది. అందుకే అలా విసుక్కొంటున్నా దనుకొంది శారద.

శారద మాట్లాడకపోవడం చూసి తన అంచనా సరి అయినదే అనుకొంది ఆ ముసలావిడ.

"ఏం చదువుతున్నావు? ప్రైవేటుకేనా? ఈడొచ్చిన పిల్లవి కదా ఎవడినో ఒకడినిచూపి ముడిపెట్టి అత్తారింటికి అంపకం పెట్టక, అడ్డమైన వాళ్ళవెంట ఇలా తిరగమని నీకు అచ్చుపోసి వదిలేశారా మీ అమ్మా నాన్నా, చిట్టితల్లీ....అయినా మిమ్మల్ని అని ఏం లాభం?.... ఆడాళ్ళకి, మగాళ్ళకి ఈ కాలేజీ చదువులు వచ్చి ఇలా తగలడుతున్నారు....మా చిన్నతనంలో అయితే....''

ఆవిడ చిన్నతనపు ముచ్చట్లు వినే ఓపిక శారదకి లేదు. అందుకే ఆ ప్రవాహానికి అడ్డకట్ట వేస్తూ, "ప్రైవేటుకి కాదండీ....ఆయన మా బావగారు'' అంది.

"ఏమిటీ, నువ్వు అనసూయ చెల్లెలివా? మరి ఆమాట చెప్పవేం?''

అనసూయ చెల్లెలు అనగానే తనకేదో ఆత్మబంధువు అన్నంత ఆప్యాయత చూపుతూ అంది ఆవిడ.

ఆవిడ భుజంమీదుగా వేలాడుతున్న పైటకొంగుని అటునుంచి తిప్పి ఇటుగా వేసుకొంటూ, శారదతో ఏమో చెప్పాలన్నట్లు ఇటు అటు పరీక్షగాచూపి దగ్గరికి రాబోతూంటే మనుమడు వేసిన కొంగు ముడి తిన్నగా పడక అది కాస్తా విడిపోయి, అందులో ఉన్న చిల్లర అంతా అరుగునిండా చిమ్ముకుపోయింది. "అయ్యో....అయ్యో"

అంటూ ఆవిడ ఆ డబ్బులు ఏరుకోవడంపనిలో ఉండగా శారద రిక్షా వాడికి కూలిఇచ్చి, పెట్టె చేతిలోకి తీసుకొని లోపలికి నడిచింది.

మధ్యను నడివాకిలి, ఇటు అటు గదులు అన్నతీరులో ఉంది ఇల్లు. ఎటు వెళ్ళనా అన్నట్లు శారద అక్కడ నిలబడి చూస్తుంటే పక్కవరండాలో గోపాలకృష్ణ కనిపించేడు. వాలుకుర్చీలో పడుకొని ఏదో పేపరు చూస్తున్నాడు. నిజానికి అప్పుడు అతడు చూస్తున్నది పేపరు కాదు. ఆ పేపరును ముఖానికి చాటుపెట్టుకొని పక్కఇంటి డాబామీద బట్టలు ఆరవేస్తున్న అమ్మాయిని చూస్తున్నాడు.

ఆ అమ్మాయికి పదిహేనో, పదహారో ఏళ్ళుంటాయి. అతడు అలా కళ్ళింతింత చేసుకొని తన్ను చూస్తున్నట్లు ఆపిల్ల గుర్తించి నట్లు లేదు సన్నగా ఏదో కూనిరాగం తీస్తూ రెండుచేతులూ పైకెత్తి ఆరవేసిన బట్టలు గాలికి ఎగిరిపోకుండా క్లిప్పులు తగిలిస్తున్నాది.

శారద అక్కడికివచ్చి నాలుగుబారలదూరంలో నిలిచినా గోపాలకృష్ణ గుర్తించలేదు. పక్క డాబామీద తిరుగాడుతున్న పిల్ల మీదే ఉంది అతనిదృష్టి అంతా. అతడి కళ్ళు కాంక్షతో ఎర్రగా మెరుస్తున్నాయి. ఉండి ఉండి పెదవులు తడిచేసుకొంటున్నాడు.

"బావగారు ఈ లోకంలో లేనట్లుంది. ఇంటికి చుట్టాలువస్తే ఎదురొచ్చి పలకరించడం పోయింది. దగ్గరికొచ్చి నిలిచినా చూపు తిరగడంలేదు'' అంది శారద, అతడిముఖంలో మారే రంగుల్ని ఓ కంట కనిపెడుతూ.

"ఓ....ఎవరు....శారదా! నువ్వా....నువ్వా? ఎప్పుడొచ్చేవు?'' అంటూ కంగారుగా కుర్చీలోంచి లేవబోయేడు.

"రావడం ఎప్పుడు వస్తేనేం—మీరు చూడ్డం ఇప్పుడే జరిగింది కాబట్టి ఇప్పుడే వచ్చేనంటే మీకూ, నాకూ తంటా లేకుండా పోతుంది."

"వేసవికాలం పొద్దుచూడు. అలా పేపరుపట్టుకొని కుర్చీలో పడుకొంటే చిన్న కునుకు పట్టేసింది.'' ఒకవేళ శారదకాని తనని

పిలిచిఉంటే, తను పలక్కపోవడానికి అదే కారణం అన్నట్లు చెప్పేడు గోపాలకృష్ణ.

"అక్కయ్య ఇంట్లో లేదా?" శారద మాట మార్చింది.

"లేక ఎక్కడికి వెళుతుంది? తెల్లవారి లేచింది మొదలు దానికి ఆ వంటిల్లువదిలి రా బుద్ధికాదు. అందులోంచి తనుకాని కాలు బయట పెడితే అది కాస్తా ఇంకెవరైనా ఆక్రమించేసుకొంటారేమోని దానికి భయం" అని ఒక నవ్వునవ్వి, "ఇదిగో....అనసూయా! నిన్నే.... ఎవరొచ్చేరో చూసేవా?" అంటూ పెరటిచివరికి వినిపించేలా ఒక కేక పెట్టేడు.

భర్త కేకవిని, వచ్చింది ఎవరా అని తడిచేతులు పైటకొంగుకి తుడుచుకొంటూ బయటికి వచ్చింది అనసూయ.

ఎదురుగా శారద.

తనకళ్ళని తనే నమ్మలేకపోయింది అనసూయ. ఈ ఏడాదిలో శారద ఎంత పెద్దదైపోయింది! ఎంతలా మారిపోయింది! ముఖం పోలికనుబట్టి కాని, లేకుంటే ఎదురుగా నిలిచిఉన్న ఈ పిల్ల తన చిన్నారి చెల్లెలు శారదే అని తను పోల్చుకోలేకపోవును. కట్టు, బొట్టు ....మనిషి ఎంతగా మారిపోయింది!

"శారదా....నువ్వటే!" అమాంతంగా వచ్చి చెల్లెల్ని ఆత్రం, ఆపేక్ష పొంగులువారగా కౌగిలించుకొంది.

"అక్కా" అంటూ చిన్నపిల్లలా ఆమెచేతుల్లో వాలిపోయింది శారద.

అనసూయ అక్కకి తనంటే అభిమానం అన్నసంగతి శారదకి తెలుసు. అది ఎంత పరిధిలోఉందో శారద ఈనాడు అర్థం చేసుకొంది.

తన నడ్డిని చుట్టిన ఆమె చేతులు చెపుతున్నాయి ఆ అభిమానపు లోతుల్ని. అతి దగ్గరగా స్పందిస్తున్న ఆ గుండె చెపుతున్నాది ఆ మమత విలువని.

కొన్ని నిమిషాలపాటు పక్కన ఇంకోవ్యక్తి ఉన్నాడన్న

ఆ ఆవేశపు పొంగు తగ్గి అక్కచెల్లెళ్ళు ఇద్దరూ వేరుపడేసరికి. ఇద్దరి కళ్ళల్లోనూ నిండుగా నీళ్ళు నిలిచిఉన్నాయి.

"ఇలా వస్తున్నట్లు ఒక ఉత్తరం ముక్కరాసి పడేయలేక పోయావుటే" అంది అనసూయ, పైటకొంగుతో కళ్ళు ఒత్తుకొంటూ.

"ముందు అనుకోకుండా అప్పటికప్పుడు బుద్ధిపుట్టి వచ్చేసేనే" అంది శారద.

"ఇల్లు సులువుగా దొరికిందా?"

"ఓస్! ఇంత మహాపట్నంలో మీ ఇల్లు కనుక్కోవడం అదో కష్టమా? అందునా బావగారిఖ్యాతి వాడవాడలా వ్యాపించి ఉండగా!" గోపాలకృష్ణవైపు చూస్తూ నవ్వుతూ అంది శారద.

"కాలేజీలో చేరేవుట?" మాట మార్చాలని అన్నాడు గోపాల కృష్ణ.

"చేరడమే కాదు, బావగారూ....పరీక్షకూడా పాసయేను."

"అవునుట, నాన్న రాసేరు,"

"నీ రూపు, నీ అలంకరణ మారింది కాని, మాటలుమాత్రం ఎప్పటిలాగే ఉన్నాయి."

"అందుకే అంటారు-పుట్టుకతో వచ్చినబుద్ధి పుడకలతో కాని పోదని. కొందరికి మధ్యలో వచ్చిన మాయదారి బుద్ధులుకూడా అంత సులువుగా పోవనుకోండి....అది వేరేసంగతి."

పుచ్చకాయల దొంగ అంటే భుజాలు తడుముకొన్నట్లు పక్కింటి డాబావైపు చూసేడు గోపాలకృష్ణ.

శారదని అలా మాటలకి వదిలిపెడితే ఏం వాగిపోతుందో, దానితో భర్తకి ఎక్కడ కోపం ముంచుకొస్తుందో అని భయపడుతూ, చెల్లెల్ని అక్కడినుంచి లేవదియ్యడానికి—"లేవే, శారదా! పెరట్లో కాగులో నీళ్ళున్నాయి. స్నానంచేసి రా, వంటయిపోయింది. నీకు మీ బావగారికి పెట్టేస్తాను" అంది.

"నే స్నానం చేసివస్తాకాని, ముందుగా బావగారికి పెట్టేయి. మనిద్దరం కలిపి తిందాం" అంది శారద. పెట్టెలోంచి తువ్వాలు తీసుకొని పెరట్లోకి వెళుతూ.

"నాకూ తొందరలేదు. శారద స్నానంచేసి రానీ, ముగ్గురం కలిసే తిందాం" అన్నాడు గోపాలకృష్ణ, అంతకుపూర్వం జారవిడిచిన పేపర్ని మళ్ళీ చేతిలోకి తీసుకొంటూ.

పేపరైతే చేతిలోకి వచ్చింది కాని, డాబామీది అమ్మాయి మాత్రం అక్కడ లేదు. మరదలుపిల్ల వచ్చిందన్న ఉత్సాహంలో ఆ విషయమే గుర్తించలేదు గోపాలకృష్ణ.

* * *

శారద అక్కతో అన్నమాటలో అబద్ధంలేదు. అనుకోకుండానే అప్పటికప్పుడు అక్కగారి ఇంటికి ప్రయాణం పెట్టుకొంది. కారణం, ముందురోజు జరిగిన పెళ్ళిమాటల ప్రస్తావన మళ్ళీ రాకుండా అపుచెయ్యడానికి. తల్లికాని అత్తగారింటికి పంపనంటే, చిన్నక్కగారి ఇంట ఉండి చదువుకోవడానికి అవకాశం ఉంటుందేమో తెలుసుకోవడానికి. అంతేకాక సెలవులు ఇంకా నెలరోజులకిపైగా ఉన్నాయి. ఈ కాస్తకాలం తల్లి ఎదురుగా లేకుండా గడిచిపోతే ఇటువంటి ఇరకాటాల్లోంచి బయటపడి, పైన రెండు, మూడేళ్ళు చదువుమిషతో నెట్టుకు రావచ్చు. ఓ డిగ్రీ అంటూ చేతిలోపడితే, అదృష్టం కలిసొచ్చి చిన్నదో, పెద్దదో ఒక నౌకరీ అంటూ దొరికితే అప్పటిపరిస్థితి వేరుగా ఉంటుంది. ఇప్పుడు మొండిగా ఏదో మాట్లాడుతున్నా, ఈ స్థితిలో అవునూ, కాదూ అని ఖచ్చితంగా ఎదిర్చినిలిచే అవకాశం తనకి లేదు. ఆర్థికంగా తనభారం తల్లిదండ్రులమీద లేనినాడు ఓ మాట అన్నా, పనిచేసినా దానికి విలువ ఉంటుంది.

ఈ చదువు సాఫీగా సాగాలంటే తల్లితో దెబ్బలాటకి దిగి లాభంలేదు. ఆమె కాదంటే తండ్రి ఏమీ చెయ్యలేడు అన్నవిషయం శారదకి బాగా తెలుసు. అయేందుకు అతడు ఇంటికి యజమాని అయినా, ఆ ఇంట్లో నిజంగా చెల్లేది తల్లిమాటే అన్నవిషయంకూడా గోప్యంగా లేదు. అనసూయ పెళ్ళిఅయి అతడు ఆర్థికంగా దిగజారిన నాటినుంచి అంతకుపూర్వం ఉండే కాస్తపాటి అధికారంకూడా అతడిలోంచి దానంతట అదే జారిపోయింది. వాసు ఇల్లు విడిచిపోవడానికి తనే కారణం అనీ, ఆవిధంగా బారఃకి ఏదో అన్యాయం చేసేసనీ

అయినవి, కానివి ఊహించుకొని అతడు మానసికంగాకూడా నానాటికి దుర్బలుడు అయిపోయేడు.

అతని అనారోగ్యాన్ని, ఆర్థిక దుర్బలత్వాన్ని అన్నపూర్ణ అలుసుచేసి వాడుకోలేదు. ఇకపై భర్తమీద దేనికీ ఆధారపడి లాభం లేదని నిశ్చయించుకొంది. ఆ అభిప్రాయంతోనే శారద పెళ్ళి ప్రయత్నాలు స్వయంగా చెయ్యడానికి పూనుకొంది. దానిఫలితంగా వచ్చిందే బసవయ్యశాస్త్రి సంబంధం.

ఈ ఒక్క ఆడపిల్లకి పెళ్ళి కాస్తా అయిపోతే ఇంక మిగిలిన వాడు గోపీ. భగవంతుడు అనుగ్రహించి వాడిబుద్ధి కాస్త దారినపడితే ఏదోవిధంగా వాడిబ్రతుకు వాడు బ్రతుకుతాడు. ఇంక తమ సంగతా? ఏం తిన్నా, ఏం మానినా దినం వెళ్ళిపోతుంది.

అన్నపూర్ణ ఆలోచనలకి, శారద ఆలోచనలకి మధ్య ఉన్న ఎడం రామస్వామికి తెలుసు. ఇద్దరికిద్దరూ కార్యవాదులే. పట్టుదలలకి వస్తే తల్లీ, కూతురూ ఒక్కలాంటివారే. ఎప్పుడు ఎవరిచెయ్యి ఎలా పైకి వస్తుందా అన్నట్లు తమాషాచూస్తూ ఉండిపోయేడు తను.

ఆ రోజు అనంతరాముడు తెచ్చిన సంబంధం విషయంలో శారద తన పావుని నేర్పుగా గండాలన్నీ తప్పించుకొంటూ పంట గడిదాకా చేర్చింది. ఇంక ఒక్క పందెం మంచిది పడిందంటే అది పండిపోతుంది.

శారద వెళతానన్నది అక్కగారి ఇంటికే కాబట్టి అన్నపూర్ణ ఆ ప్రయాణానికి అడ్డు చెప్పలేదు. అనసూయకూడా శారదనిచూసి చాలారోజులయిందని ఊరికే ఇదవుతున్నాది. ఓ సారి వెళ్ళిరానీ— అనుకొంది.

"అలాగేలే. రేపు ఓ ఉత్తరం రాసిపడేయి. బావ స్టేషనుకి వస్తాడు. వాళ్ళు ఇంతకుపూర్వం ఉండే ఇల్లు మారిపోయేరుట" అంది, కూతురు ప్రయాణానికి అనుజ్ఞ ఇస్తూ అన్నపూర్ణ.

రేపు ఉత్తరం రాసి, ఇంకోనాడు వెళ్ళడం అంటే ఆ లోపున తల్లి బుర్రలో ఏ పురుగు ప్రవేశిస్తుందో అన్న అనుమానంతో వచ్చిన ఆ అవకాశాన్ని జారవిడువకుండా వెంటనే బయలుదేరింది శారద.

"ఈపాటిదానికి ఉత్తరం రాయడం ఎందుకు? ఆ ఊళ్ళో అక్కయ్యగారి ఇల్లే కనుక్కోలేకపోతానా? అందునా నీ అల్లుడు ఇలాటి అలాటి ఉద్యోగస్థుడా.... పేరుచెప్పి అడిగితే ఇల్లు తెలియక పోవడానికి" అంది, ఉత్తరం రాసి వెళ్ళమన్న తల్లి సూచనని పక్కకి పెడుతూ.

అన్నపూర్ణకి చిన్నల్లుడు చదువుకొన్నవాడని, ఉద్యోగస్థుడని అతిశయం. అందునా ఈసారి వెళ్ళివచ్చేక, ఆ పదిరోజులు అల్లుడు అత్తగారికి బాగా తైరుకొట్టి పంపేడేమో ఇంకా మురిసిపోతున్నాది.

"ఏదో అనుకొన్నాంగాని గోపాలకృష్ణ అలాంటివాడు కాడండి. మన పిల్ల మరీ బొత్తిగా పల్లెటూరి గబ్బిలాయిలా ఉంటే ఆ మాట అంటే అన్నాడేమో కాని....అతడికి అనసూయ అంటే అభిమానం, ప్రేమ లేకపోలేదు. చూసేగా ఆ పదిరోజులూ వాళ్ళింట ఉండి" అనేది.

ఈవిధమైన తల్లిమాటలు వింటుండే శారద, అక్కగారి ఇంట కాలు పెట్టేవరకు 'అవును కామోసు' అనుకొంది, కాని, ఇంటిలో తిన్నగా కాలు పెట్టీ పెట్టకముందే ఇంటావిడ మాటల్లో ఏదో అపశ్రుతి వినిపించింది. మరి నాలుగు అడుగులు వేసేసరికి బావగారి బండారం బట్టబయలు అయింది.

వారిఇంట వారం పదిరోజులు ఉండేసరికి అక్కపరిస్థితి ఏమిటో అర్థమయింది శారదకి. గోపాలకృష్ణ అన్నట్లు అనసూయ ఏ సమయం లోనూ ఆ పెరటివాస వదలిరాదు. ఇంటికి ఎవరైనావస్తే అసలే బయటికి రాదు. మరి అతడే భార్యని బయటికి రావద్దని అలా కట్టడి చేసేడో, లేక ఈవిడే తనంతట తాను ఆ వంటఇంటికి అంటుకు పోయిందో తెలియదు.

ఇంటికి ఎవరు వచ్చినా అతిథి మర్యాదలకి లోటు చెయ్యడు గోపాలకృష్ణ. వచ్చిన వ్యక్తుల్నిబట్టి, ఆ సమయాల్నిబట్టి కాఫీ టిఫిన్లో, మంచినీళ్ళో, మజ్జిగ తేటో—అవతలివాళ్ళు ఏది కావాలంటే అది

అతడు చెప్పడం, అవన్నీ సిద్ధంచేసి ఈవిడ ముందు వరండాదాకా వెళ్ళి 'ఏమండీ' అని పిలిచి అందజెయ్యడం.

ఇంటికి ఆడా మగా ఎవరు వచ్చినా భార్యని పిలిచి వారికి పరిచయం చెయ్యడం అతడికి అలవాటు లేదు. ఎవరైనా ఆ విషయం ఎత్తినా—''దానికి బోలెడంత సిగ్గు, భయం అండీ. నలుగురిలోకి బయటికి రానంటుంది'' అనేవాడు. అలా వచ్చి పోయేవారిలో చాలా వరకు కాలేజీ స్టూడెంట్లు, పేకాట జట్టుదార్లు ఉండేవారు. ఎప్పుడైనా ఇరుగు పొరుగు తెలిసినవాళ్ళు, స్నేహితులు, బంధువులు రావడం కద్దు.

తరుచు ముగ్గురు ఆడపిల్లలు కుంకుడుకాయల గుత్తిలా కలిసి వస్తుండేవారు. శారదకి వాళ్ళ ఇకఇకలు, పకపకలు, అలంకరణలు చూస్తుంటే చెట్టు చచ్చేముందు కాసే కుక్కమూతి పిందెల్లా అనిపించేవి. నాగరకత, స్వాతంత్ర్యం పేరుతో వేసే వెర్రికేకల్లా ఉండేవి వారిమాటలు. చదువుకొని, గౌరవప్రదమైన ఉపాధ్యాయవృత్తి చేస్తున్న గోపాలకృష్ణకూడా వారితో సరిగా వెకిలిపోకడలు పోవడం శారదకు వెగటు కలిగించేది.

బావకి బి.ఎ., బి,ఇడీ. చదువు బ్రతకడానికి ఉపాధి కలిగించింది కాని, బ్రతుకులో విలువల్ని నేర్పలేకపోయింది అన్న విషయం అక్కగారి ఇంట కాలుపెట్టినరోజునే తెలుసుకొంది శారద. ఇంట్లో జరుగుతున్న విషయాలేమీ పట్టించుకోకుండా వంటపూటిదానిలా ఆ పెరటివాసకి అతుక్కుపోయే అక్కని చూస్తే శారద మనసులో కోపం, జాలీకూడా కలిగేవి. ఆడవాళ్ళు వాళ్ళకి ఎవరో అన్యాయం చేస్తున్నారని గోలపెడతారు కాని నిజానికి వాళ్ళకివాళ్ళే అన్యాయం చేసుకొంటున్నారు. తమని తాము అలుసుచేసుకొని మగాడి చెప్పుకింద తేలులా పడి ఉంటున్నారు—అనుకొనేది.

''ఇంటికి ఆడా మగా ఇంతమంది వచ్చిపోతూంటే అక్కడికి పోయి కాస్తసేపు కూర్చుని సరదాగా కబుర్లు చెప్పిరాక, అస్తమానం ఈ వంటఇంటికి అతుక్కుపోయి కూర్చుంటావేం—నీకు విసుగెయ్యదూ?'' అనేది శారద అక్కతో.

శారదమాటకి చిన్నగా నవ్వి ఊరుకొనేది అనసూయ. చెల్లెలు మరీ రెట్టించి అడిగితే—"మీ బావగారితోపాటు నేనూ వచ్చిన వారి ముందు కూర్చుంటే ఇంట్లో పనులు ఎలా తెములుతాయే? ఇప్పుడంటే నువ్వు ఉన్నావు కాని—ఈ కాఫీలు, ఫలహారాలు అన్నీ నేను చూసుకో వలసిందే కదా" అనేది. లేదంటే-"వాళ్ళు ఏవో విషయాలు మాట్లాడు కుంటూంటే అవన్నీ నాకు అర్థమై చస్తాయా ఏమన్నా....ఊరికే మట్టి బొమ్మలా అక్కడ కూర్చోవడం ఏం బాగుంటుంది" అంటూ ఇంకో కారణం చెప్పేది.

"నీ మొహం. నీకర్థంకాని విషయాలేం వాళ్ళు చర్చించు కోవడంలేదు. ఏ సినిమాలో ఎవరు ఏ వేషం వేస్తున్నారు. ఏ పత్రి కలో ఏ కథ పడింది. ఏ కథలు ఆడవాళ్ళ పేరుపెట్టుకొని మగాళ్ళు రాస్తున్నారు....ఇందులో నీకు అర్థం కాకపోవడానికి, తెలియకపోవ డానికి ఏమున్నాయి! నువ్వూ చదువుతావుగా పత్రికలూ అవీ."

"చదువుతా ననుకో. అయినా...."

"ఇదిగో, అక్కా, నే నొక్కమాట చెప్పనా? కాలేజీకి వెళ్ళి నాలుగుప్రశ్నలు బట్టీపట్టి పరీక్షలు పాసయినంతమాత్రాన వాళ్ళంతా ఏదో పెద్ద చదువుకొన్నవారనీ, ఆ పరీక్షలు పాసు కాలేదు కాబట్టి నువ్వు అజ్ఞానురాలివని అనుకోనక్కరలేదు. మనిషి నేర్చినవిద్య తన జీవితాన్ని సరిఅయినమార్గంలో నడుపుకోవడానికి ఉపయోగించాలి. అప్పుడే ఆ విద్యకి గౌరవం, దానివల్ల మనిషికి విలువ పెరిగేది. అలా కానినాడు మీ వీథిగదిలో ఆ లావుపాటి ఆంగ్లో-ఇండియన్ అమ్మా యిని చూడు—అలాగే వెర్రితలలు వేస్తుంది ఆ చదువు. అసలు ఇటువంటి మేళాన్ని నీ ఇంటికి ఎందుకు చేరనిచ్చేవు? వాళ్ళకి నీ మొగుణ్ణి అప్పచెప్పి నువ్వేలా చేతులు ముడుచుకొని కూర్చున్నావు?"

"అలా గట్టిగా అరవకే, బాబూ! మీ బావగారు విన్నారంటే కోపం తెచ్చుకొంటారు. వారంతా ఆయన శిష్యురాళ్ళు....ప్రైవేటు చెప్పించుకోవడానికి వస్తుంటారు" అంది అనసూయ కంగారుగా.

"వింటే వినసీ....నా కేం భయంలేదు. కావాలంటే ఆయన ముఖంమీదే అంటాను. ఆయన ఆ గదిలోకూర్చుని చెపుతున్న పైరి వేట్లు ఏమిటో నీకుతప్ప ఊళ్ళో అందరికీ తెలుసు. నిన్ను అమాయకు రాల్నిచేసి....నిజానికి ఇందులో తప్పంతా పూర్తిగా ఆయనదే కాదులే. నువ్వు చేజేతులా చేసుకొన్నది కొంత. నీ కేం పట్టనట్లు నువ్విలా నోరుమూసుకొని తిరుగుతుంటే ఆయన ఆటలు ఆయన ఆడుతున్నాడు. ఏమిటబ్బాయీ సంగతి—అని నిలదీసి అడిగితే...."

అలా అడిగిననాడు జరిగేదేమిటో అనసూయకి తెలుసు. ఆవేశమేకాని, ఇంకా అనుభవంలేని శారదకి తెలియదు. తనకి పెళ్ళి చేసి అత్తవారి ఇంటికి పంపడానికి తలిదండ్రులు ఎన్నిబాధలు పడ్డారో, ఆర్థికంగా ఎంతగా చితికిపోయేరో అనసూయకి తెలుసు. తిరిగి ఇప్పుడు భర్తతో తగువులాడి, తెగతెంపులుచేసుకొని పుట్టిల్లు చేరితే పరిస్థితి ఎలా ఉంటుందో ఊహించగలదు.

ఆర్థికంగా తన కాళ్ళమీద తాను నిలబడగలిగే స్త్రీకి వ్యక్తిత్వం, స్వతంత్ర్యం వాటంతట అవే వస్తాయి. అది లేనినాడు ఊరికే నోటి దప్పికి అరవడమే కాని, భరించేవాడి ఇష్టప్రకారం నడవకా తప్పదు, అతడు అన్నదానికి తలవంచకా తప్పదు.

శారద పట్నంలో అత్తగారిఇంట ఉండి, కాలేజీలో చదివి నేర్చినదానికన్న, అనసూయ అత్తింట కాలుపెట్టి జీవితాన్ని ముఖా ముఖి చూసేః చాలా నేర్చింది. అందుకే తనలాంటివారికి నొప్పించక తా నొవ్వక అన్న తీరులో గడుపుకుపోవడం మినహా గత్యంతరం లేదని గ్రహించుకొంది.

శారద ఆవేశంగా అలా మాట్లాడుతుంటే—"ఏమిటి, అక్క గారికి ఏకబిగిని అంత లెక్చరిచ్చేస్తున్నావు?" అంటూ అక్కడికి వచ్చేడు గోపాలకృష్ణ

"ఊళ్ళోవాళ్ళందరికీ మీ రిస్తుంటే, ఇంట్లో మా అక్కకేనా నేను ఇయ్యకూడదా? అదృష్టం బాగుంది బి. ఎ. పూర్తి అయితే ఆ పైని ట్రెయినింగుకి వెళ్ళి, ఉపాధ్యాయవృత్తి చెయ్యాలనుకొం టున్నాను కదా?" అంది శారద.

"అబ్బో....ఏమో అనుకొన్నాను—మీ చెల్లెలు పెద్ద ప్లాను మీదే ఉందే. అనసూయా?"

అతడు అన్న ఆ మాట అందుకోవడానికి అనసూయ ఆ చుట్టు పక్కల లేదు. అతడు రంగంలోకి రాగానే సన్నగా జారుకొని, వంట ఇంట్లో భోజనప్రయత్నాలు చెయ్యడానికి వెళ్ళిపోయింది.

తను మొదట్లో ఆశించినవిధంగా అక్కగారి ఇంట ఉండి చదువుకొనే అవకాశం లేదని అక్కడికి వచ్చిన రెండు మూడు రోజుల్లోనే తెలుసుకొంది శారద. మరి వారం, పదిరోజులు ఉండి ఆ విషయం ప్రస్తావించకుండానే తిరుగుప్రయాణం కట్టింది.

"ఇంకా సెలవులు ఉన్నాయి కదుటే? మరికొన్నాళ్ళు ఉండి వెళ్ళకూడదూ?" అంది అనసూయ

"కాలేజీలో సీటూ అదీ వచ్చిందో, లేదో కాస్త ముందుగా వెళ్ళి చూసుకోవాలి. మళ్ళీ ఎప్పుడైనా వస్తాలే" అంది శారద.

"మీ చెల్లెలికి పెట్టు" అని ఒక వాయిల్‌చీర, జాకెట్టుబట్ట తెచ్చిఇచ్చేడు గోపాలకృష్ణ.

భర్త మంచితనంచూసి మురిసిపోయింది అనసూయ ఏమేమో అనుకొంటాను కాని, ఆయనకి నామీద అభిమానమే, లేకపోతే నా వారిగురించి ఇంతగా పట్టించుకొనేవారా—అని ఆపాటిదానికే మురిసిపోయింది ఆ ముద్దరాలు.

ప్రయాణం రోజున శారద తలంటి నీళ్ళుపోసుకొని, అక్క పెట్టిన కొత్తచీర కట్టుకొంది.

"పెళ్ళికూతురిలా ఉన్నావే, శారదా" అంది అనసూయ, ఆప్యాయంగా శారదని దగ్గరికి తీసుకొంటూ.

"నీకంటే చవగ్గా నేను దొరికేను కాని, ఈ నల్లరాతిబొమ్మని ఎవడు చేసుకొంటాడు?"

"కాస్త చాయ తక్కువ అన్నమాటేకాని....నా చెల్లెలికేం లోటు? ఆ ముఖం చూడండి....ఎంత కళగా ఉందో! నిజంగా దాన్ని చేసుకొన్నవాడు అదృష్టవంతుడవుతాడు."

"ఏమో, ఆ అదృష్టం నాకే రాసుందేమో!" శారదవంక చూస్తూ, పరిహాసానికి అన్నట్లు అన్నాడు గోపాలకృష్ణ.

అక్క చెల్లెళ్ళు ఇద్దరూ అతడిమాటకి తెల్లబోయి చూసేరు.

తొందరపాటువల్ల తను నోరు జారినవిషయం గ్రహించేడు గోపాలకృష్ణ.

చురుకైనవాడు కాబట్టి, అంతలోనే ఆ తప్పును కప్పుకొంటూ, "అలా తెల్లముఖాలువేసుకు చూస్తారేమే ......ఎక్కడా మొగుడు దొరక్కపోతే అక్కమొగుడే గతి అని సామెత ఉంది–వినలేదూ!" అన్నాడు.

అతడి మనసులో కుళ్ళును, కళ్ళలో కాంక్షను పరిహాసానికి అలా అన్నట్లు కనిపించాలని అతడు చేసినప్రయత్నం కప్పలేక పోయింది.

అంతకు నాలుగురోజులక్రిందట జరిగిన సంఘటన శారద మనసులో తిరిగింది.

ముందురోజు రాత్రి అనసూయ వాకిట ఉంది. ఉదయం కాఫీ, టిఫిన్లు ముగించి, ఆ పూటకి వంట ఏం చెయ్యడమో అక్క నడిగి, కావలసిన వస్తువులన్నీ దగ్గర పెట్టుకొని వంటప్రయత్నంలో పడింది శారద.

మరుగుతున్న నీళ్ళలో పప్పుపోసి, వంకాయలు తరిగి నీళ్ళలో వేస్తుంటే, పప్పుగిన్నె చిన్నది కావడం, కుంపట్లో బొగ్గులు బాగా రాజుకొని ఉండడంవల్ల ఒక్కసారిగా పొంగు వచ్చింది. చేతిలో వంకాయని నీటిలో దిగవిడిచి, కాగితాలు పట్టుకొని శారద పప్పుగిన్నె దింపబోయేసరికి, ఆమె వెనకగా వచ్చిన రెండుచేతులు ఆ గిన్నెను అంతకుపూర్వమే కిందికి దింపేయి.

త్రుళ్ళిపడి వెనుతిరిగి చూసింది శారద. ఆ పిల్ల తలకి జానెడు ఎడంలో గోపాలకృష్ణ ముఖం ఉంది. అతడికళ్ళు కుంపట్లో రాజుకొన్న నిప్పుల్లా ఎర్రగా ఉన్నాయి. అతడి చేతులు తాచుపాముల్లా ఆమెచుట్టూ ఉన్నాయి. ఆమె అలా తిరిగి చూడగానే వెలితిగా నవ్వుతూ, "హీ" అన్నాడు.

"ఏమి టీ పని?" తీక్షంగా చూస్తూ చేతుల్ని విదిలించి కొట్టింది శారద.

శారద చేసిన ఛీత్కారంతో గోపాలకృష్ణ కలవరపడ్డాడు. ఆ పిల్ల చూసిన చూపుకి అతడిగుండె గడగడ లాడింది. కాళ్ళలో కంపరం పుట్టుకొచ్చింది. పరిస్థితి అలా ఉంటుంది అని అతడు ఊహించలేదు. వయసులో ఉన్న పిల్ల. దరిదాపుల్లో పెళ్ళి అయ్యే సూచనలు లేవు. బావగారి చొరవని, సరసాన్ని అంది పుచ్చుకొంటుంది—అనుకొన్నాడు. ఆనందిస్తుంది—అనుకొన్నాడు.

శారద చూసిన చూపుతో కథ అడ్డం తిరిగిందని గ్రహించేడు. తమాషాగా పరిస్థితిని తారుమారు చెయ్యకపోతే అనవసరంగా పట్టుబడిపోతానని తెలుసుకొన్నాడు.

"కాలేజీ చదువులు చదువుతున్న మరదలుపిల్లకి వంటా పెంటా చేతకాదేమో సాయం చేద్దామని...."

"థాంక్స్ ...మీ సహాయం అవసరం ఉన్నప్పుడు పిలుస్తాను లెండి. అంతవరకు ఆ ముందుగదిలో కూర్చుని మీ పని మీరు చూసుకోండి." అతడి కళ్ళలోకి సూటిగా చూస్తూ తీక్షంగానే జవాబు చెప్పింది శారద.

అతడు అప్పటిమట్టుకు మారుమాట లేకుండా చల్లగా జారుకొన్నా. మళ్ళీ ఎప్పుడువచ్చి ఏం చేస్తాడో అన్న భయంతో కుంపటి, వంటసామాన్లు ముందు వరండాలోకి మార్చి, మిగిలిన రెండుపూటలా వంటా వార్పూ అక్కడే చేసింది శారద.

"అదేమిటే, అవన్నీ ఇక్కడికి మోసుకొస్తున్నావు?" అంది అనసూయ.

"ఆ వంటఇంట్లో తిన్నగా గాలిరాదే—రోజూ నువ్వు ఎలా వంట చేస్తున్నావో కాని" అంది శారద.

నిజానికి వంటఇంటిగోడకి పెరటివైపుగా పెద్ద కిటికీ ఉంది. దానిపక్కనే కొబ్బరిచెట్టు ఉంది. అసలు గాలంటూఉంటే, ఆ కొబ్బరి

ఉంటుంది. చెల్లెలు చెప్పకపోయినా, అంతకుపూర్వమే ఉత్సాహంగా ఈలవేసుకొంటూ మంచినీళ్ళకని వంటఇంట్లోకి వెళ్ళిన పతిదేవుడు అంతలోనే ముఖం మాడ్చుకొనివచ్చి ముంగిలా గదిలోదూరి కూర్చో వడంతో అక్కడ ఏం జరిగిఉంటుందో ఊహించుకొంది అనసూయ.

అందుకే శారద వెళ్ళిపోతానంటే పట్టుపట్టి మరి నాలుగు రోజులు ఉండమనలేకపోయింది. వయిసులో ఉన్న పిల్ల. ఎటునుంచి ఏం జరిగినా రెండువిధాలా బాధపడవలసింది తనే—అనుకొంది.

"అలాగేం ఆశపడకండి, బావగారూ. నాకు ఎక్కడా మొగుడు దొరక్కపోతే అవివాహితగా ఇలా జీవితాంతం ఉండిపోతాను కాని, ఒకసారి చేసిన పొరపాటుని మా నాన్నచేత మళ్ళీ చచ్చినా చేయించను'' అంది శారద.

శారద బస్సుదిగి ఇంటికి చేరేసరికి పన్నెండుగంట లయింది. జూన్ నెల ఎండ చిటపట లాడిస్తున్నాది. బస్సుదిగి రిక్షా ఎక్కినప్పటి నుండి ఎంత వేగిరం ఇల్లుచేరి నాలుగుచెంబుల నీళ్ళు ఒంటిమీద పోసు కొని చల్లబడుతానా అని చూస్తున్నాది.

రిక్షావాడికి కూలిడబ్బులు ఇచ్చేసి, పెట్టె చేత్తో పట్టుకొని ఇంట్లో కాలు పెట్టేసరికి—''అక్కా'' అంటూ గంతులేస్తూ ఎదురు వచ్చేడు గోపి.

''అమ్మా, నాన్నా ఏర్రా?'' అంది శారద.

''మరేం ....మరేం భూషణం బాబాయి పోయేడుట....''

శారద చేతిలోవిపెట్టె ఉన్నపాటునే జారిపోయింది.

తను ఊరికి వెళ్ళేముందు సావిత్రిపిన్నిగారి ఇంటికివెళ్ళి బాబాయిని చూసింది శారద. కడుపులో బాధ, గుండెల్లో నొప్పి అని మూలుగుతూ మంచంమీద పడిఉన్నా, ఇంతలో ఇంత ఘోరం జరిగి పోతుందని అనుకోలేకపోయింది. ఊరికి వెళ్ళిన విశ్వం తిరిగివచ్చేడో, లేదో? కడసారి చూపుకి అందుకోగలిగేడో లేదో?

"వాళ్ళ విశ్వం వచ్చేడ్రా?" వీడికేం తెలుస్తుంది అని అను కొంటూనే యథాలాపంగా అడిగింది శారద.

"నిన్నరాత్రే వచ్చేట్ట"

శారద ఇంక ఆలోచించలేకపోయింది. మరో అడుగైనా ఇంట్లోకి వెయ్యకుండా అక్కడినుంచి అలాగే వెనుదిరిగి సావిత్రి పిన్నిగారి ఇంటికి వెళ్ళింది.

అప్పటికే అన్నీ పూర్తి అయిపోయేయి. కడిగి ముగ్గువెయ్యని గుమ్మం, కొంచెంసేపటికింద అక్కడ జరిగినపనిని చెప్పకనే చెప్తున్నట్లుంది. ముందు హాల్లో అట్టేమంది మనుషులు లేరు. ఉన్నవాళ్ళయినా 'ఈ పిల్ల ఎవరు' అని శారదగురించి పట్టించుకోలేదు. శారద క్షణకాలం అక్కడ అగి ఇటు అటు చూసింది. పక్కగదిలో సావిత్రమ్మ రోదన, ఎవరిదో ఓదార్పుమాటలు వినిపిస్తున్నాయి. నెమ్మదిగా అడుగులువేస్తూ అటు వెళ్ళింది శారద. శారదని చూడగానే సావిత్రమ్మ మరోమారు గొల్లుమంది.

"చూసేవా, నా తల్లీ....మీ బాబాయి ఎంతమోసం చేసి పోయేడో! 'నిన్ను పిడికెడు బుగ్గి చేసేకే నేను కన్ను మూస్తానే' అనేవారు. పిచ్చిదాన్ని ...అవును కామోసు అనుకొని సంబరపడే దాన్ని....న న్నిలా ఒంటరిగా వదిలేసి తనదారి తను చూసుకుంటారని కలలో అయినా అనుకోలేదే, శారదా...."

శారద ఆ ఏడుపు వినలేకపోయింది. సావిత్రి పిన్నిని ఓదార్చే పాటివయసు శారదకి లేదు. ఆమె బాధని అర్థం చేసుకోగల మనసు మాత్రం ఉంది.

సావిత్రమ్మ చుట్టూ ఎందరో ఆడంగులు ఉన్నారు. నయానా, భయానా చెప్పి ఆమె నోరు మూయిస్తున్నారు. "చచ్చినవాళ్ళతో చచ్చిపోతామా? ఇద్దరూ ఒక్కసారి ఈ భూమిమీద పడ్డారా, ఒక్కసారి కట్టకట్టుకుని వెళ్ళిపోవడానికి? నువ్వుమాత్రం ఉట్టి కట్టుకొని ఊగిపోతావా....నీకు ఆ దేవుడు పిలుపువస్తే నువ్వూ వెళ్ళిపోతావు. ఉన్నంతకాలం ధైర్యంగా ఉండాలి. గుండె రాయిచేసుకొని ఆ పిల్ల

డిని చూసుకొంటూ కాలం దొర్లించాలి....అంతేకాని, నువ్వే ఇలా అయిపోతే, చిన్నపిల్లడు వాడు బెంగపెట్టుకొని ఏమైపోతాడు?'' అంటూ హితబోధలు చేస్తున్నారు. ధైర్యం చెపుతున్నారు.

శారద సావిత్రిపిన్ని ఏడుపు వినడానికి రాలేదు. ఆమెవచ్చింది విశ్వంకోసం. తండ్రిని పోగొట్టుకొని ఒంటరిగా మిగిలిపోయిన విశ్వానికి ధైర్యం చెప్పడంకోసం. అతనిబాధని పంచుకోవడంకోసం.

గదిలో ఓ మూలగా ముడుకుల్లో తల పెట్టుకొని కూర్చున్నాడు విశ్వం. ఆ రూపులో అతన్ని చూసేసరికి శారద కడుపులో కెలికినట్లయింది. నెమ్మదిగా దగ్గరికివెళ్ళి 'విస్సూ' అంది.

అతడిలో చలనం లేదు. ఆ పిలుపు విన్నట్లే లేదు.

''ఒక్కక్షణం ఊరుకొని, కొద్దిగా ముందుకివంగి, 'విస్సూ! నేను....శారదని' అంది. ఆ మాట అంటూంటే అంతవరకు కళ్ళల్లో నిలిచిఉన్న నీళ్ళు పొర్లుకొచ్చేయి. ఆ కన్నీటిబొట్లు టపటపమని విశ్వం తలపై పడ్డాయి.

ఈసారి ముఖమెత్తి చూసేడు విశ్వం. అతడికళ్ళు ఎర్రగా జ్యోతుల్లా ఉన్నాయి. పచ్చనిముఖం కమిలిపోయి పండబారిన దొండకాయలా ఉంది, తనఎదుట నిలిచిఉన్న మనిషి ఎవరో, తనని పిలిచిన కారణమేమిటో అర్థంకానట్లు అలా పిచ్చివాడిలా చూస్తూ ఉండిపోయేడు. విశ్వం ఆ రూపు, ఆ చూపు శారదకి భయం కలిగించాయి. మరొక్కక్షణంలో అతనిలో కదలిక రాకపోతే అలా బిగుసుకు పోతాడేమో అన్నంతభయం వేసింది. కంగారుగా రెండుచేతులూ పట్టుకొంటూ, ''విస్సూ, విస్సూ....నేను, శారదను....నీ శారూని, విస్సూ' అంది.

విశ్వం మనసులో పేరుకొన్న దుఃఖం భళ్ళున బద్దలయింది.

''శారూ!'' అంటూ ఆమె చేతుల్లో ముఖం దాచుకొని బావురుమన్నాడు.

శారద ఆ ఏడుపుని ఆపడానికి ప్రయత్నించలేదు. విశ్వం అలా బాధని ఏడుపురూపంలో కడిగేసుకొంటూంటే, గుండెల్లో పేరు

కొన్న అగ్నిని కన్నీటితో ఆర్పేసుకొంటూంటే ఆమె మనసు తేలిక పడింది. ఒక్క మాటా, పలుకూ లేకుండా అతని తలని ఆప్యాయంగా నిమురుతూ అలా ఉండిపోయింది. అలా ఎంతసేపు గడిచిందో! అన్నపూర్ణ కూతురిదగ్గరకువచ్చి, "ఇంక వెళదాం, వస్తావా?" అంది.

"మళ్ళా వస్తాను, విస్సూ!" శారద లేచింది.

కళ్ళెత్తి చూడకుండానే తల ఊచేడు విశ్వం.

అంతవరకు నిమ్మకు నీరెత్తినట్లు నెమ్మదిగా ఉన్న అన్నపూర్ణ, ఇంట్లో కాలు పెట్టగానే కూతురిమీద విరుచుకుపడింది—"నీ కేమైనా బుద్ధీ జ్ఞానం ఉందా?" అంటూ. "ఏమయింది?" అంది శారద తెల్లబోతూ.

తల్లికి అంతకోపం రావడానికి కారణం ఏమిటో నిజంగా శారదకి తెలిసిరాలేదు—

కూతురు త నా మాట ఎందుకందో తెలిసికూడా, తన్ని ఆటలు పట్టించడానికే అలా అమాయకత నటిస్తున్నా దనుకొంది అన్నపూర్ణ. చిరుగాలి తగిలిన మంటలా రెచ్చిపోయింది ఆమె కోపం.

"సిగ్గు లేకపోతే సరి....అంతమందిలో ఆకుర్రాడి చేతులు పట్టుకొని మతిపోయినదానిలా అలా కూర్చుని....ఇంకా ఏమయిందని అడుగుతున్నావా?"

"విస్సూ ఎవరో పైవాడు కాడు కదమ్మా. నాతో ఆడి పాడినవాడు....తండ్రి పోయినకష్టంలో ఉన్నాడు. దగ్గరికిచేరి ఓదార్పుగా రెండుమాటలు చెపితే తప్పా? మీరంతా సావిత్రిపిన్నిచుట్టూ మూగలేదూ?"

"అదీ, ఇదీ ఒకటేనా? అప్పుడంటే చిన్నపిల్లలు. కిందపడి, మీదపడి ఆడినా, పాడినా సరిపోయింది....ఇప్పుడు వయసులో ఉన్న పిల్లలు కదా....అలా పరాయి మగాడిచేతులు పట్టుకొని...."

"చేతులు పట్టుకొన్నంతమాత్రానే అపవిత్రురాలినై పోతానా? చేతులు పట్టుకోవడమేగా నేను చేసింది....అంతకుమించి మా మధ్య ఏం జరగలేదనడానికి సాక్షులుగా మీరంతా ఉండనే ఉన్నారు."

"శారదా!"

"లేకుంటే ఏమిటమ్మా నీ చాదస్తం! ఒక ఆడది, మగాడు దగ్గరగా ఉంటే ఆ సమయం, సందర్భం ఎటువంటివైనా ఇంకో ఆలోచనే రాదా మీ మనసుల్లోకి? నాకు వాసు, గోపీ ఎలా ఆత్మీయులో విస్సూ అలాగేనమ్మా. అతడు అంత కష్టంలో ఉంటే ఓదార్చకుండా ఆడపిల్లనని, అంటుకుంటే మైలపడి పోతానని తప్పుకుపోనా.... కష్టసుఖాల్లో ఒకరికొకరు ఆదుకోకపోతే ఇంక ఆ స్నేహానికి విలువేమిటమ్మా?"

"ఇటువంటి మాటలు కబుర్లకి బాగుంటాయికాని, ఆచరణకి వచ్చేసరికి ఎబ్బెట్టుగా ఉంటాయి, శారదా! అక్కడ ఉన్నవాళ్ళంతా మీ ఇద్దరివంక కళ్ళు పొడుచుకొంటూ ఎలా చూసేరో తెలుసా? వాడికేం మగాడు, ఎలా అయినా ఫరవాలేదు....ఆడపిల్లవి....కాస్త పరిస్థితి అర్థం చేసుకొని మరీ తిరుగు" అంటూ ఓ హితోపదేశంతో అప్పటిమట్టుకి శారదని విడిచిపుచ్చింది అన్నపూర్ణ.

అడుగడుక్కీ తల్లి అడ్డుపుల్లలు వేస్తున్నా, శారద వాటిని నెమ్మదిగా తప్పించుకొంటూ అడపాదడపా సావిత్రిపిన్నిగారి ఇంటికి వెళ్ళి విశ్వానికి ధైర్యంచెబుతూ, ఆమాటా ఈమాటా చెప్పి అతడికి ఓదార్పు కలిగిస్తూ ఒక స్నేహితురాలిగా తాను చెయ్యగలిగింది చేస్తుండేది.

రోజులు గడుస్తుంటే విశ్వం తండ్రిపోయిన దుఃఖంలోంచి కొద్దిగ కోలుకొన్నాడు. తల్లికి ధైర్యం చెపుతూ, ముందుసంగతి ఏమిటి—అనే ఆలోచనలో పడ్డాడు.

కొడుకు అపాటిగా కోలుకోవడంతో సావిత్రమ్మ మనసు చులకన పడింది.

"శారదా....నీ ఋణం తీర్చుకోలేనే, తల్లీ! అప్పట్లో నీడిని చూస్తే ఈపాటిగా మళ్ళా తిరుగుతా డనుకోలేదు. లేని ఆయన ఎలాగా లేరు. ఉన్న నీడుకూడా ఏమైపోతాదో అని బెంగపెట్టుకొని చచ్చే దాన్ని."

"నేనేం చేసేను, పిన్నీ....అసలు ఎవరుమాత్రం ఆ పరిస్థితిలో ఏం చెయ్యగలరు? ఆ దుఃఖం, ఆ బాధా ఒకరిమాటలవల్ల తగ్గేవా.... ఎవరికివారు దిగమింగుకోవలసిందే కాని" అంది శారద.



శారదకు కాలేజీలో సీటు వచ్చింది. దానితోపాటే మాలతి రాసిన ఉత్తరంకూడా ఉంది. పైన అడ్రసు రామస్వామికి ఉన్నా, లోపల ఉత్తరం అన్నపూర్ణ పేర రాసిందే. ఆ ఉత్తరంలో ముఖ్య విషయం శారద చదువు.

"అరవింద చెప్పింది శారదకి బి. ఏ.,కి సీటు వచ్చిందని. అనవసరపు అనుమానాలు పెట్టుకొని దాని బ్రతుకు పాడుచెయ్యక నాలు గైదురోజులకు కాలేజీలు తెఱస్తారనగానే పిల్లని పంపించు."

ఆ ఉత్తరం వచ్చేక రెండు మూడు రోజులకిపైగా అన్నపూర్ణ మనసులో గుంజాటనపడి, భర్తతో తర్జనభర్జనలుచేసి చివరికి ఒక నిశ్చయానికి వచ్చింది. అది శారదకి అనుకూలంగా పరిణమించడానికి అంతకుపూర్వం అనుకొన్న బసవయ్యశాస్త్రిగారి సంబంధం కలిసిరాక పోవడంకూడా ఒక కారణం. నానాటికీ ఆర్థికంగా దిగజారిపోతున్న ఇంటిపరిస్థితి ఇంకో కారణం.

ఆ శాస్త్రిగారిసంబంధం ఎలా తప్పిపోయిందో శారద తనకు తానుగా అడగలేదు. అయినా తల్లి అప్పటప్పట అన్న మాటల సారాంశంవల్ల అసలు కథ అర్థం కాకుండానూ పోలేదు.

తండ్రి మళ్ళీ పెళ్ళిప్రయత్నాలు చేస్తున్నాడు అన్నమాట చెవిని పడగానే, తొలిసంబంధం కూతుళ్ళు ముగ్గురూ అల్లుళ్ళతో సహా కట్టి కట్టుకొనివచ్చి ముసలాయన పీకలమీద కూర్చున్నారు. ఈ వయసులో పెళ్ళీడుకొచ్చిన మనుమలు ఉండగా నీ కిదేం పోయేకాలం—అంటూ

దీవాట్లు పెట్టేరుట. పెళ్ళిపేరుతో ఇంకోపిల్ల మెడలో తాళి కట్టేవంటే నీకు, మాకు ఇంతటితో సరి, మళ్ళా ఈ గుమ్మం తొక్కం—అని బెదిరించేరుట.

ఎవరో తెలియని ఆ కూతుళ్ళకి, అల్లుళ్ళకి మనసులోనే నమస్కరించి, కృతజ్ఞతలు తెలుపుకొంది శారద, తన తలమీంచి ఈ బెడద దింపినందుకు. అన్నపూర్ణమాత్రం ఈ సంబంధం కలిసివస్తే బాగుండిపోయేది; దానిబ్రతుకులో అయినా ఈ దరిద్రం కడుక్కుపోయేది; తనింత తిని ఒకరి కింత పెట్టగలిగేస్థితిలో ఉండేదని— అనుకొంటుండేది.

తను కాలేజీలో చేరుతున్నానని విశ్వంతో చెప్పి రావడానికి వారి ఇంటికి వెళ్ళింది శారద. ఆమె తిరిగివచ్చేసరికి ఎదురింటి మాస్టారుగారి థర్డుఫారమ్ చదువుతున్న అబ్బాయిచేత ఏదో చదివిస్తున్నాది అన్నపూర్ణ. ఆ కుర్రాడు అందులో విషయం సరిగా అర్థంకాక తికమకపడుతూ నోటి కేదివస్తే అది చదువుతూ, మనసుకి ఎలా తోస్తే అలా అర్థం చెబుతూ నానా హైరానా పడిపోతున్నాడు.

ఇంగ్లీషులో రాసిఉన్న ఉత్తరం చదవడం రాదంటే - "నీ చదువు పస ఇంతేనా?" అని ఆవిడ ఆక్షేపిస్తుందని ఆ కుర్రాడి భయం. అక్కడికీ ఆ ఉత్తరం చదవకుండా, తప్పుతుందేమోనని, "ఇది మీ శారదగారి దండి" అన్నాడు.

"ఫరవాలేదు, చదువు" అంది అన్నపూర్ణ.

ఇతరుల ఉత్తరాలు చూడకూడదు—వంటి నియమాలు అన్నపూర్ణకి పట్టవు. ఒక ఇంట్లో ఉండేమనుషులు ఇతరు లేమిటి? అందునా తల్లికి, పిల్లకి మధ్య రహస్యా లేముంటాయి—అంటుంది ఆమె.

అయితే, కూతురు రాకుండా అంత కష్టపడి అప్పుడే వచ్చిన ఆ ఉత్తరంలో భోగట్టాలు తెలుసుకోవాలని ఆవిడ అంతగా తాపత్రయపడ్డానికి కారణం లేకపోలేదు. అంతకుపూర్వం పది పదిహేను రోజులక్రిందట అటువంటి దస్తూరితోనే ఒక ఉత్తరం వచ్చింది.

చదవమని భర్త చేతిలో పెట్టింది. రామస్వామి—"దాని ఉత్తరాలు మన మెందుకు చదవడం? ఆ కవర్లో పెట్టి దాని పుస్తకాలబల్ల మీద పడేయి. వచ్చేక అదే చూసుకొంటుంది" అన్నాడు.

అప్పటిమట్టుకి అన్నపూర్ణకూడా అలాగే అనుకొంది. కాని, మళ్ళా అదే దస్తూరీతో ఇంకో ఉత్తరం వచ్చేసరికి ఈ ఉత్తరాల వెనక ఉన్న కథ తెలుసుకోవలసిన అవసరం ఎంతైనా ఉందనిపించింది ఆమెకి.

"ఎక్కడినించి ఉత్తరం?" గుమ్మంలో కాలు పెడుతూ అడిగింది శారద.

"ఎవరీ అనిల్?" కూతురివంక పరీక్షగా చూస్తూ ప్రశ్నించింది అన్నపూర్ణ.

"అక్కడ తెలిసినాయన."

"అంటే....అప్పుడే మగస్నేహితులుకూడా తయారయేరన్న మాట?"

"తయారవడ మేమిటమ్మా! అనిల్, రాజేందర్ తరుచు అత్తగారింటికి వస్తూ ఉంటారు. సాయంకాలం వేళగాని వస్తే రాత్రి భోజనానికికూడా ఉంటారు. రోజులతరబడి మనుషుల్ని కలుస్తున్నప్పుడు ఎల్లకాలం మాటామంతి లేకుండా బొమ్మలా కూర్చోలేను కదా?"

"రాజేందర్....అంటే ఆ గడ్డపాడేనా?"

"అవును....అతడే రాజేందర్ సింగ్. అరవిందకి బావ అవుతాట్ట."

"వాడు ఎలా పుట్టాడో తెలుసా?" అంది అన్నపూర్ణ కళ్ళెర్ర జేస్తూ.

"ఎలాగ పుడతాడు—అంతా ఎలాగ పుడతారో అలాగే తల్లి కడుపులోంచి పుట్టి ఉంటాడు." చిన్నగా నవ్వుతూ అంది శారద.

"చాల్లే, సంతోషించాను—తెలివితేటలకి" అని చీదరించుకొంటూ, "వాడమ్మ మొదట కడుపుచేసుకొని, తరవాత పెళ్ళి చేసు

కొంది'' అంది మెల్లగా రహస్యం చెపుతున్నట్లు కొద్దిగా ముందుకి వంగి.

''అటు దిటు తిరగబడింది. అంతే కదా'' అంది శారద తేలిగ్గా.

"శారదా!'' కోపంగా కేకపెట్టింది అన్నపూర్ణ.

''లేకపోతే ఏమిటమ్మా నీ చాదస్తం? అత దెలా పుడితే మనకేం, ఆవిడ ఎలా పెళ్ళిచేసుకుంటే మనకేం? మనం వాళ్ళతో వియ్యమందబోవడం లేదు. కయ్యమాడబోవడం లేదు. నేను అత్త గారి ఇంటికి వెళ్ళింది చదువుకోసం. ఈ రెండు, మూడేళ్ళు చల్లగా సాగిపోతే వెళ్ళినపని పూర్తిచేసుకొని తిరిగిరావచ్చు. ఇంక వాళ్ళింటికి వచ్చేపోయే వాళ్ళంటావా—వాళ్ళ అవసరాలకొద్దీ, అభిమానాలకొద్దీ వాళ్ళు వస్తూంటారు, వెళుతూంటారు. మనం కాదనలేం కదా?''

శారద అన్నమాట నిజమేలే అనుకొంది అన్నపూర్ణ. మాలతి ఆదుకొని—''నీ కూతురు చదువు నేను చూస్తాను'' అనబట్టికాని, లేకుంటే ఆడపిల్లని పట్నంలో ఒంటరిగా పెట్టి చదివించడానికి అయేదా? శారద అన్నట్లు ఈ రెండు, మూడేళ్ళు చల్లగా గడిచిపోతే....

''ఇంతకీ ఈ అనిల్ ఎవరు? వాళ్ళింటికి అంత తరుచుగా ఎందుకొస్తుంటాడు?'' ఈసారి కేవలం విషయం తెలుసుకోవాలన్న అభిప్రాయంతోనే అడిగింది.

"మామయ్యకి, అనిల్ నాన్నగారికి చాలా స్నేహంట. అనిల్ అక్కడ కాలేజీలో పనిచేస్తూ డాక్టరేట్ పొందడానికి రీసెర్చి చేస్తున్నాడు.''

''తెల్లగా, బక్కపలచగా ఉంటాడు—ఆ కుర్రాడేనా?''

"మరేం'' అంది శారద, ఆ ఉత్తరం చదువుకొంటూ.

''ఏం రాసే దేమిటి?''

తల్లివంక చురుగ్గా చూసింది శారద.

''మాస్టారుగారి అబ్బాయిచేత చదివించుకొన్నావుగా?''

"నా మొహం....వాడికి అసలు ఇంగ్లీషు అక్షరాలే తిన్నగా రానట్టుంది. మళ్ళీ థరుఫారమ్ చదువుతున్నాట....ఎందుకొచ్చిన చదు

వులు—డబ్బు దండక్కి....ఉత్తరం ఎక్కడినుంచిరా అంటే అదే తిన్నగా చెప్పలేకపోయేడు....ఇంక లోపలి విషయం ఏం చదువుతాడు?''

''ఏముంది....ఆ మధ్య నో ఉత్తరం రాసేడుకదూ—దానికి నేను రాసిన జవాబు అందలేదులా ఉంది. కాలేజీలో చేరుతున్నావా? లేదా అంటూ రాసేడు.''

''అంతేనా?''

''అంతేకాక?'' శారద తలఎత్తి తల్లివంక చూసింది.

అన్నపూర్ణ మాట్లాడలేదు. వంట ఇంట్లోంచి అన్నం మాడిన వాసనవస్తే 'అయ్యో, అయ్యో' అంటూ అటు పరుగుపెట్టింది.

అంతేకాక అనిల్ తనకేం రాసి ఉంటాడని అనుకొంది అమ్మ? శారద మనసులో క్షణకాలం ఏదో మధురమైన భావం కదలాడింది. చెవుల్లో శ్రావ్యమైన సంగీతం వినిపించింది. కళ్ళముందు గుంపులు గుంపులుగా సీతాకోకచిలుకలు ఎగురుకొంటూ పోసాగేయి.

'ఇదేదో ప్రేమలేఖ—అనుకొని ఉంటుంది మీ అమ్మ' మనసు జవాబు చెప్పింది.

అనిల్ తనకి ప్రేమలేఖ వ్రాస్తాడా?

ఆ ఆలోచనకే చిన్నగా నవ్వుకొంది శారద.

అది పైకి కనిపించడానికి కేవలం చిరునవ్వుమాత్రమే. కాని, దానిలో ఎన్నో భావాలు తొంగిచూసేయి.

అనిల్‌కుమార్ బెనర్జీ ఒక ఆడపిల్లకి ప్రేమలేఖ రాయడమా అన్న వ్యంగ్యం, అలారాస్తే బాగుండేది కదూ అనే కోరిక.

ఎందుకు రాస్తాడు? అందునా తనవంటి అందం, డబ్బూ లేని పిల్లకి....నిరాశ.

ఒకవేళ అనిల్ కాని, మరొక సునీల్ కాని, సుబ్బారావు కాని, సూర్యారావుకాని—ఎవరైనా కాని, తనకి ప్రేమలేఖంటూ రాస్తే.... లేక నిన్ను ప్రేమిస్తున్నామని ఎదుటపడి చెపితే ఏం చేస్తుంది....తనేం

తల్లి భోజనానికి పిలిచేవరకు అలా ఆలోచిస్తూనే ఉండి పోయింది శారద.

రైలుదిగి, సామాన్లు దింపుకొని ఇటు అటు చూసింది శారద. తను ఖచ్చితంగా ఆ రోజు వస్తున్నట్లు రాయలేదు—తెలిసిన ఊరే కదా—వెళ్ళిపోవచ్చు. అనవసరంగా వాళ్ళని శ్రమపెట్టడం ఎందుకని. అయినా యాథాలాపంగా ఎవరైనా కనిపిస్తారేమోనని చూసింది. అలా చూస్తుంటే కాస్తదూరంలో అనిల్‌కుమార్ కనిపించేడు. అతడూ శారదని చూసేడు. చూసేడనడానికి గుర్తుగా చేయెత్తి ఊపి శారద ఉన్నవైపు రాసాగేడు.

కూలివాడినెత్తికి సామాన్లు ఎత్తి, దగ్గరికివస్తున్న అనిల్‌వైపు చూస్తూ నిలబడింది శారద.

"వచ్చేసేరన్నమాట" అన్నాడు అనిల్ ఉత్సాహంగా.

"వస్తానని రాసేగా?"

"వస్తారని తెలుసనుకోండి, కాని, ఈ రోజే వస్తారని తెలియదు కదా?"

"మీ రిక్కడెందుకున్నారు?....ఊరికి కాని వెళుతున్నారా?"

లేదన్నట్లు తల ఊపేడు అనిల్.

"మరి?"

అదే రాజేందర్ అయితే "మీకోసమే....మీ రిలా ఈరోజు వస్తారని రాత్రి కల వచ్చింది" అని చమత్కరించి ఉండేవాడు. అటువంటిమాటలు అతనికి చేతకావు. అందుకే తను అక్కడ ఉండడానికి కారణం ఏమిటో సూటిగా చెప్పేసేడు.

"అక్క అమ్మదగ్గరికి వెళుతున్నాది. స్టేషనులో కలుసుకోమని ఉత్తరం రాసింది."

అనిల్ అక్క వస్తున్నరైలు నంబరు మూడు ప్లాటుఫారమ్ మీదికి వస్తున్నట్లు అనౌన్స్‌మెంట్ వినిపించింది.

ఇప్పుడా. ఈ రూపుతోనా—అన్నట్లు ఇబ్బందిగా చూసింది శారద.

ఆ చూపులోని అర్థాన్ని పసికట్టేడు అనిల్. చిన్నగా నవ్వుతూ, "ఫరవాలేదు లెండి....ఇప్పుడే ప్రయాణంచేసి వచ్చేరని చెబుతాను" అన్నాడు.

తలమీద బరువుతోనిలిచిన కూలివాడు శారద అలా మాటల్లో పడ్డంచూసి, 'అమ్మగారూ' అంటూ తన ఉనికిని గుర్తుచేసేడు.

"ఇప్పుడే వచ్చేస్తారు....ఒక్కమాటు దింపుకో" అన్నాడు అనిల్.

"మనం అటు వెళ్ళగానే వాడిటు సామాన్లు పట్టుకొని ఉడాయించేస్తే?" మెల్లగా అంది శారద.

"నంబర్ నోట్ చేసుకొందాం." అనిల్ సమాధానం చెప్పేడు.

"నాలుగుడబ్బులు దొరికేసమయంలో ఇలా ఒకేదగ్గర ఉండిపోతే ఎలా, బాబూ?"

అనిల్ జేబులోంచి పాతికపైసలు తీసి వాడిచేతిలో పడేసి, 'నువ్వెళ్ళు' అన్నాడు - పెట్టె. పుస్తకాలసంచీ రెండు చేతుల్లోకి తీసుకొంటూ.

"ఆ ప్లాస్టిక్ బుట్ట వగైరా మీరు పట్టుకోండి" అన్నాడు.

"ఇదెందుకు?" అంది శారద.

"అక్కని చూసేక ఇద్దరం కలిసేవెళ్ళిపోదాం."

శారద ఇంకోమాట అనడానికి ఆవకాశం వదలకుండా అనిల్ నడక సాగించేడు. అతన్ని అనుసరించివెళ్ళడం తప్పితే శారదకి ఇంకోమార్గం లేకుండాపోయింది.

వాళ్ళు నడుస్తున్నప్రదేశానికి పదిబారలదూరంలో ఆగింది ఫస్ట్ క్లాసు కంపార్టుమెంటు. కిటికీదగ్గర తలపెట్టి ప్లాటుఫారమ్‌మీదికి ఆత్రంగా చూస్తున్న ఒక నడివయసు యువతి 'అన్నా' అంటూ చెయ్యి బయటికి పెట్టి, కేక పెట్టింది.

"అదిగో అక్క" అంటూ అటు నడిచేడు అనిల్.

అనిల్, శారద అక్కడికి చేరేసరికి ఆవిడ పెట్టెలోంచి ప్లాటు ఫారమ్‌మీదికి దిగి వచ్చింది.

అంతమంది మనుషులమధ్య ఆ ప్లాటుఫారమ్‌మీద వంగి అక్కకి పాదాభివందనం చేసేడు అనిల్. 'అన్నూ.... అన్నూ' అంటూ చిన్న తమ్ముణ్ణి చేతుల్లోకి తీసుకొన్నట్లు, అతన్ని లేవనెత్తి గుండెలకి అదుముకొంది ఆవిడ.

ఆమె శరీరవర్ణం పచ్చగా పండు తమలపాకులా ఉంది. ఎర్రంచు తెల్ల సిల్కుచీరె కట్టుకొంది. తలమీదుగా సగానికిపైగా ముసుగు వేసుకొంది. జుట్టులో అక్కడక్కడ పండు వెంట్రుకలు కనిపిస్తున్నాయి. పాపిట్లో సిందూరం. తమలపాకులు ఎక్కువగా నమలడంవల్ల గారకట్టిన పళ్ళు - నోట్లో అప్పుడుకూడా కిళ్ళీ ఉన్నట్లే ఉంది. ఎడం బుగ్గకన్న కుడిది ఎత్తుగా ఉంది. కళయిన ముఖం, నిండైన విగ్రహం. వయసులో ఉన్నప్పుడు అందకత్తెల్లోనే జమ అయి ఉంటుంది అనిపిస్తుంది, అప్పటి ఆమెరూపం చూసినవాళ్ళకి.

అక్కా తమ్ముళ్ళు కాస్తసేపు చేతులు వదలకుండానే బెంగాలీలో ఏమో మాట్లాడుకొన్నారు. ఒకటి రెండుసార్లు అనిల్ వెనుతిరిగి శారదవైపు చూసి అక్కతో ఏమో చెప్పేడు. 'రా అమ్మా' అన్నట్లు చెయ్యి ఊపుతూ శారదని పిలిచింది ఆవిడ.

శారద దగ్గరికివెళ్ళి సామాన్లు కిందపెట్టి, నమస్కారం పెట్టింది. ఆవిడ ఆశీర్వదిస్తున్నట్లు శారద తలమీద చెయ్యిపెట్టి తమ్ముడితో ఏదో అంది. అతడు దానికి కొద్దిగా తలవంచి, చిన్నగా నవ్వుతూ జవాబు చెప్పేడు. ఆ మాటల్లో ఒకటి రెండుసార్లు తన పేరు రావడంతో అది తనగురించే అని పోల్చుకొంది శారద.

"సారీ, శారదా.... అక్కకి ఇంగ్లీషు రాదు.... తెలుగు అసలే రాదు" అన్నాడు అనిల్, తమ సంభాషణ మాతృభాషలో సాగడానికి కారణం చెబుతున్నట్లు.

'ఫరవాలేదు' అన్నట్లు చిన్నగా నవ్వింది శారద.

అనిల్ ఎదురుగాఉన్న స్టాలుకుపోయి అక్కకోసం పళ్ళు కొని తెచ్చేడు. అతడు వచ్చేవరకు ఆమె శారదని చూస్తూ బెంగాలీలో ఏమో అంటూనే ఉంది. ఆ మాటలో కొన్నిపదాలకి, హిందీపదాలకి పోలిక ఉంది. శారదకి కొద్దిగా హిందీ రావడంవల్ల ఆమె చెబుతున్నదంతా తన తమ్ముడు అనిల్ గురించే అని తెలుసుకోవడంవరకు ఉపయోగ పడ్డది.

అనిల్ పెట్టెలోకి ఎక్కి, పళ్ళబుట్ట లోపలపెట్టి వచ్చేడు. గార్డు విజిల్ ఊదేడు కదలబోతున్నాను - అన్నట్లు చక్రాలు కరకర మనిపించింది రైలు. అనిల్ చెయ్యివిడిచి ఆవిడ బండిలోకి ఎక్కింది. ఆమె కళ్ళనిండా నీళ్ళు ఉన్నాయి. కొంగుతో వాటిని తుడుచుకొని, అనిల్ వైపు చూస్తూ ఏమో అడిగింది. అనిల్ చెప్పాలని నోరు తెరిచే లోపలనే రైలు కూత వేస్తూ కదిలి వెళ్ళిపోయింది.

కిటికీలోంచి అక్కముఖం కనిపిస్తున్నంతసేపూ అనిల్ చెయ్యి ఊపేడు. అది కనుమరుగు కాగానే "ఇంక వెళదామా?" అన్నాడు శారదవైపు తిరిగి.

ఎర్రబడ్డ అతని కళ్ళవంక చూసింది శారద. మగవాళ్ళకి మనసులో కష్టంఉన్నా సాధారణంగా కళ్ళంట నీళ్ళురావు. అనిల్ మనసు అతడి భావాల్లాగే, అతడి అలవాట్లులాగే అతి సున్నితమైనది. మగాడి మొరటుతనం అతడి శరీరానికేకాక మనసుకికూడా అంటినట్లు కనిపించలేదు.

"అక్క చాలా మంచిది. తనకి నేనంటే ఎంతో అభిమానం. నిజానికి నాకు అమ్మదగ్గరికన్నా అక్కదగ్గరే చేరిక ఎక్కువ" అన్నాడు అనిల్, స్టేషనుదాటి బయటికి వస్తూంటే.

అక్కకి, తమ్ముడికిమధ్య వయసులో అంతరం ఎక్కువగా ఉంటే, సహజంగానే తల్లి స్థానాన్ని తను ఆక్రమించి తమ్ముడి పాలన, పోషణ చూడ్డం, అతడి అభిమానాన్ని ఆకట్టుకోవడం జరుగుతుంటుంది. అనిల్

అనిల్‌కుమార్ తల్లి సిద్ధేశ్వరి పెద్దింటి ఆడపడుచు. మెట్టినింట అడుగుపెట్టేక, అత్తింటి గౌరవమర్యాదల్ని, ఆస్తిపాస్తుల్ని అభివృద్ధి పరిచిందే కాని దిగలాగలేదు. సంప్రదాయానుకూలంగా ఇంటిని, ఇంట్లోని మనుషుల్ని నడిపించుకొచ్చింది.

సంపన్నులగృహం అంటే ఇలా ఉండాలి, గృహానికి జీవగర్ర అయిన గృహిణి ఇలా ఉండాలి — అన్నట్లు ఉండేది ఆమె సంసారం. పెళ్ళి చేసుకొని, కాపురానికివచ్చిన మొదట్లోనే వరసగా ముగ్గురు ఆడపిల్లలు పుట్టేరు. ఆపైన మరి కానుపు లేదు. వంశోద్ధారకుడికోసం పూజలు, యాత్రలు, జపాలు, తపాలు మొదలుపెట్టేరు ఆ దంపతులు. అలా కొంతకాలం గడిచేక వారి కోర్కె ఫలించింది. అనిల్ పుట్టేడు. కోరికతీరినా, అంతకాలంగా ఆచరిస్తున్న జప, తప నియమాల్ని విడవలేకపోయింది సిద్ధేశ్వరి. ఆ కారణంగా అనిల్ పెంపకం అంతా పెద్దక్క మాతంగి చేతుల్లో జరిగింది.

మాతంగికి పెళ్ళిఅయి తన పిల్లలు తనకున్నా, అనిల్‌పట్ల మమత తగ్గలేదు. 'అన్నూ నా పెద్దకొడుకు' అంటూంటుందిట ఆమె అందరితో.

దారిపొడుగునా తన అక్క గుణగణాలు చెప్పేడు అనిల్. ఆ రోజు వారి ఇంటిపరిస్థితులు, జీవితవిధానాలు, ఆచారాలు, ఆప్యాయాలు—ఎన్నో తెలుసుకొంది శారద. అరగంట ముందుకన్న అప్పుడు అనిల్ తనకి ఎంతో చేరువలోకి వచ్చినట్టు కనిపించింది ఆ పిల్లకి.

* * *

''అత్తయ్య పద్మవ్యూహంలోంచి మెల్లగా తప్పించుకొని బయటపడ్డావన్నమాట'' అంటూ పలకరించింది అరవింద.

"నాకు తెలుసులేవే, నువ్వు మీ అక్కల్లా చచ్చుపెద్దమ్మవి కావని. ఆ అమ్మకి తగినకూతురివి'' అంటూ మేనగోడల్ని అభినందించింది మాలతి.

ఈసారి కాలేజీ చదువు, అత్తగారిఇంటి ఉనికి-అంతా శారదకి

స్వేచ్ఛా ప్రేమతత్త్వపు ఉపన్యాసాలుకూడా అలవాటుగా మారిపోయి మొదట్లోలాగ వెగటు కలిగించడం మానేసేయి. 'పుర్రెకో బుద్ధి, మనిషి కో పిచ్చి అన్నట్లు అలా వాగుతాడే కాని, స్వతహాగా మనిషి చెడ్డవాడు కాదు—అన్న అభిప్రాయం ఏర్పడ్డాక, ముందుకన్న అతడితో చనువుగా మాట్లాడ్డం మొదలుపెట్టింది.

అనిల్ ఆ మూడునెలలకాలంలో చాలాభాగం వెచ్చించి తెలుగులో మాట్లాడ్డం నేర్చుకొన్నాడు. పూర్వంలాకాక ఇప్పుడు మామూలు సంభాషణ ధారాళంగా తెలుగులో చెయ్యడానికి తగినన్నిమాటలు సేకరించేడు. అప్పటప్పటి తన మనోభావానికి సరిఅయినమాట తెలుగులో తెలియక ఇంగ్లీషుపదం వాడినా, మొత్తంమీద శారదతో సంభాషణ అంతా తెలుగులోనే సాగించడం మొదలుపెట్టేడు.

పూర్వకాలంలో యుద్ధభూమిలో ఇరుపక్షాలసేనలు ఇటు అటు కొంతదూరంలో దండువిడిపి, ఒక నిర్ణీతసమయంలో రెండువైపుల నుంచి వచ్చి మధ్యను కలుసుకొని పోరాడేవిట. అదేవిధంగా ఇక్కడ అనిల్ తెలుగులో మాట్లాడ్డం నేర్చుకొంటే, అక్కడ శారద ఇంగ్లీషులో మాట్లాడ్డం అలవాటు చేసుకొంది. సంభాషణకి వారి ఇద్దరి మధ్య పూర్వం నిలిచిఉండే భాష అనే అడ్డుగోడ ఆవిధంగా తెగిపడ్డంతో వారిస్నేహం రోజురోజుకీ బలపడి, వారిమధ్య ఆప్యాయత వికసించసాగింది.

కాలేజీలో చదువు, అత్తగారిఇంటి ఉనికి, అనిల్‌కుమార్‌తో స్నేహం, శారదకి రోజులు గడుస్తున్నట్లే అనిపించలేదు,

రాజేందర్ ట్రెయినింగ్ పూర్తి అయింది. బజారువీథిలో ఒక రెండుగదులు వాటా తీసుకొని స్వంత ప్రాక్టీసు పెట్టేడు. ఆ కొత్త మోజులోపడి రోజులో చాలాకాలం అక్కడే గడపడం మొదలు పెట్టేడు.

రఘునాథరావుగారి ఇంటికి రాజేందర్ రాకపోకలు తగ్గడం, అనిల్‌కుమార్ రాకపోకలు ఎక్కువకావడం రమారమి ఒకే కాలంలో

ఇంట్లో అందరికీ పట్టిచ్చినట్లు కనపడింది. నాలుగైదురోజులు వరసగా అనిల్ రాకపోతే 'రాలేదేం చెప్మా' అని నౌకర్లు అనుకొనేవరకు వచ్చింది పరిస్థితి.

అనిల్ రాకపోకల్లోని మర్మం మాలతి గ్రహించకపోలేదు. కాని, అందువల్ల తను కంగారుపడేందుకు లేదని నిర్ధారించుకొనే చూసీ చూడనట్లు ముభావంగా ఊరుకొంది. అనిల్‌వంటి అబ్బాయి, శారదవంటి అమ్మాయి ఎంత దగ్గరికివచ్చినా అవాంఛనీయమైన సంఘటన లేమీ జరగవని ఆమె నమ్మకం. ఇద్దరి కిద్దరూ హద్దులు, బాధ్యతలు తెలుసుకొని ప్రవర్తించే మనుషులు. ఈ స్నేహం ఫలించి బాంధవ్యంగామారితే శారద అదృష్టవంతురాలే అవుతుంది—అనుకొంది.

అరవిందకి పూర్వంలా శారదతో కబుర్లు చెబుతూ కూర్చోవడానికి ఇప్పుడు తీరిక ఉండడంలేదు. ఇటు కాలేజీలో చదువు, అటు రాజేందర్‌కి డిస్పెన్సరీలో సహాయపడ్డం—రెండింటితో ఆ పిల్లకి తీరికన్నమాటే లేకుండాపోయింది. కాస్త సమయం దొరికిందంటే తను, రాజేందర్ కలిసి ఏ సినిమాకో, పార్కుకోపోయి తిరిగి వస్తుండేవారు.

శారద కాలేజీవదిలి బస్సుస్టాపుకి చేరుకొనేలోపునే వచ్చి కలిసేవాడు అనిల్‌కుమార్. ఇద్దరూ కలిసి ఇంటికి వచ్చేవారు. బయట తోటలోనో, మేడమీద బాల్కనీలోనో కూర్చుని కబుర్లు చెప్పుకొనేవారు. సాధారణంగా వారి కబుర్లలో వ్యక్తిగతవిషయాలు అంతగా వచ్చేవి కావు. పొరపాటున ఎప్పుడైనా జారపడితే ఇద్దరి కిద్దరూ దానిలోంచి బయటపడ్డం ఎలాగా అన్నట్లు ఇబ్బంది పడేవారు. అందుకే ఆ రోజున అనిల్‌కుమారే నోటివెంట అటువంటిమాట విని ఆశ్చర్యపోయింది శారద. ఆ మాటలకి ఎంతవరకు విలువ ఇయ్యాలో, ఏ పరిధిలో తీసుకోవాలో అర్థంకాక తికమకపడింది. అసలది ఎలా జరిగిందంటే—

ఆ రోజు ఆదివారం. అయినా, ప్రైవేటుక్లాసు ఉండడంచేత కాలేజీకి బయలుదేరింది శారద.

"ఈ రోజు ప్లీడరుగారి ఇంట పెళ్ళి. సాయంకాలం పార్టీకి నిన్నుకూడా తీసుకురమ్మని ఆవిడ మరీమరీ చెప్పేరు. త్వరగా వచ్చేయి" అంది మాలతి.

"పని అయిపోతే ఆ వేళకి వచ్చేస్తాను, అత్తయ్యా! లేకపోతే ....నాకోసం చూడకుండా మీ వేళచూసుకొని మీరు వెళ్ళిరండి" అంది శారద.

వేళకి పని అయిపోయినా, ఇంటికి తిరిగిరావడం శారద కావాలనే కాస్త ఆలస్యం చేసింది ఇటువంటి పెద్దవారిళ్ళలో పెళ్ళిళ్ళకి, పార్టీలకి వెళ్ళి. ఆ విందు వినోదాల్లో పాల్గొని ఆనందించడం ఆమెకి ఇంకా అలవాటు కాలేదు. అటువంటిచోట్లకి వెళితే, అంతమంది మనుష్యులమధ్య ఒంటరితనం అనుభవిస్తున్నట్లు, అంతటి ఆనందంలో ఉదాసీనతవహుచుకొని ఉన్నట్లు, గాలిలేక ఊపిరాడనట్లు లేక గాలి ఒత్తిడివల్ల ఉక్కిరిబిక్కిరి అయిపోతున్నట్లు, వారంతాకలిసి తనని మధ్యకిచేర్చి నలిపి పారేస్తున్నట్లు, లేక దూరంగా నెట్టివేస్తున్నట్లు— ఇలా తమాషా అయిన అనుభూతులు పొందుతుంటుంది శారద. అటువంటిపార్టీలకి వెళ్ళివచ్చినతరవాత ఆనందంకన్న, అలసటే ఆమె మనసులో మిగిలిపోతుంది. అందుకే సాధ్యమైనంతవరకు అటువంటి చోట్లకి వెళ్ళకుండా ఉండేందుకే ప్రయత్నిస్తుంది.

అనుకొన్నట్లే శారద ఇంటికి వచ్చేసరికి వాళ్ళంతా వెళ్ళిపోయేరు.

"ఇప్పటివరకు అమ్మగారు మీకోసం చూసి ఇప్పుడే వెళ్ళేరమ్మా. మీరు వస్తే టాక్సీతీసుకొని అక్కడికి రమ్మన్నారు" అంటూ వార్త అందించేడు అప్పన్న.

"తలకాయ నొప్పిగా ఉంది, అప్పన్నా....ఇప్పు డెక్కడికి వెళ్ళలేను. నాయర్‌తో చెప్పి కాస్త వేడి కాఫీ తెచ్చిపెట్టు."

అప్పన్న తెచ్చిన కాఫీతాగి బట్టలు మార్చుకొని తోటలోకి వచ్చింది శారద. అక్కడ మొక్కలమధ్య అలా తిరుగుతుంటే మరునాడు చూపించవలసిన ప్రాక్టికల్ నోట్సుసంగతి గుర్తుకొచ్చింది.

ఆమెపని రమారమి పూర్తి కావస్తున్నతరుణంలో తలుపుమీద టక్ టక్‌మని చప్పుడు వినిపించింది.

అత్తయ్యావాళ్ళు వచ్చేసి ఉంటారనుకొంది శారద. వచ్చింది అరవిందే అయి ఉంటుంది అన్నభావంతో వెనుతిరిగి చూడకుండానే- "రా, అరవిందా" అంది.

శారదచేతిలో పెన్నుకి మూతపెట్టి, పుస్తకాలు సరిచేసి, కుర్చీ లోంచి లేచేసరికి తలుపు తట్టినవ్యక్తి లోపలికి రావడం జరిగింది.

"ఓ మీరా!" అంది ఎదురుగా అనిల్‌ని చూస్తూ.

"మీ పని పాడుచేసేనులా గుంది."

"అబ్బే... పెద్దగా పనేం లేదు, ఇంట్లో ఎవ్వరూ లేరు.... ఊసుపోక...."

"అవునట....నిన్న అరవింద చెప్పింది—ప్లీడరుగారి అమ్మాయికి పెళ్ళిట కదా?"

"అంటే తెలిసే వచ్చారన్నమాట!" అమ్మ దొంగా అన్నట్లు చూపింది శారద.

"ఏమిటి?" ఆమె అంటున్నదేమిటో అర్థం కానట్లు చూసేడు అనిల్.

"ఇంట్లో ఎవ్వరూ ఉండరని...."

"ఓ....అదా! మీరుకూడా వెళతారేమో అనుకొన్నాను. అప్పన్నను అడిగితే ఇంట్లోనే ఉన్నా రన్నాడు."

"వెళ్ళవలసిందే... కాని, ఈరోజు ప్రైవేటుక్లాసు ఉంది. అక్కడినుంచి వచ్చేసరికి...."

"మంచిదే అయింది."

"ఏమిటి?"

"మీరు వెళ్ళకపోవడం. లేకపోతే ఇంతా వచ్చి నిరాశతో తిరిగి పోవలసివచ్చేది."

"నిరాశ దేనికి?"

"ఏదైనా పని చెయ్యాలనుకొన్నది అనుకొన్నప్పుడు చెయ్యడం పడకపోతే నాకు చాలా చికాకుగా ఉంటుంది. ఆ చికాకు

ఎంతలా ఉంటుంది అంటే, ఒక్కొక్కసారి ఆ పనిని తిరిగి చెయ్యడానికి ప్రయత్నంకూడా చెయ్యకుండా విడిచి పెట్టేస్తాను.''

''ఇంతకీ ఇప్పుడు ఏమిట్టా గొప్పపని?'' అతడి కళ్ళలోకి చూస్తూ అడిగింది శారద.

అతడు వెంటనే జవాబు చెప్పలేదు.

ఆరోజు అతడిమాటలు కొత్తగా వినిపించాయిచే శారదకి ఇంట్లో ఎవ్వరూ ఉండరని తెలిసికూడా ఆ సమయంలో అలా రావడం వింతగా అనిపించింది.

శారద తనని అలా పట్టిపట్టి చూస్తుంటే ఇబ్బందిగా ముఖం తిప్పుకొన్నాడు అనిల్. జేబులోంచి ఒక సిగరెట్టుతీసి నోట్లో పెట్టుకొని వెలిగించేడు. అగ్గిపుల్ల గీసి సిగరెట్టు అంటిస్తుంటే అతడివేళ్ళు చలించేయి. ఒకటికి రెండుసార్లు ప్రయత్నిస్తేనేకాని సిగరెట్టు అంటుకోలేదు.

''ఇదెప్పటినుంచి?'' అంది శారద ఆశ్చర్యంగా.

''అలవాటుగా కాదు....ఇలా అప్పుడప్పుడు....''

"నోటికి తిన్నగా మాటలు రానప్పుడో....మెదడు జోరుగా పని చేస్తున్నప్పుడో.''

చిన్నగా నవ్వి ఊరుకొన్నాడు అనిల్. సిగరెట్టుపొగ మెల్లిగా నోటిలోకిపీల్చి వదిలిపెట్టేడు. అలవాటులేనికారణంగా ఆ పొగ గొంతులోకిపోయి దగ్గు తెప్పించింది. కర్రుకర్రున దగ్గుతూనే ఇంకోసారి పీల్చేడు.

''పారేయండి, అనిల్‌బాబూ....అలవాటులేని పనులజోలికి పోవడం అంత మంచిదికాదు. అయినా నాదగ్గర మాట చెప్పడానికి మీకు సిగరెట్టు ఆసరా కోరవలసి వచ్చిందా? తమాషాగా ఉందే!'' అంది శారద.

అనిల్ కిటికీదాకావెళ్ళి సిగరెట్టు ఆర్పి తోటలోకి విసిరేడు. అక్కడినుంచి తిరిగివస్తూ శారదవంక చూడకుండా-''అక్క ఉత్తరం

"అమ్మయ్య....ఇప్పటికి తెలిసింది. ఇది చెప్పడానికి వచ్చే రన్నమాట!"

"మరేం!" అన్నాడు అనిల్ పరాగ్గా.

శారద కిసుక్కుమని నవ్వి ఆ నవ్వు ఇంకా తోసుకురాకుండా పైటచెంగు అడ్డం పెట్టుకొంది.

ఆ నవ్వు వినగానే తన తెలివితక్కువ సమాధానం గుర్తు కొచ్చింది అనిల్‌కుమార్‌కి. తన అక్క ఉత్తరంరాస్తే, ఆ మాట శారదతో చెప్పటానికి, ఎవరూ ఇంటలేని సమయంచూసుకొని తను రావడం దేనికి? ఆ మాట చెప్పడానికి ఇంత కంగారుపడ్డం ఏమిటి? ఈ జవాబుకి ఏమైనా అర్థముందా?

ఇలా పరాగ్గా ఏదో ఒకటి నోరు జారడం లాభంలేదు. కాస్త ఆలోచించి, సూటిగా మాట్లాడ్డం నేర్చుకోవాలి. శారద కాబట్టి నా మతిమరుపుమాటకి నవ్వుతో పోనిచ్చింది. ఇదే అరవింద అయితే అనిల్‌కుమార్ బెనర్జీగారికి ప్రొఫెసర్ ఉద్యోగానికి కావలసిన అర్హతల్లో అప్పుడే ఒకటి వచ్చేసింది అని ఉడికించిపోయేది అనుకొన్నాడు.

శారద వస్తున్న నవ్వును ఆపుకోవడానికి అతనివైపునుంచి దృష్టి తప్పించుకొంది. ఆ కాస్తసమయాన్ని ధైర్యం కూడగట్టుకోవడానికి ఉపయోగించుకొన్నాడు అతడు.

"అక్కకు మీరు నచ్చేరుట." ఇది అతడి రెండోమాట. అతడి అభిప్రాయంలో ఇది సూటిగా మాట్లాడ్డం.

ఆ మాటకి అర్థం ఏమైనా, ఆనాటి అతడి మనసు పసికట్టిన శారద ఆ మాట వెనకఉన్న భావమేమిటో గ్రహించింది. కాని, దాన్ని బయటపడనీయకుండా, "అంటే మీకు నచ్చలేదన్న మాటేనా?" అంది.

మీకు తెలియదా అన్నట్లు ఆమెవైపుచూసి చిన్నగా నవ్వి ఊరుకున్నాడు అనిల్.

"ఇంతకాలంగా పరిచయం ఉన్న మీరే నచ్చేనో, లేదో చెప్పలేక తికమకపడుతూంటే....ఆ కొద్దిసేపు చూపుమాత్రంగానే ఆవిడ ఎలా చెప్పగలిగేరు?"

''అదే అక్కలోఉన్న గొప్పతనం....మనుషుల్ని, వారి మనసులోని మాటల్ని ఇట్టే పోల్చేసుకొంటుంది. రైలు బయలుదేర బోతుంటే ఏమడిగిందో తెలుసా?''

''నా కెలా తెలుస్తుంది ఆవిడ బెంగాలీలో మాట్లాడుతుంటే?''

''శారద అంటే నీ కిష్టమేనా, అన్నా, అంది.''

''మీ రేమన్నారట?'' తమాషాకి అడిగినటే అడిగేననుకొంది శారద. కాని, అతడు జవాబు చెప్పటానికి పెదవి కదపబోతూంటే ఆమెగుండె దడదడలాడింది. ఒంటిలోంచి, చెవుల్లోంచి వేడిగా గాడ్పులు వచ్చేయి. అడక్కపోవలసింది....ఇటువంటిప్రశ్న అడక్క పోవలసింది—అనుకొంది బాధగా.

కాని, రాకూడనిప్రశ్న నోటిలోంచి బయటికి రానేవచ్చింది. దానికి జవాబు హితమైనా, అహితమైనా వినక తప్పదు.

అనిల్‌కి ఎదురుగా కూర్చుని అతనివంకచూస్తూ తనప్రశ్నకి జవాబు వినాలనిపించలేదు శారదకి. నెమ్మదిగా అక్కడినుంచి లేచి కిటికీవైపు వెళ్ళింది.

అప్పటికే బయట కనుచీకటి పడింది. చౌకీదారు గేటుముందు బెంచిమీదకూర్చుని ఏదో కూనిరాగం తీస్తున్నాడు. తోటమాలి మను మడు పక్కగాఉన్న రాతి తిన్నెమీద పేకముక్కలతో మేడ కడు తున్నాడు. ఎదురుగాలి మాటిమాటికి వాటిని పడగొడుతున్నాది.

''ఈ గాలిలో ఈడ ఆ మేడేటి నిలుత్తదిరా....ఇంటోకిపోయి కట్టుకో'' అన్నాడు చౌకీదారు. ఆ పిల్లాడు అక్కడనుండి కదలలేదు; తనప్రయత్నం మాననూ లేదు. ఆ పిల్లడి పట్టుదలచూస్తే శారదకి ముచ్చట వేసింది. ఏదో సమయానికి ఈ గాలితో పోట్లాడి ఇక్కడే కడతాను నా మేడ—అన్నట్లుంది అతడి నిర్ణయం.

అనిల్ శారదమాటకి జవాబుగా ఏమో అన్నాడు. తోటమాలి మనుమడివైపు చూస్తున్న శారద ఆ మాట వినిపించుకోలేదు.

''[illegible]''

"అంతలో రైలు వెళ్ళిపోయిందిగా!"

గాలితో పోట్లాడి ఆ పిల్లడు పేకముక్కలమేడలో మూడో అంతస్తు నిలిపేడు. భారం తీరినట్లు నిట్టూర్చి, శారద తిరిగివచ్చి తన కుర్చీలో కూర్చుంది.

కొంతసేపువరకు ఆ గదిలో నిశ్శబ్దం రాజ్యం చేసింది. శారద, అనిల్ ఎవరి ఆలోచనల్లో వారు ఉండిపోయేరు.

"అమ్మ ఇష్టపడితే పెళ్ళికి ఒప్పుకొంటావా?" ఉన్నట్లుండి ఆత్రంగా అడిగేడు అనిల్.

పరాకుగాఉన్న శారద అతనిమాటతో తుళ్ళిపడింది. అంత లోనే కోలుకొని, "ఎవర్ని... మీ అమ్మగారినా?" అంది చిలిపిగా.

"ఊహూఁ....నన్ను" ఎంతో గంభీరంగా ముఖంపెట్టి అన్నాడు అనిల్.

"అయితే, మీ అమ్మగారు ఇష్టపడ్డమేమిటి? ఇష్టపడవలసింది మీరు కాని?"

శారద తనని తికమక పెట్టడంకోసమే ఆ మాట అంది అని అతడు గ్రహించలేదు.

"అమ్మ ఇష్టంలేకుండా నా పెళ్ళి ఎలా అవుతుంది?" అన్నాడు. అది ఆలోచనలోకికూడా రావడానికి వీలులేని విషయం అన్నట్లుంది ఆ మాట తీరు

ఆ సమయంలో అతడు ఎమ్.ఏ. పాసయి డాక్టరేట్ కోసం రీసెర్చి చేస్తున్న పరిణతవయస్కుడులా కనిపించలేదు. అమ్మ కొంగుపట్టుకు తిరిగే ఎలిమెంటరీ స్కూలు అబ్బాయిలా అనిపించేడు.

"మీ అమ్మగారు ఇష్టపడగానే సరా....మరి మా అమ్మగారు ఒప్పుకోవద్దూ?"

"ఏమన్నారు మీ అమ్మగారు?"

"అవును, అనిల్ బాబూ.... మా రాష్ట్రంలో డబ్బులేనివాళ్ళకి కూడా అమ్మా, నాన్నా ఉంటారు."

"సారీ, శారదా.... నేను ఆ అభిప్రాయంతో అనలేదు."

శారద సరదాకి అన్నమాటకి అనిల్ బాగా నొచ్చుకొన్నాడు. ఆ విషయం నోట్లోంచివచ్చిన మాటకన్నా, ముఖంలో మారినరంగులు స్పష్టంగా తెలియజేసేయి.

అనవసరంగా అతన్ని నొప్పించేను అనుకొంది శారద. చేసిన పొరపాటుని దిద్దుకోవడానికి బండిని మళ్ళా గాడిలోకి లాగుతూ, "అయితే, అనిల్‌బాబూ, మీ పెళ్ళికి మీ అమ్మగారి ఇష్టమేకాని మీ నాన్నగారి సమ్మతి అక్కరలేదా" అంది.

"అమ్మ ఇష్టాన్ని నాన్న ఎప్పుడూ కాదనరు."

"బెంగాలీకుటుంబాల్లో మగవాడికన్న ఆడదానిచెయ్యే పైకి ఉంటుందని ఏవో కథల్లో చదివేను—ఆ విషయం సరి అయినదే అంటారా?"

"అన్ని ఇళ్ళలో అలా ఉండకపోవచ్చు. కాని మా ఇంట్లో మా అమ్మ ఇష్టానికి వ్యతిరేకంగా ఏ పనీ జరగదు. ఉదాహరణకి-నా క్రాపింగు చూసేరా—ఇంటికి వెళ్ళేముందు నెలరోజులపాటు దీన్ని బాగా పెంచి మరీ వెళతాను."

'ఎందుకూ?"

"జుట్టు ఇలా ఇంత పొట్టిగా ఉండటం అమ్మకి నచ్చదు."

"అయితే మీరు ఎందుకు కత్తిరించుకొన్నట్లు?"

"ఇక్కడికి వచ్చినమొదట్లో అరవింద నా క్రాపింగుచూసి ఆటలు పట్టించేది."

"అంటే ఇల్లు దాటగానే అమ్మగారి ఆజ్ఞలపట్ల భక్తి తగ్గి, అమ్మాయిల ఇష్టాలమీద రక్తి పెరిగిందన్నమాట!"

శారద చమత్కారంతో ఎర్రబడినముఖాన్ని రెండుచేతులతో కప్పుకొన్నాడు అనిల్.

అతడి చేతులవంక చూసింది శారద. అప్పుడే విచ్చిన కృష్ణ తామరపువ్వు రేకులంత మృదువుగా, లలితంగా ఉన్నాయి ఆ చేతులు. వేళ్ళు పొడుగా [illegible]

చేతులుమాత్రమే చూస్తే అవి మగాడిచేతులు అని పోల్చుకోవడం కష్టమే అవుతుంది.

ఆ చేతులవంకే చూస్తూ అలా కొంతసేపు ఉండిపోయింది శారద. ఆ చేతులకి తనని ఆదుకొనే శక్తి ఉందా? తనచేతికి బలం ఇస్తూ జీవితం పొడుక్కీ లాక్కుపోయే ఆసక్తి ఉందా?

అతడు జేబులోంచి రుమాలుతీసి ఇంకా మిగిలిఉన్న ఎరుపును తుడిచివేసేడు.

''మీరు ఆడపిల్ల అయి పుట్టవలసింది'' అంది శారద, అతడి ముఖంవంక, చేతులవంక చూస్తూ.

''అంతమాట అనకండి... అమ్మ ఎన్నో పూజలు, వ్రతాలు చెయ్యగా పుట్టేనుట.''

''ఆ మాట నిజమేలాగుంది. ఆ బ్రహ్మదేవుడు మీ అమ్మగారికి మళ్ళా ఇంకో ఆడపిల్ల నియ్యాలనే మొదట అనుకొనిఉంటాడు. కాని, చివరిక్షణంలో ఆవిడ పూజలకి, జపతపాలకి మెచ్చి మగపిల్లాడిగా మార్చేసిఉంటాడు'' అంది శారద నవ్వుతూ.

''అక్కకూడా అలాగే అంటుంది.'' అనిల్ శారదతోపాటు తనూ నవ్వుతూ అన్నాడు

''అబ్బో....అనిల్‌కుమార్ బెనర్జీగారు కూడా నవ్వగలరే'' అంటూ ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ లోపలికి వచ్చింది అరవింద.

''ఏం, మీ బావగారుతప్ప లోకంలో ఇంకెవ్వరూ నవ్వలేరను కొంటున్నావా?'' అంది శారద.

''అనిల్‌లాంటి వాళ్ళు నవ్వితే అందం, చందం కనిపిస్తుంది. పాపం, మా బావ అయినదానికీ, కానిదానికీ ఎంతగా నవ్వినా ఏం లాభం! ఆ గడ్డాలు, మీసాలచాటున ఆ నవ్వుతో సొగసులు కనిపించాలా ఏమన్నా!'' వెనకగా వస్తున్న రాజేందర్‌వంకచూస్తూ అంది అరవింద.

''ఇంతకీ అనిల్‌కుమార్ బెనర్జీగారి ఈ అపురూపమైన నవ్వుకి కారణం?''

''అబ్బా.... ఎంతాశ ! నీతో, నాతో అంత సులువుగా చెప్పే స్తాడనే.... ఇంతకాలంగా ఏ దేవతకోసమో.... ఏ శుభసమయంకోసమో అంత పదిలంగా దాచిదాచి.... ఈనాటికి....''

''నాకు పనుంది. నేను వెళుతున్నాను.'' అదటుగా లేచి పోయేడు అనిల్.

''కూర్చో, అనిల్. ఇంతమాత్రానికే ఉడుక్కొంటే ఈ ఆడ పిల్లలు సామాన్యులు కారు, ఇంకా ఆటలు పట్టిస్తారు. మగాడిని.... అమ్మాయిల పరిహాసాల్ని ధైర్యంగా ఎదుర్కోవాలి కాని....''

''అదేం కాదు. నిజంగానే నాకు పనుంది'' ఇంకోమాటకి అవకాశం ఇవ్వకుండా గదివిడిచి వెళ్ళిపోయేడు అనిల్. అతడివెనకనే తనూ బయటికి నడిచేడు రాజేందర్.

"రక్తి కట్టవలసిన సమయాన్ని మధ్యలోవచ్చి పాడుచేసేములా ఉంది. ఇంతకీ ఏమిటి సంగతి?" మరి కాస్త దగ్గరగావచ్చి అడిగింది అరవింద.

అనిల్ అన్నమాట అరవిందతో చెప్పాలనుకొంది శారద. కాని, అది ప్రస్తుతానికి మాటమాత్రమే అనీ, క్రియలోకి రావడానికి ఎన్నో అడ్డంకులు ఉన్నాయనీ మనసు హెచ్చరించింది. అందుకే వెంటనే బయటపడి తేలిపో దలచలేదు. మరికొంతకాలం గడవనీ, అనిల్ మనసు ఇంకా బాగా తెలియనీ-అనుకొంది.

శారద మౌనాన్ని ఇంకోలా అర్థం చేసుకొంది అరవింద.

"చెప్పాలని లేకపోతే చెప్పకు. నువ్వు చెప్పకపోతేమాత్రం ఆపాటి అర్థం చేసుకోలేననుకొన్నావా ? స్నేహితురాలివి కదా, మనసులోని ఆనందాన్ని కాస్త పంచి ఇస్తావేమోని" అంది కోపం నటిస్తూ.

"చెప్పడం ఇష్టంలేక కాదు అరవిందా, చెప్పడానికి ఏమీ లేక. నిజంగా ఏమైనాఉంటే నీతోకాక ఇంకెవరితో చెప్పగలను ?" అంది శారద.

# 6

అర్థ సంవత్సరం పరీక్షలు రాసి, శారద ఇంటికి వెళ్ళేప్రయత్నంలో ఉండగా తండ్రిదగ్గరినుంచి ఉత్తరం వచ్చింది—"అమ్మకి ఒంట్లో బాగాలేదు. సెలవులు ఇయ్యగానే బయలుదేరి రా" అంటూ.

ఇంటికి వెళ్ళేప్రయత్నంలోనే ఉంది కాబట్టి, శారద ఆ ఉత్తరం చూసి పెద్దగా ఏమీ అనుకోలేదు. ఇటీవలికాలంలో తల్లి ఆరోగ్యం సరిగా లేనట్లు అంతకుముందు తండ్రి వ్రాస్తున్న ఉత్తరాల్లోకూడా వార్తలు ఉన్నాయి. ఇప్పుడు ప్రత్యేకించి ఈ ఉత్తరం రాయడానికి కారణం, కిందటి సంవత్సరంలాగే ప్రైవేటు క్లాసులో ఏవో ఉన్నాయని సాకుచెప్పి ఉండిపోతుందేమో అన్న అభిప్రాయమే కావచ్చు అనుకొంది.

శారదకి ఇల్లు చేరేవరకు తల్లి ఆరోగ్యం అంతలా దిగజారిపోయిందని కాని, ఆమె నెలరోజులుగా మంచంపట్టి మందు మాకులు మింగుతున్నాదని కాని తెలియలేదు. మనిషి చిక్కి సగమై, గోడమీద పాలబల్లిలా మంచానికి అంటుకుపోయి ఉంది. తల్లిని ఆ స్థితిలో చూసేసరికి శారదకి గుండెల్లో వణుకుపుట్టింది. "అమ్మకి ఇలా ఉంటే నాకు రాసేరు కారేం, నాన్నా" అంది కంగారుతో.

"ఎలాగా సెలవులు ఇస్తున్నారు. పరీక్షలముందు నిన్ను గాభరా పెట్టడం అవుతుందని రాయలేదు" తండ్రి జవాబు చెప్పేడు.

శారద చావిట్లో కాలు పెడుతూండగానే—"వచ్చేవా, శారదా! నీకోసం రెండురోజులై అమ్మ ఊరికే పలవరించి పోతున్నాది"

రాజ్యలక్ష్మి అలా రావడంచూసి శారద ఆశ్చర్యపోయింది. అంతకాలం తరవాత అక్కని చూసింది అన్న సంతోషంకన్నా. ఇంతకాలానికేనా అక్క తమఇంటికి ఎలా రాగలిగింది అన్న కుతూహలమే మనసుని ఎక్కువగా ఊపివేసింది.

"న వ్వెప్పు డొచ్చేవు?" అంది. డబ్బుకి. ప్రాణానికి లంకె అయిన అత్తగారు గొలుసు చేయించిపెట్టందే కోడల్ని ఎలా పంపింది అని ఆలోచిస్తూ.

"మొన్న ఉదయం. అనసూయ నెలరోజులుగా ఇక్కడే ఉందిట. కిందటి ఆదివారంనాడు అమ్మకి చాలా చికాకు చేసిందిట, పిల్లల్ని చూస్తానంటూ ఒకటేగోల పెట్టిందట....అపళంగా నాన్నగారు మా ఊరువచ్చి...."

"నాన్నగారు మీ ఊరు రావడానికేం....ఇంతకిపూర్వం ఎన్ని సార్లు రాలేదు? మీ అత్త పంపింది. నాకదే ఆశ్చర్యంగా ఉంది."

"ఎందుకు పంపదు?"

"ఎందుకేమిటి? ఇంతకాలం ఎందుకు పంపలేదు?"

"వాళ్ళషరతు పూర్తయిందిగా!"

"అంటే ...నాన్న చంద్రహారాలు చేయించి...."

అవునన్నట్లు తల ఊపింది రాజ్యలక్ష్మి.

"ఎలా చేయించేరు? అప్పెక్కడ పుట్టింది?"

పైటకొంగుతో కళ్లు తుడుచుకొంటూ—"అడిగితే చెప్పలేదు" అంది రాజ్యలక్ష్మి.

అక్కవేపు పరీక్షగా చూసింది శారద. ఆడవాళ్ళకి ఆభరణాలంటే ఇష్టం అంటారు. తండ్రి తనకి గొలుసు చేయించి ఇచ్చేడు అన్న సంతోషం ఆమెముఖంలో మచ్చుకి కూడా కనిపించలేదు.

ఆమె మెడలో చంద్రహారాలు లేవు. పైకి రెండువరసల నల్లపూసలు బారుగాగుచ్చిన కుత్తికంటు ఉంది. కిందుగా పసుపుతాడుకి మంగళసూత్రాలు ఉన్నాయి.

"గొలుసు వేసుకోలేదేం?" అంది శారద.

చిన్నగా నవ్వింది రాజ్యలక్ష్మి.

"పట్నంలో ఉండి చదువుకొంటున్నావు అన్నమాటే కాని, నీకు బొత్తిగా ప్రపంచజ్ఞానం లేదే, శారదా! ఆ గొలుసు నేను అలంకరించుకోవాలనీ, ఆనందించాలనీ వాళ్ళు దానికోసం అంత పట్టు పట్టి కూర్చున్నారా? అది నాన్నగారి చేతిలోంచి నా ఒంటిని తాక కుండానే భోషాణంలోకి వెళ్ళిపోయింది. మా అత్త ఈ లోకాన్ని విడిచి వెళ్ళిపోయేముందు ఆ భోషాణంలోంచి ఎంత సొమ్ము, ఎన్ని నగలు వెంట తీసుకుపోతుందో చూడాలని ఉంది" అంది రాజ్యలక్ష్మి విరక్తిగా.

"మీ అత్త తనతో చచ్చేక డబ్బు తీసుకువెళ్ళినా, మానినా ముందు మనల్ని చంపుతున్నాది కదా! ఆ చంద్రహారాలు చేయించి ఆ పోలేరమ్మకి ముడుపు చెల్లించడానికి నాన్న ఎన్ని అగచాట్లుపడ్డారో! ఎందరెందరి కాళ్ళు పట్టేరో!" అంది శారద బాధగా.

మరి నాలుగురోజులు గడిచి ఒంటో కాస్త స్తిమితం చిక్కేక అన్నపూర్ణ కూడా కూతుర్ని అదే ప్రశ్న వేసింది—

"నా ఆరాటంకొద్దీ మీ నాన్నని తరిమేనేకాని, మీ వాళ్ళు గొలుసుపెట్టందే నిన్ను పంపుతారు అనుకోలేదే, రాజూ" అంటూ.

చెల్లెలికి చెప్పిన సమాధానాన్నే తల్లికికూడా చెప్పింది రాజ్య లక్ష్మి.

కూతురు చెప్పిన మాటలువిని తెల్లబోయింది అన్నపూర్ణ. తన జబ్బుతోనే అప్పులపాలైన భర్త—కూతురికి నాలుగు పేటల చంద్రహారాలు ఎలా చేయించిపెట్టగలిగేడు—అని ఆశ్చర్యపోయింది.

"ఎవరితో చెప్పకు. ఆ నగ అసలు బంగారంది కాదు. నకిలీది" అన్నాడు రామస్వామి.

"అమ్మో!" అంటూ రెండుచేతులతో గుండె పట్టుకొంది అన్నపూర్ణ. వాళ్ళకి తెలిసిందంటే ఇంకేమైనా ఉందా? దాన్ని నిలువునా కాల్చి చంపేస్తారు. ఎందుకిలాటిపని చేసేరు? చేచేతులా నా

బిడ్డ గొంతు కెందుకిలా కోసేరు?'' అంటూ ఏడవటం మొదలు పెట్టింది.

''నా బాధ కాస్త అర్థం చేసుకో, పూర్ణా! ఆ స్థితిలో నువ్వు తిరిగి బ్రతికి బయటపడతావనే నమ్మకం నాకు లేకపోయింది. నీ చివరి కోరిక తీర్చడానికి అప్పుడు నాకు అంతకుమించినమార్గం ఏదీ తోచ లేదు. నా బుద్ధికితోచింది మంచో, చెడో చేసేసేను. ఆపైన భగ వంతుడు ఎలా కాపాడుతాడో చూద్దాం'' అన్నాడు రామస్వామి దిగులుగా.

తల్లీ, తండ్రీ అనుకొంటున్న ఆ మాటలు శారద వింది. కనీసం ఈ పండుగ పూర్తి అయేవరకన్నా వాళ్ళు ఆ నగ బంగారంది కాదని పోల్చుకోకుండా ఉంటే బాగుండును. అమ్మ ఇంత జబ్బుపడి లేచింది. నలుగురూ నవ్వుతూ సంతోషంగా పండుగ జరుపుకోవచ్చు—అను కొంది.

శారద కోరిక భగవంతుడు మన్నించేడు. సెలవులు పూర్తి చేసుకొని ఆమె తిరిగి వెళ్ళిపోయేవరకు ఏ ఉప్పెనా ముంచుకు రాకుండా కాచేడు.

అక్కలదగ్గర వీడ్కోలు తీసుకొని రైలు ఎక్కిన శారద— 'ఇదెలా సాధ్యపడింది? ఆవలిస్తే పేగులు లెక్కపెట్టగల కాంతమ్మ నాన్నవేసిన టోపీలో ఇంత సులువుగా ఎలా పడింది?' అని ఆలో చిస్తూనే ఉంది.

మార్చి రెండోవారంలో రామస్వామిదగ్గరినుండి ఉత్తరం వచ్చింది శారదకి—రాజ్యలక్ష్మి వెళ్ళిపోయిందనీ, అనసూయ ఇంకా అక్కడే ఉందనీ.

శారదకి క్రిందటిసెలవుల్లో అక్కగారిఇంట గడపిన రోజులు, ముందుగదిలో బావగారు నడిపే ప్రేమకలాపాలు గుర్తుకొచ్చేయి. అక్క ఇంటో లేకపోతే అతడికి

కూడా అవసరం ఉండదు. భార్య పుట్టింట ఎంతకాలం ఉంటేమాత్రం ఎందుకు పట్టించుకోవాలి-అనుకొంది.

"అమ్మకి కాస్త నయంగాఉంటే అనసూయక్కనికూడా పంపేయండి. పాపం, బావగారు ఎంతకాలమని చేతులు కాల్చుకుంటారు" అని జవాబు రాసింది.

ఆ ఉత్తరం రాసేక, ఇరవైరోజులు అయినా తండ్రిదగ్గిర నుంచి మళ్ళీ ఉత్తరం రాలేదు. నాన్న ఇలా ఉత్తరాలు రాయకుండా ఎందుకు ఊరుకొన్నారు? అమ్మకి మళ్ళా జబ్బు తిరగపెట్టలేదు కదా? కంగారుపడింది శారద. "నాకేమిటో బెంగగా ఉంది. అమ్మ కెలా ఉంది? వెంటనే ఉత్తరం రాయండి" అంటూ ఇంకో కార్డు రాసి పడేసింది.

దానికి మూడోనాటికే జవాబు వచ్చింది. కాని, ఆ జవాబు రాసింది తండ్రికాదు; అనసూయ. అనసూయ దస్తూరితోవచ్చిన ఆ ఉత్తరం చదవబోతూ, 'ఇది ఇంకా ఇక్కడే కూర్చుంది. అయినా, అమ్మకి బుద్ధిలేదు. వారిఇంట పదిరోజులు ఉండి అల్లుడి వ్యవహారం చూసిందికదా? దీన్ని ఎందు కిలా నెలలతరబడి అట్టే పెట్టుకోవడం? అవసరం తీరిపోగానే పంపేస్తే సరిపోదూ?' అనుకొంది.

కవరు చింపుతుంటే తండ్రికిబదులుగా అక్క ఈ ఉత్తరం రాయవలసిన అవసరం ఏమొచ్చిందా అనే సంశయం శారద మనసులోకి వచ్చింది. ఆ ఉత్తరంలో ఉన్నవి రెండే రెండుమాటలు— "నువ్వు వెంటనే బయలుదేరి రా. చాలా అవసరం" అంటూ. ఆ మాటల్ని అటునుంచి ఇటు, ఇటునుంచి అటు ఎంతగా, ఎన్నిసార్లు తిప్పిచూసినా అంతకుమించిన వివరణ వాటిలో దొరకలేదు. అదే మాట తల్లో, తండ్రో రాసిఉంటే మళ్ళా ఏమైనా పెళ్ళిచూపుల వ్యవహారం ఏమో అనుకొనే అవకాశం ఉండేది. కాని, అక్క అలా తలా తోకా లేకుండా—"వెంటనే బయలుదేరి రా, చాలా అవసరం" అని రాస్తే దానికి కారణం ఏమిటో ఎంత ఊహించుకొన్నా శారదకి తోచలేదు.

“ఎందుకు రాసిందో—ఒకసారి వెళ్ళిరావడమే మంచిది” అంది మాలతి.

“మీ వాళ్ళకి బుద్ధిలేదు. చదువుకొంటున్న పిల్లని ఇలా మాటి మాటికి ఇంటికి రమ్మంటూ ఉత్తరాలేమిటి? ఆ తంటాలేమిటో మిగిలినవాళ్ళు చూసుకోవాలి కాని” అంది అరవింద.

అందిన మొదటిరైలు పట్టుకొని ఇల్లుచేరింది శారద. అప్పటికి కొద్దిగా చీకటిపడింది. వీథిలో దీపాలు వెలిగేయి. తమ ఇంటిగుమ్మం ముందు నిలిచి లోపల ఏమి చూడవలసివస్తుంది, ఏ మాట వినవలసి వస్తుంది అన్నట్లు క్షణకాలం గుమ్మంలో ఆగి మూసి ఉన్న తలుపుల వేపు చూసింది. మెల్లగా మనసు దిటవుపరుచుకొని, దగ్గరగా వేసి ఉన్న తలుపుతోసి లోపలికి అడుగుపెట్టింది.

ఎదురుగా వంటఇంటివసారాలో లైటు వెలుగుతున్నాది. గడప ని ఆనుకొని తల్లి కూర్చుంది. అనసూయ వంటపనిలో ఉన్నట్లు ఇటూ అటూ తిరుగుతున్నాది

'అమ్మ ఆరోగ్యం సరిగానే ఉంది.'

తల్లిని క్షేమంగా చూసేక శారద మనసులో బెంగ తీరిన ట్లయింది. చేతిసంచీని పక్కనేఉన్న అరుగుమీదపడేసి, ముందుకి నడుస్తూ—'అమ్మా!' అని పిలిచింది.

ఆ పిలుపుకి పక్కనే ఏదో పిడుగుపడినట్లు అదిరిపడింది అన్నపూర్ణ. అటు ముఖం తిప్పుకుని అనసూయతో ఏదో మాట్లాడుతున్న దల్లా ఇటు తిరిగి, ఎదురుగా శారదని చూడగానే బావురుమంటూ ఏడుస్తూ రెండుచేతులతో ముఖం కప్పుకొంది.

తల్లి ఆ ఏడుపుకి కారణం ఏమిటో ఊహించుకోలేక పోయింది శారద. ఎవరి కేమయింది? ఎంత కష్టంలో ఉన్నా ధైర్యాన్ని కోల్పోని తల్లి, ఎందు కింతలా ఏడుస్తున్నాది?

“ఏమయిందమ్మా? ఎందుకే అంతలా ఏడుస్తున్నావు? చెప్పవే, అమ్మా” అంటూ తల్లిముందు కూలబడి, ముఖాన్ని కప్పు కొన్న ఆమెచేతులు తొలగించింది. అన్నపూర్ణ ఉప్పెనలా పొంగి

వస్తున్న దుఃఖాన్ని ఆపుకోడానికి ప్రయత్నిస్తూ, "మీ నాన్నే, నా తల్లీ ....మీ నాన్నగారు" అంటూ వెక్కసాగింది.

శారద కళ్ళముందు ఉన్న వస్తువులన్నీ గిరగిర తిరగడం మొదలుపెట్టేయి. ఎదురుగా వెలుగుతున్న ఎలక్ట్రిక్ దీపం కాంతి ఎర్రగా రక్తంలా మారి, క్రమంగా నల్లబడసాగింది. తనమీద ఎవరో బండెడు నిప్పులు కుమ్మరించినట్లు అనిపించింది.

"అమ్మా!" అంటూ కొయ్యబారి తల్లి ఒడిలోకి వాలిపోయింది.

ఆ స్థితిలో కూతుర్ని చూసి హడిలిపోయింది అన్నపూర్ణ.

"శారదా....శారదా... ఏమిటే, నా తల్లీ!" అంటూ కంగారుగా కేకలు పెట్టింది.

చెల్లెలు రావడంచూసి పొయ్యికింద మంటతగ్గించి అక్కడికి వచ్చిన అనసూయ, శారదఉన్న పరిస్థితి గ్రహించింది. వెంటనే ఇన్ని నీళ్ళు తెచ్చి, ముఖంమీద చిలకరించి, "శారదా....శారదా" అంటూ ఆప్యాయంగా పిలిచింది.

కొంతసేపటికి శారద మెల్లగా కళ్ళు తెరిచింది. ఎదురుగా అనసూయ

"అక్కా!" అంటూ ఆమెని కౌగలించుకుని ఏడవసాగింది.

"కంగారుపడకు, శారదా! నాన్నకేం కాలేదు....క్షేమంగా ఉన్నారు" అంటూ ఆమెని ఓదార్చింది అనసూయ.

"అక్కా! నాన్న క్షేమంగా ఉన్నారా....ఎక్కడ....ఎక్కడ ఉన్నారు నాన్న? నాకు చూపించు, అక్కా!"

"చూపిస్తాను, అమ్మా! కాని, నువ్వు ముందు కొంచెం కోలుకో...,నిన్ను ఇలా చూసేరంటే నాన్న బాధపడతారు."

"మరి....మరి....అమ్మ ఎందు కలా ఏడ్చింది?"

"బుద్ధిలేక."

"నిజంగా నన్ను హడలకొట్టేశావు, అమ్మా! నాన్నకి బదులుగా అనసూయ ఉత్తరం ఎందుకు రాసిందా అనే అనుమానంతోనే వస్తుంటే, ఇంట్లో కాలు పెట్టగానే నీ ఏడుపు ఒకటి...."

తండ్రికి ఏమీ కాలేదు అని తెలుసుకొన్నాక ఆ కష్టం ఇంక ఎటువంటిదైనా ఎదురుకోవడానికి సిద్ధమే అన్నట్లు శారద కోలుకొంది. మరి కాస్త సమయంగడిచి శారద స్తిమితపడ్డాక అసలువిషయం చెప్పింది అనసూయ.

''నిజమా....ఇది నిజమేనా?'' అంది శారద ఆశ్చర్యంతో.

"నిజమో, కాదో ఎలా తెలుస్తుంది? నిజంకాదని రుజువైతే నాన్నని విడిచిపెడతారట.''

''నాన్న ఇటువంటిపని చేస్తారంటే నువ్వు నమ్మగలవా. అక్కా!''

''మనం నమ్మడం, నమ్మకపోవడంవల్ల లాభమేమిటి శారదా! నాన్న ఆఫీసులోంచి ఆ సొమ్ము తీయలేదని, ఏదో లెక్కల పొరపాటు వల్ల ఆ కొరత ఏర్పడిందని, లేక ఇంకెవరో కాజేసి ఆ నేరం నాన్న మీదికి తోసేరని .. ఇలాగ ఏదో ఒకటి తేలితే వదిలిపెట్టేస్తారుట, లేకుంటే శిక్ష పడుతుంది అంటున్నారు.''

ఆ రాత్రంతా తల్లీ కూతుళ్ళు ఏం చెయ్యడం, ఎలా ఈ ఆపద నుంచి బయటపడ్డం అని తర్జనభర్జన చేస్తూనేఉన్నారు. తెల్లవారేసరికి శారద ఒక నిశ్చయానికి వచ్చింది—తమకి ఆ ఆపదసమయంలో ఎవరైనా సహాయపడేవాళ్ళు ఉన్నారా అంటే వాళ్ళు—మామయ్య, మాలతిఅత్త మాత్రమే అని.

తన అభిప్రాయాన్ని తల్లికి, అక్కకిచెప్పి ఆ పదిగంటల బండికే బయలుదేరింది.

''బావలకికూడా ఉత్తరాలు రాసేము. వాళ్ళు ఈపూట వస్తారేమో....వాళ్ళు వచ్చేదాకా ఉండి వెళ్ళకూడదూ?'' అంది అన్నపూర్ణ.

"ఇటువంటి విషయాల్లో బావలు చెయ్యగలిగింది ఏమీ ఉండదమ్మా. ఏమైనా చెయ్యగలిగితే మామయ్యే చెయ్యాలి. వెంటనే ఆయన సలహా తీసుకొని ఎలా చెయ్యమంటే అలా చేద్దాం. బావలు వస్తే మిగిలిన విషయాలనుగురించి మీరు ఆలోచించండి'' అంది శారద.

శారద ఆశించినట్టే రఘునాథరావు, మాలతి ఆమెకి ధైర్యం చెప్పి, "చెయ్యవలసింది ఏమిటో మేము చూస్తాము. నువ్వు నీ చదువు సంగతి చూసుకో" అన్నారు.

*　　　　*　　　　*

రఘునాథరావు స్వయంగా వెళ్ళి రిమాండులోఉన్న రామస్వామిని కలుసుకొన్నాడు. తగిన ప్లీడర్ని పెట్టి వాదింపిస్తానని, జామీను మీద అతన్ని విడిపించేలా చూస్తానని ధైర్యం చెప్పేడు.

"నాకోసం మీరు అనవసరంగా శ్రమపడకండి, బావగారూ! ఆ సొమ్ము నేను వాడుకొన్నాను. చేసిన నేరానికి శిక్ష అనుభవించక తప్పదు" అన్నాడు రామస్వామి.

రామస్వామి అటువంటిపని చేసేడంటే రఘునాథరావు నమ్మలేకపోయేడు. కోర్టుకివెళ్ళితే సొమ్ము ఖర్చు అవుతుందని, తమ కుటుంబం ఆ ఖర్చుని భరించేస్థితిలో లేదని అతడు అలా అని ఉంటాడు అనుకొన్నాడు.

"ఖర్చువిషయం మీరేం ఆలోచించకండి. అవన్నీ నేను చూసుకొంటాను. మీరు చెయ్యవలసిందల్లా ప్లీడరుతో సహకరించి జరిగింది జరిగినట్లు, విషయాలన్నీ వివరంగా తెలియజెయ్యండి. మళ్ళా నే వస్తాను" అనిచెప్పి తిరిగివచ్చేడు.

"నాన్న అటువంటిపని ఎన్నటికీ చెయ్యరు, మామయ్యా! హఠాత్తుగా మీద విరుచుపడ్డ ఈ ఆపదతో అతని మతి చలించిఉంటుంది. లేక, ఇంకెవర్నో రక్షించడానికి ఈ నేరం తనమీద వేసుకొని ఉంటారు" అంది శారద.

రామస్వామి కేసు వాయిదాలుపడుతూ మూడు నాలుగు నెలలపాటు కిందికోర్టులో నడిచింది. రఘునాథరావు నియమించిన ప్లీడరు ఎంత గట్టివాడైనా, సాక్ష్యం అటువైపు బలంగా ఉండడంచేత, ఆ సొమ్ము తను వాడుకొన్నాడు—అన్నమాటకి మినహా ఇతరమైన వివరాలేమీ రామస్వామివల్ల తెలియకపోవడంవల్ల శిక్ష పడక తప్పలేదు.

ఈమాట విన్న మాలతి—"హైకోర్టుకి అపీలు చేస్తేనో?" అంది.

"కావాలంటే చెయ్యొచ్చు. కాని, నెగ్గుతామనే నమ్మకం నాకు లేదు, మాలతీ! నా అనుమానం ఏమిటంటే ఏ అవసరానికో ఆ సొమ్ము నిజంగా మీ అన్నయ్య వాడుకొనిఉంటాడు."

మామయ్య అత్తతో అన్న ఆమాట వింది శారద. అందు వల్లనే అటుతరవాత అతడు శారదకి ధైర్యంచెపుతూ—"ఇక్కడ ఓడిపోగానే అయిపోయిందా? హైకోర్టుకి అపీలు చెయ్యడానికి వీలుం దేమో కనుక్కొందాం" అంటే, "ఇంక అటువంటివేం పెట్టుకో కండి, మామయ్యా! గెలిచేఅదృష్టమే ఉంటే ఇక్కడే గెలిచిఉండే వారిమి....ఇప్పటికే మీరు మాకోసం అన్నివిధాలా శ్రమపడ్డారు. కాలం కలిసిరానప్పుడు అన్నీ ఇలాగే తయారవుతాయి" అనేసింది విరక్తిగా.

మామగారికి శిక్ష పడింది అన్నవిషయం తెలియగానే పెద్దల్లుడు అప్పారావు వచ్చి అన్నపూర్ణని, గోపీని తనఇంటికి తీసుకుపోయేడు. ఆఏడు వారి భూములు బాగా పండేయి. ఇంట్లో పాడి, దొడ్లో కూరా నారా ఉన్నాయి. తల్లీ, కొడుకూ ఇంత తిని ఇంట్లో పనిపాట్లు చేస్తుం టారు. వారికోసం తను పెద్దగా పెట్టవలసినఖర్చు ఉండదు. ఆపదలో ఆదుకొన్నాడు అన్నపేరు దక్కుతుంది.

ఏ మనసుతో చేసినా పెద్దబావ తల్లిని, తమ్ముడిని తీసుకు వెళ్ళడం శారదకి కొండంతబరువు దింపుకొన్నట్లు అయింది. ముందు సంగతి ఏమిటి అని ఆలోచించడానికి సందు దొరికింది.

అభిమానంతో అత్తయ్య తన చదువు ఆగిపోకుండా చూడ గలదు. కాని, తల్లి, తమ్ముడు—వాళ్ళమాటేమిటి? ఇప్పటిమట్టుకి అల్లుడిదగ్గరికి వెళ్ళినా, తల్లి ఎంతకాలం అక్కడ ఉండగలుగుతుంది? తాళికట్టిన ఇల్లాలికే ఆ ఇంట గౌరవం, ఆదరం లేవు. ఇంక ఆమెని కన్న తల్లికేముంటుంది?

ఈ శిక్షాకాలం గడిచి తండ్రి బయటపడ్డా, ఇటువంటి నేరం మీద జైలుకి వెళ్ళినవాడికి తిరిగి ఉద్యోగం ఎవరిస్తారు? అసలే అంతంతమాత్రంగాఉన్న అతని ఆరోగ్యం ఆ జైలుజీవితం పాల పడ్డాక, తిరిగి కష్టపడి పనిచేసేశక్తిని అతడిలో మిగిల్చి ఉంచుతుందా?

రాత్రీ పగలూ ఆలోచించి చివరికి ఒకనిర్ణయానికి వచ్చింది శారద. ఇంక ఈ చదువుకి మంగళంపాడి, మామయ్యసహాయంతో ఏదైనా చిన్నఉద్యోగం సంపాదించుకోవాలి. జాగ్రత్తగా ఖర్చు చేసుకొంటూ, మొదట ఊరిలో మిగిలిఉన్న అప్పుల్ని చెల్లుపెట్టి, అమ్మని, తమ్ముడినితెచ్చి కాపురం పెట్టాలి.

శారద ఆలోచన బాగానే ఉందనిపించింది మాలతికి. అభిమానంతో తను చదువుకోవాలనుకొన్నా, వారింటి బాధ్యత అంతా భర్త నెత్తిమీద రుద్దడం న్యాయంకాదు. ఈరోజుకాకుంటే రెండేళ్ళు పోయేకైనా శారద ఉద్యోగంచేసి ఆ ఇంటిని ఆదుకోవలసిందే. అదృష్టం బాగుండి ఉద్యోగం అంటూ దొరికితే పి.యు సి. కి, బి.ఎ.కి ఈ రోజుల్లో పెద్ద తేడాలేం కనిపించడం లేదు. బి.ఎ పాసైన ఎందరో నైట్ వాచర్లుగాను, కాఫీహోటల్లో కౌంటరు ముందు కూర్చున్న వాళ్ళూ ఉంటున్నారు. తనతరపు వారివల్ల భర్తకి అట్టే విసుగు పుట్టక మునుపే, అతడితోచెప్పి శారదకి ఒక ఉద్యోగం అంటూ వేయించ గలిగితే ఆ కుటుంబానికి తను చెయ్యగలిగింది చేసిందనే తృప్తి పడ వచ్చు—అనుకొంది.

*  *  *

ఆశానిరాశలు, కష్టసుఖాలు కలిసికట్టుగా తిరుగుతూ మనిషి జీవితాన్ని నడిపిస్తాయి. అనంతసుఖాలు అందుకొంటున్న మనుషుల జీవితాల్లోకూడా అణువంతవేదన ఏదో సమయాన ప్రత్యక్షంకాకుండా ఉండదు. అదేవిధంగా అష్టకష్టాల పాలవుతున్నవారి బ్రతుకుల్లో కూడా రవ్వంత ఆనందం ఏదోరూపాన తొంగిచూడకుండా పోదు.

ఆ కష్టసమయంలో, జీవితపుబాటలో ఎంతదూరానికి దృష్టి సారించినా గోతులు, గతుకులేతప్ప సాఫీ అయినదారి కనిపించని ఆ

తరుణంలో, కూతురికి ఉద్యోగం అయింది అన్నవిషయం అన్న పూర్ణకి నిధినిక్షేపాలు కంటపడ్డట్లు అనిపించింది. కాని, దానితోపాటే అందుకొన్న ఇంకోవార్త ఆ ఆనందాన్ని సగం మింగి కూర్చుంది. రఘునాథరావుకి బదిలీ అయిందనీ, వారంతా త్వరలోనే ఊరునుంచి వెళ్ళిపోతున్నారనీ ఆ సమాచారం.

వీళ్ళు వెళ్ళిపోతే శారద ఎక్కడ ఉంటుంది? ఒంటరిగా ఆడపిల్లని పట్నంలో ఉంచడం ఎలా? అంతా అక్కడ ఉండాలంటే వస్తున్న ఆ సొమ్ము సరిపోతుందా? వస్తున్నదంతా తిని కూర్చుంటే ఇంక అప్పులు తీరడం ఎలా? ఇలా ఆరాటపడుతున్న అన్నపూర్ణకి కాంతమ్మ ఒక సలహా చెప్పింది.

"మా వేలు విడిచిన పెత్తల్లి ఒకావిడ ఆ ఊళ్ళో ఉంటున్నాది. వాళ్ళింట్లో కాని ఒకగది దొరుకుతుందేమో—అబ్బాయిచేత ఉత్తరం రాయిద్దాం. ఆవిడ సరే అంటే నీ కూతురు నీ ఇంట్లో ఉన్నంత క్షేమం" అంది

ఆ వేలు విడిచిన పెత్తల్లి పేరు తాయారమ్మ. ఆవిడ కొడుకు రైల్వేలో పని చేస్తున్నాడు. అతడికి ఆరుగురు పిల్లలు. తన ఉద్యోగంలో బదిలీలమూలంగా పిల్లలచదువులు పాడవుతాయని తల్లిని, విధవ అప్పచెల్లెలు చెల్లాయమ్మని ఆ ఊళ్ళో కాపురంపెట్టి, అక్కడ స్కూళ్ళలో పిల్లల్ని చేర్పించేడు.

ఆ ఏడు పెద్దవాళ్ళిద్దరి చదువులు పూర్తయి ఉద్యోగాల్లో చేరేరు. పెద్దకూతురికి స్కూలుఫైనలు పాసుకాగానే పెళ్ళిచేసి అత్తవారి ఇంటికి అంపకం పెట్టేరు. ఇంక మిగిలింది ఇద్దరు మగపిల్లలు, కడసారపు ఆడపిల్ల.

ఇద్దరు బోడెమ్మల అధికారంకింద ఆ ఇంట్లో ఉండడం అంత సుఖమైనపని కాదని శారదకి తెలుసు. కాని అంతకు మించి అప్పుడు వేరేమార్గం కనిపించలేదు.

అరవింద హాస్టలుకి, శారద తాయారమ్మగారి ఇంటికి ఒకే రోజున బయలుదేరి వెళ్ళేరు. మరుచటిరోజునే మాలతిగారి సంసారం అంతా ఆ ఊరినుంచి వెళ్ళిపోయేరు.

రాజసౌధంలాంటి అత్తగారి ఇంట మసిలి వచ్చిన శారదకి తాయారమ్మగారి ఆ వీధిగది ఎలక కన్నంలా కనిపించింది. దానికి తోడు ఆ చిన్న మనుమరాలు రాత్రిపొద్దుక్కీ దేనికోదానికి అరున్నొక్క రాగం పాడుతుండేది. ఆ పిల్లని ఊరుకోపెట్టడానికి ఆ తల్లీ కూతుళ్ళు బోదురుకప్పల్లా నోళ్ళు పెట్టుకొని తల్లిని కూతురూ, కూతుర్ని తల్లీ కోప్పడుకొంటూ—అదంతా అదో నాటకం. అత్త, నాన్నమ్మ ఆడుతున్న ఆ నాటకం ఆ చిన్నదానికి తెలుసు. అయినా, అంతా శాస్త్రోక్తంగా జరగందే నోరు మూసేది కాదు.

మగపిల్ల లిద్దరూ మప్పితమైన వారే. తమ చదువేమో, తామేమో అన్నట్లు ఉండేవారు. పెద్దవాడి పేరు రాముడు, చిన్నవాడి పేరు భీముడు. భీముడు సన్నగా నల్లికి నరంలా ఉండేవాడు. రాముడు గుండుగా ఉండి బాబూ ఈ వయసులోనే ఇలా ఉన్నాడు. పెద్దవాడైతే ఎలా తయారవుతాడో అని అనిపించేలా ఉంటాడు.

శారద ఆ ఇంట్లో కాలు పెట్టగానే శారదక్క అంటూ వరస కలిపేసేరు మగపిల్లలు. తమకేమైనా పాఠాలు తెలియకపోతే శారదని అడగవచ్చని ఆమె తమఇంట్లో చేరడం వారికి సంతోషంగానే ఉంది. ఆడపిల్ల 'చిట్టి' మాత్రం శారద ఎప్పుడు కనిపించినా, "మా ఇంటికెందుకొచ్చేవు....పో" అనేది. ఆ పిల్ల అలా అంటూంటే 'తప్పమ్మా' అని అత్తకాని, నాన్నమ్మకాని మందలించేవారు కాదు. "పోతుందిలే, అమ్మా....పోతుంది" అనేవారు.

ఆ పిల్ల మాటల్ని కాని, పెద్దవారి ధోరణిని కాని శారద పట్టించుకోలేదు. అక్కడ తన ఉనికికి—ఎంతవరకు కావాలో అంతవరకే వారితో సంబంధం పెట్టుకోవడం చాలా అవసరమని అక్కడికి వచ్చిన మొదటిరోజునే నిర్ణయించుకొంది. అంతకుమించి బంధుత్వాలకి పోతే, వేలు చూపితే మండ మింగేరకంలా ఉన్నారు ఆ తల్లీ కూతుళ్ళు. అనవసరమైన చొరవచేసుకొని తనపై అధికారం చెలాయించడం మొదలుపెట్టవచ్చు.

ఆ ఇంట్లో పీఠ నడవని అనుకొని ఒక చిన్నగది ఉంది. అంతకుపూర్వం తాయారమ్మకూతురు చెల్లాయమ్మకి నెలనెల అవసరా

లకి అది ఉపయోగపడుతుండేది. ప్రస్తుతం ఆవిడికి ఆ బెడద తీరిపో బట్టి అది ఖాళీగా ఉండి, శారదకి వాసంగా దొరికింది. ఆ కొట్టుగదికి వీధి వరండాలోకి, నడవాటిలోకి రెండుగుమ్మాలు ఉండేవి. నడవ లోకి ఉండే గుమ్మాన్ని చాలావరకు మూసే ఉంచేది శారద.

"అమ్మడూ! బయటికి వెళ్ళేముందు ఇటునుంచి తాళం వేసు కుని వెళ్ళు. అటునుంచి ఎవరైనా కప్ప పగలగొట్టి ఇంట్లో దూరినా తెలియకుండా పోతుంది'' అనేది తాయారమ్మ.

"నా గదిలో ఎవరు జొరబడి ఏం ఎత్తుకుపోతారు లెండి" అనేసేది శారద. తాయారమ్మ అలా చెప్పడంలో అభిప్రాయం శారద రాకపోకలమీద ఒక కన్నేసి ఉంచవచ్చని. శారద జవాబుకికూడా అదే కారణం—తన స్వేచ్ఛకి ఈ ముసలివాళ్ళు ముళ్ళు వెయ్యకుండా జాగ్రత్తపడాలని.

వారానికి రెండు, మూడుసార్లయినా సాయంకాలంపూట వచ్చి వెళ్ళేది అరవింద. ఎప్పుడైనా రాజేందర్‌కూడా ఆమెతో వచ్చేవాడు. అరవింద ఒంటరిగా వచ్చినప్పుడు ఒక్కొక్కసారి ఆ రాత్రికి శారద గదిలో ఉండిపోయేది.

"ఆ హాస్టలుతిండి తినలేక చస్తున్నాను. ఏం చేసేవో పెట్టు'' అంటూ పీట వాల్చుకొని కూర్చునేది.

"ఈ తిండి నువ్వేం తింటావు? పద, అలా బయటికిపోయి ఏ హోటల్లోఅయినా తినివద్దాం'' అనేది శారద. ఎప్పుడో ఉదయ మనగా వండుకుపోయిన అన్నం, కూర—ఆ చల్లారిన తిండి అరవింద కేం పెడుతుంది?

"పెట్టాలని ఇష్టం లేకపోతే ఆ మాట చెప్పరాదూ....ఈ కబుర్లన్నీ దేనికి? అని మూతి ముడిచేది అరవింద.

ఇద్దరూ కబుర్లు చెప్పుకొంటూ ఆ ఉన్న తిండినే పంచుకొని తిని, రాత్రి ఒకే పక్కమీద రాసుకు, తోసుకు అలా పడుకొంటే, అరవింద తన తోడపుట్టినవాళ్ళకన్నా ఎంతో ఆత్మీయంగా, సన్నిహితంగా కనిపించేది శారదకి.

వారానికో, పదిరోజులకో ఒకరాత్రి శారదతో సరదాగా గడపాలని అరవింద అలా ఉండిపోయినా తెల్లవారేసరికి పక్క అమరక "అమ్మా.... అబ్బా...." అంటూ నడుం రాసుకుంటూ లేచేది.

"నే చెప్పేనా.... తల్లీ! నీ రూమ్‌కి వెళ్ళిపోయి పడుకోవే అని .... ఇదేం స్ప్రింగ్ కాట్, ఫోమ్ రబ్బరు పరుపులు అనుకొన్నావా.... ఎంచక్కా బొబ్బోవడానికి.... నా మాట వినకుండా మొండికేసినందుకు అమ్మగారికి కావలసిందే" అనేది శారద,

"మంచానికీ, పక్కకీ ఏమొచ్చింది తెగులు.... హాయిగా మహారాజావారి హంసతూలికాతల్పంలా ఉన్నాది. నీకీ మధ్య సోమరితనం బాగా బలిసిపోయి నెలకోసారేనా పట్టెడ బిగించక.... రా, నే సాయం చేస్తాను. ఒక్క నిమిషంలో బిగించి పారేద్దాం."

'నువ్వు పని మొదలు పెడితే పట్టెడ బిగియడం మాటేమో కాని, మంచమే విరిగి ఊరుకోగలదు. వద్దులే.... రేపు నే చూసుకొంటాను" అని లేవగొట్టేది శారద.

అనిల్ సాయంకాలం కాలేజీనుంచి నేరుగా శారద ఆఫీసుకి వచ్చేవాడు. ఇద్దరూ కలిసి అలా బజారులోనో, పార్కులోనో కాస్తసేపు తిరిగి ఎ:రిగూళ్ళకి వారు చేరుకొనేవారు.

ఒకరోజు కడుపులో బాగులేదని ఆఫీసుకి సెలవుపెట్టింది శారద. ఆమెని వెతుక్కుంటూ ఇంటికి వచ్చేడు అనిల్.

"ఇదేమిటి ఇలా దిగబడ్డారు!" అంది శారద, మంచంమీంచి లేచి అతడు కూర్చోవడానికి చోటు చేస్తూ.

"ఏం, రాకూడదా?"

"రాకూడదని ఎవరన్నారు?"

"అనలేదు కాబట్టే వచ్చేసేను. ఆఫీసుకి వెళితే సెలవు పెట్టేవన్నారు, మంచో చెడ్డో కనుక్కోవద్దూ మరి?"

"చాలా మంచిపని చేశారు లెండి. నాకు మరో కప్పు కాఫీ దండుక్కి"-లేచి కాఫీకి ప్రయత్నంగా స్టౌ వెలిగిస్తూ అంది శారద.

''మిమ్మల్ని చూసిపోవడానికి వచ్చేను కాని....నా కిప్పు డేం అక్కర్లేదు. లేచి రండి.''

''మీకు అక్కరలేకపోయినా నాకు కావాలి. ఈ ఉదయంనుంచి నోట్లో నీళ్ళుకూడా పొయ్యలేదు.''

''అరె....నిజంగా! ఏమిటి చికాకు....మందేమైనా వేసు కొన్నారా? ఆఫీసుకి సెలవుపెట్టేరు అంటే ఏదో బద్ధకంగా ఉండి పోలేదేమో అనుకొన్నా. నిజంగా ఒంటో బాగులేదని తెలియదు.... మీరు లేవండి. ఓ గిన్నో, చెంబో ఇస్తే ఆపక్క హోటల్లోంచి కాఫీ పట్టుకొస్తాను.''

''మీ కివ్వడానికి నా దగ్గర గిన్నెలు, చెంబులు లేవుగానీ, మీ రలా మాట్లాడకుండా బుద్ధిగా రెండునిమిషాలు కూర్చోండి. ఈ కాఫీ నోట్లో పోసుకున్నాక మిగిలిన విషయా లన్నీ అప్పుడు చెప్పు కొందాం'' అంది శారద.

చతురస్రాకారంగా ఉన్న ఆ గదే శారదకి డ్రాయింగ్‌రూమ్, బెడ్‌రూమ్, డైనింగ్‌రూమ్, డ్రెస్సింగ్‌రూమ్, కిచెన్, స్టోర్‌రూమ్— అన్నీను. ఓపక్క మంచం, బట్టలపెట్టె, ఇంకోవంక వంటసామాన్లు, మరోవైపు బట్టలస్టాండు, అద్దం, పన్నె వగైరా....మధ్యలో కాస్త జాగా మిగిలితే అక్కడే పీట వాల్చుకొని భోజనం ముగిస్తుంది.

అరవింద, అనిల్, రాజేందర్—ఎవ రొచ్చినా ఆ మంచంమీద కూర్చోవలసిందే. లేకపోతే గుమ్మంలో నిలిచి అక్కడినుండి అలా వెళ్ళిపోవలసిందే.

అనిల్, శారద కాఫీ తాగుతుంటే, అప్పుడే ఏకాదశి ఫలహారం చేసిన తాయారమ్మగారు అపసోపాలుపడుతూ అరుగుమీద విశ్రమించ డానికి వచ్చింది. శారద గదిలోంచి ఏవో మాటలు వినిపిస్తుంటే ఎవరా అన్నట్లు ఓసారి తొంగిచూసింది.

అనిల్‌తో మాటల్లోపడ్డ శారద పొద్దుపోయినవిషయం గమ నించలేదు. లేచి దీపం వెలిగించాలనే తలపు మనసులోకి రాలేదు.

శారద గదిలోంచి అనిల్ అలా తలుపు తీసుకొని బయటికి రాగానే ఆశ్చర్యంతో తెరుచుకొన్న ఆ తల్లీ కూతుళ్ళ నోళ్ళు శారద తిరిగి వచ్చేవరకు మూతపడలేదు. చెల్లాయమ్మ ఆశ్చర్యానికి కారణం అనిల్ అందమైతే, తాయారమ్మ ఆశ్చర్యానికి కారణం శారద తెగింపు

ఎక్కడో ఆఫీసుల్లో, కాలేజీల్లో ఆడపిల్లలు, మగపిల్లలు కలిపి తిరిగే రంటే అదో దారి. ఆ స్థలాలు, ఆ అవసరాలు అలాటివి. పోనీ అవి సర్దుకుపోవచ్చు. కాని, ఇలా తిన్నగా ఇంటికే పిలుచుకొచ్చి కూర్చోపెట్టుకోవడం ...ఏం కలికాలం!

శారద ఆ గదిలోకి వచ్చేక అనిల్‌కుమార్ అంతకుపూర్వం రెండు, మూడు సార్లు వచ్చిఉన్నాడు. కాని ఆ సమయాల్లో తాయారమ్మ పురాణానికి, చెల్లాయమ్మ సినిమాకి వెళ్ళిఉండడంవల్ల అతడు రావడం వాళ్ళకంట పడలేదు.

శారద గుమ్మంలో అడుగుపెడుతుంటే—"ఎవరేమిటి ఆ కుర్రాడు?" అని అడిగింది తాయారమ్మ. "మన శాఖవాడేనా?" ప్రశ్నించింది చెల్లాయమ్మ.

తల్లీ కూతుళ్ళు ఇద్దరూ ఆకులురాలిన మొద్దుల్లా అలా గుమ్మంలో నిలిచి తన్ను నిలదీసి అడుగుతుంటే శారదకు చిర్రెత్తు కొచ్చింది. ఇలా గుచ్చిగుచ్చి అడగడంలో ఉన్న అంతరార్థం ఏమిటో గ్రహించింది.

వాళ్ళకి కొరడాదెబ్బలా తగలాలని—"మన తెలుగువాడు కాడు మామ్మగారూ. ఆయన బెంగాలీవాడు" అంది. ఆ కాస్తమాట వాళ్ళముఖాన కొట్టి ఇంక మీ చావులు మీరు చావండి అన్నట్లు గదిలోకి వెళ్ళిపోయి తలుపు గడియవేసుకొంది.

ఆనెల చివర్లో మాతంగికూతురు ప్రతిమ పెళ్ళి తాతగారి ఇంట చేస్తున్నారు. ముహూర్తానికి వారం పదిరోజులు ముందుగా రమ్మని అనిల్‌కి తండ్రిదగ్గరినుంచి ఉత్తరం వచ్చింది. నెలరోజులు సెలవు పెట్టి ఇంటికి బయలుదేరాడు అనిల్.

"నువ్వుకూడా రాకూడదూ? నిన్ను తీసుకురమ్మని అక్కమరీ మరీ రాసింది. అమ్మని, నాన్ననికూడా కలుసుకొన్నట్లు అవుతుంది" అన్నాడు అనిల్.

"ఇప్పుడు రాలేను, అనిల్‌బాబూ! మీ అమ్మగారిని, నాన్నగారిని ఇలా ఈ సమయంలో కలుసుకోవడం నాకిష్టం లేదు. ముందుగా మీరు వారితో మాట్లాడండి. వారి అభిప్రాయాలు సుముఖంగా ఉంటే నేను వస్తాను. అమ్మగారిని, నాన్నగారిని తప్పక కలుస్తాను.'

"నీ ఇష్టం... తిరిగి వచ్చేలోపునే మనవిషయం నాన్నగారితో చెపుతాను. అక్కనికూడా చెప్పమంటాను...,అమ్మని ఆయనే ఒప్పిస్తారు. అమ్మ తల ఊపగానే...."

వీధిలోంచి ఎవరిదో పెళ్ళి ఊరేగింపు వెళుతున్నాది. 'మా సీతమ్మ పెళ్ళికూతు రాయెనే. ..' సన్నాయి మేళగాళ్ళు శ్రావ్యంగా వాయిస్తున్నారు. ఊరేగింపు తమనిదాటి వెళ్ళేవరకు ఇద్దరూ మౌనంగా ఉండిపోయేరు.

"మనపెళ్ళి ఇంతకన్నా ఎంతో వైభవంగా జరుగుతుంది." అంతవరకు దానిగురించే ఆలోచిస్తున్నట్లు అన్నాడు అనిల్.

తనపెళ్ళి అప్పుడే జరిగిపోతున్నట్లు, ఆ కారులో ఉన్న పెళ్ళికూతురు తనే అయినట్లు సిగ్గుపడిపోయింది శారద.

అనిల్ ఎక్కిన రైలు వెళ్ళిపోయింది. అతడు కనిపిస్తున్నంతసేపు చెయ్యి ఊపుతూ అలా నిలిచిపోయింది శారద. రైలు ప్లాటుఫారమ్ దాటి, వేగం అందుకొని ఔటరు సిగ్నలుదగ్గర మలుపు తిరిగిపోయింది. ప్లాటుఫారమ్ టిక్కెట్టు గేటుదగ్గర ఇచ్చేసి బయటికి వచ్చింది శారద.

"అమ్మా, రిక్షా....రిక్షా, అమ్మా, రిక్షా ..ఎక్కడికి వెళతారు .. రండమ్మా, రండి" అంటూ నలుగురైదుగురు రిక్షావాళ్ళు ఆమెని చుట్టుముట్టేరు.

సాయంకాల సమయం. శారద ఉండే గది స్టేషనుకి ఏమంత దూరంలో లేదు. నడిచిపోవా లనుకొంది. తను చుట్టుముట్టుతున్న

రిక్షావాళ్ళని—"వద్దయ్యా...రిక్షా అక్కర్లేదు" అంటూ తప్పించు కొంది.

ఆ పక్కనే నాలుగుగజాలదూరంలో రిక్షాలో ఎక్కి కూర్చో బోతున్నవ్యక్తి శారదమాట విన్నాడు, వెంటనే వెనుతిరిగి చూసి, ఒక్క గెంతుగెంతి కిందికి దిగివచ్చేడు, అతడు విశ్వం. "శారూ.... శారూ" అని పిలుస్తూ ముందుకి వచ్చేడు.

"ఎవరు...విస్సూ! ఎక్కడినుంచి ఇలా ...ఎప్పు డొచ్చేవు ఈ ఊరు?" శారద ప్రశ్నించింది.

"ఇప్పుడే వస్తున్నా, ఇంటినుంచే. నీ గదికి రావాలని నేను బయలుదేరబోతుంటే....నువ్వు ఇక్కడే కనిపించేవు" వెదకబోయిన తీగె కాలికి తగిలింది అన్నంత ఉత్సాహంగా ఆ మాట చెప్పేడు విశ్వం.

"ఇంతకీ నువ్వు ఇక్కడెందుకున్నావు....ఊరుకి కాని వెళు తున్నావా?"

"లేదు ...ఒక మిత్రుడిని సాగనంపడానికి వచ్చేను."

"ఎవరు? ఆ బెంగాలీ ఆయనేనా?" విశ్వం ముఖం కొద్దిగా చిన్నబోయింది.

"మరేం...అనిల్ ని నువ్వు చూసేవా?"

"పోయినసారి వచ్చినప్పుడు నువ్వేగా పరిచయంచేసింది?"

"అవును సుమా...ఆసంగతే మరిచిపోయేను...అది సరేకాని, పిన్ని ఎలా ఉంది? నువ్వేం చేస్తున్నావు?"

"ఇంటెగ్రల్ కోచ్ ఫాక్టరీలో ఉద్యోగానికి అప్లికేషన్ పెట్టే నని చెప్పేను కదూ, దానికి ఇంటర్వ్యూకి పిలుపు వచ్చింది. మద్రాసు వెళుతూ నిన్నోసారి చూసిపోదామని ఇక్కడ దిగేను."

"మరి నీ పెట్టె, బెడ్డింగు వగైరా.."

"పెద్దగా ఏం పట్టుకోలేదు. అక్కడ త్యాగరాయనగర్ లో నాన్నగారి స్నేహితుడు ఒకాయన ఉన్నారు, తమ ఇంట్లో వచ్చి ఉండమని రాసేరు. మద్రాసులో ఉండేదికూడా రెండురోజులే...ఈ సంచిలోనే రెండుజతలబట్టలు పడేసుకొన్నా."

"సరే పద. ముందు గదికి వెళదాం...నువ్వు స్నానం అదీ చేసేక కావాలంటే కాస్తసేపు ఎతైనా తిరిగిరావచ్చు'' అంది శారద.

అంతకుపూర్వం విశ్వం శారదదగ్గరికి వచ్చి ఓ పూట ఉన్నాడు. మా సావిత్రిపిన్ని కొడుకు—అని శారద పరిచయం చెయ్యగానే— "కావాలంటే రాత్రికి ఈ వరండాలో మంచం వేస్తాను. పడుకో, నాయనా'' అంది తాయారమ్మ. విశ్వం ఆ రాత్రి రైలుకే వెళ్ళిపోవడం చేత అప్పుడు ఆవిడ ఆతిథ్యం అందుకోలేకపోయేడు. "ఈసారి తాయారమ్మగారి ఆహ్వానాన్ని అందుకోవచ్చులే'' అన్నాడు విశ్వం, శారదగదిలో కాలుపెడుతూ.

శారద మూత పెట్టుకుపోయిన వంట ఇద్దరికి ఎలాగా చాలదు. అందునా ఉదయం ఆఫీసుకిపోయే తొందరల్లో అన్నంగిన్నె నీళ్ళలో పెట్టడం మరచిపోయింది. గోడమీదనుంచి గిన్నెవరకు చీమల బారులు. సుశిక్షితులైన సిపాయిల్లా చీమలు వరసలుతీరి నడుస్తున్నాయి.

శారద గిన్నెలోకి బియ్యం తీసి కడగబోతుంటే—"ఇప్పుడు వంటా పెంటా పెట్టుకోకు. అలా బయటికివెళ్ళి ఏ హోటల్లోనైనా తిని వద్దాం'' అంటూ ఆమెని ఆ పనినినుంచి వారించేడు విశ్వం.

భోజనం పూర్తి అయ్యేక, శారద విశ్వం కోరికమీద సినీమాకి కూడా వెళ్ళక తప్పలేదు. అదేదో జానపదచిత్రం. వీళ్ళు టిక్కెట్లు తీసుకొని హాలులోకి వెళ్ళేసరికి కథ మొదలయింది.

పెద్ద కిరీటం పెట్టుకొన్న రాజుగారు సింహాసనంమీంచి ఎగిరెగిరిపడుతూ, పరివారంమీద పేగులు తెగిపడేలా గొంతు చించుకొని అరుస్తున్నారు. రాజకుమార్తె కనిపించలేదని చావుకబురు చల్లగా అందించిన చెలికత్తెలు ఆ మండపంలోని రాళ్ళలాగో, ఆ సింహాసనపు కోళ్ళలాగో, ఏ భావం వ్యక్తంకాని ముఖాలతో నిలబడి ఉన్నారు. అంతలో వెతకడానికి వెళ్ళిన వేగులు రాజకుమార్తె జాడ తెలియ లేదంటూ ముఖాలు వేలవేసుకొని తిరిగొచ్చి ఆ వార్త రాజుగారికి అందించేరు.

"నా కుమార్తెను తెచ్చి ఇచ్చినవారికి నా అర్ధరాజ్యం ఇస్తాను, అంతేగాక నా అల్లుడుగా చేసుకొంటాను." ఎవరిమీదో కసీ కోపం ఉన్నట్లు అరుస్తున్నారు రాజుగారు.

రాజుగారి ఆ మాట అతడి నోటివెంట ఎప్పుడు బయటికి వస్తుందా అని ఎదురుచూస్తూ ఆ సభలో ఒకమూల కూర్చున్న ఒక యువకుడు—"మహారాజా!" అంటూ ముందుకొచ్చేడు.

"తీసుకుపో....నీకు కావలసినంత ధనాన్ని, వాహనాల్ని, ఆయుధాల్ని—ఏవి కావలిస్తే అవి. ..కాని, నా కుమార్తెను వారం తిరగకుండా నా కంట పెట్టాలి, అలా చెయ్యలేకపోయేవో..."

"నా తల నరికి కోటగుమ్మానికి వేలకట్టండి." ఆ మాట అనడానికి రాజుగారు ఎందుకు శ్రమపడ్డం అని తనే అనేశాడు ఆ యువకుడు.

రెండవసీను మాయలమరాఠీ భూగృహం. పులితోలు పరిచిన ఒక ఆసనంమీద ఇంతంత మీసాలు, అంత గడ్డం పెట్టుకొని- 'హాం, హ్రీం, హూం' అని అరుస్తూ కూర్చున్నాడు. అతడి పక్కగా ఒక భృత్యుడు నిలబడి వింజామరంతో విసురుతున్నాడు.

ఆ దృశ్యం చూసి శారద తుళ్ళిపడింది.

ఆమె అదిరిపాటు గుర్తించిన విశ్వం—"వాడి అరుపులు విని దడుసుకొన్నావా?" అన్నాడు నవ్వుతూ.

"కాదు ..ఆ పక్కనున్న నౌకర్ని చూడు."

"వాడు యజమానికి కాక అతడి గడ్డానికి విసురుతున్నట్లు ఉంది కదూ!"

"అదికాదు, విస్సూ, .వాడు...వాడు వాసు.

ఈసారి తుళ్ళిపడ్డం విశ్వంవంతు అయింది.

"నువ్వంటున్నది ఏమిటి, శారదా, వాడు..."

"అవును, విస్సూ...వాడు వాసన్నయ్యే...నాకేం సందేహం లేదు. ఆ కంటికింద పెద్ద మచ్చ చూడు. ఆ రోజు నా నీటిబొమ్మల

కాగితం ఎత్తుకుపోయేడని చందనపుబొమ్మతో కొట్టేను కదూ ? అది బాగా పుండు అయి..."

ఆ మచ్చని విశ్వంకూడా పోల్చుకొన్నాడు . అదే ఏ పెద్ద పాత్రకో అయితే ముఖంమీద మచ్చలు, గోతులు కనిపించకుండా కోటా పులిమి సాపుచేస్తారు. ఇటువంటి నౌకర్లు చాకర్లుగురించి ఎవరు పట్టించుకొంటారు ?

శారద ఇంక ఆ సినీమా చూడలేకపోయింది. విశ్వానికికూడా చూడా లనిపించలేదు. కథ ఇంటర్‌వెల్‌కి రాకపూర్వమే ఇద్దరూ లేచి వచ్చేసేరు.

ఆ రాత్రి అంతా వాసుగురించి, అతడి జీవితం అలా అయి పోవడానికి సమకూడిన పరిస్థితులగురించి ఆలోచిస్తూ ఉండిపోయింది శారద ఈ సమయంలో అన్నఉంటే ..నిజంగా అన్నయ్య ఇంట్లో ఉండి బరువు బాధ్యతలు చూసుకొంటూంటే తన కెంత ఓదార్పుగా ఉండేది ..ఎంత ధైర్యంగా ఉండేది !

"నువ్వుకూడా నాతో రాకూడదూ ? నారాయణరావుగారికి సినీమా కంపెనీలవాళ్ళని చాలామందిని తెలుసు. ఆయన సహాయంతో వాసు వివరాలు తెలుసుకోవచ్చు. మంచీ, చెడ్డా చెప్పి ఇంటికి తీసుకు రావచ్చు" అన్నాడు విశ్వం.

శారదకికూడా ఆ ఆలోచన బాగుం దనిపించింది. అప్పుడు చిన్నతనంకొద్దీ ఆ సినీమాసరదాలో పడి ఇల్లువిడిచి వెళ్ళిపోయేడు. ఆ వెనక ఆ సరదా తీరిపోయినా, తనకి అక్కడ స్థానంలేదని తెలుసు కొన్నా, అంతసొమ్ము తగలేసి తిరిగి ఇంటికి రావడానికి ముఖం చెల్లక అలా ఉండిపోయి ఉంటాడు. ఇప్పుడు కష్టం, సుఖం చెప్పి 'ఇంటికి రా, అన్నయ్యా' అంటే రాకుండా ఉంటాడా ?

ఆ ఆశతోనే విశ్వంవెంట మద్రాసు వెళ్ళింది శారద,

"తప్పకుండా ప్రయత్నిద్దామమ్మా ! అతడు మద్రాసులోనే ఉంటే ఏదో విధాన పట్టుకోలేక పోము" అంటూ శారదకి ధైర్యం చెప్పేడు నారాయణరావు.

శారద తను చూపిన సినీమా, అందులో వాసు వేసినపాత్ర— అన్నీ చెప్పింది. ఆ కంపెనీవాళ్ళకి ఫోనుచేశాడు ఆయన. అది ఎప్పుడో నాలుగేళ్ళకిందట తీసిన సినీమాట. ఇప్పుడు రెండోవిడత ఆడుతున్నాదిట. ''అయినా. ప్రయత్నిస్తాం...ఆ అబ్బాయి జాడ తెలిస్తే తెలియజేస్తాం'' అన్నారు వాళ్ళు.

నారాయణరావుగారి మాటని కాదనలేక వాళ్ళు అలా అన్నారే కాని, నాలుగేళ్ళకిందట తీసిన సినీమాలో నౌకరువేషం వేసిన పిల్లడి గురించి ఎవరు గుర్తు పెట్టుకొంటారు?

ఇటువంటిపనులు టెలిఫోన్లవల్ల అయేవి కావని, వాసుజాడ తెలుసుకోవడానికి స్వయంగా బయలుదేరింది శారద.

ఇది కాదని అది, అది కాదని ఇది—ఇలా ఎన్ని స్టూడియోల వెంట, ఫిలిమ్ కంపెనీలవెంట తిరిగినా వాసుజాడ అణుమాత్రంకూడా తెలిసిరాలేదు. వాసు అన్న ఆ పేరే విననట్లు చాలామంది మాట్లాడేరు. పోనీ పేరుకాని మార్చుకొన్నాడేమో అని, అతడి వయసుని, రూప రేఖల్ని, ముఖంమీద కంటి కిందుగా ఉండేమచ్చని—అన్నీ వివరంగా చెప్పిచూసింది శారద. అయినా ఫలితంమాత్రం కనిపించలేదు.

"ఎక్‌స్ట్రాగాళ్ళకి అడ్రసేమిటి? ఎక్కడని వెతగ్గలవు...తిండి తిప్పలు కానకుంటే తనే తిన్నగా ఇంటికొస్తాడు...వెళ్ళిపో'' అని సలహా ఇచ్చేరు కొందరు.

"ఎక్‌స్ట్రాలను సప్లయిచేసే ఈరాసామికి కాని తెలుస్తదేమో" అన్నారు ఎవరో.

శారద మనసులో చచ్చిపోతున్న ఆశ ఆ మాటతో మళ్ళీ ప్రాణం పోసుకొంది.

''ఎక్కడ? ఎక్కడుంటాడు ఆ వీరాసామి...మీ కెంతైనా పుణ్యం ఉంటుంది. కాస్త అతని అడ్రసు చెప్పిపెట్టండి'' అంటూ అక్కడ ఉన్నవారిని బ్రతిమాలింది.

అదృష్టవశాత్తు శారద వెళ్ళేసరికి వీరాసామి ఇంట్లోనే ఉన్నాడు. ఆమె ఏదో వేషంకోసమే వచ్చిఉంటుందన్న అభిప్రాయం

తో—''ఇప్పుడు టేరం లేదు అడ్రసిచ్చిపో...పనిపడితే చెపుతాను" అన్నాడు.

శారద నెమ్మదిగా తను వచ్చినపని చెప్పింది. ఆమె వేషం కోసం రాలేదని తెలియగానే, వీరాసామి—''రండమ్మా ..రండి, కూర్చోండి'' అంటూ గౌరవంగా మాట్లాడేడు.

అంతకిపూర్వం ఎందరితోనో చెప్పినసంగతే అతడితో మళ్ళీ మరొకసారి చెప్పింది శారద.

"ఇంతకాలం ఊరుకొని ఇప్పు డెందుకు వెదుకుతున్నారు?'' అని ప్రశ్నించేడు అతడు.

''అప్పట్లో నాన్నగారు కొంత ప్రయత్నంచేసేరు. కాని ఫలితం లేకపోయింది. మొన్న సినిమాలో కనిపించేడు. ఆ కంపెనీ ఇక్కడిదే. దొరుకుతాడన్న ఆశతో ఇంతదూరం వచ్చేను" అని ఆ సినీమాలో వాసు వేసినవేషం, అతన్ని పోల్చుకొన్నవిధం అన్నీ చెప్పింది.

క్షణకాలం ఆలోచిస్తున్నట్లు కళ్ళు మూసుకొని, ఎడంచేతి మండమీద కుడిచేయిపిడికిలి బిగించి గుద్దుకొంటూ, ''దొరికిపోయాడు'' అన్నాడు వీరాసామి.

''ఎక్కడ...,ఏడీ ..ఎక్కడున్నాడు?'' అంది శారద ఆత్రంగా.

అతడు లేచి లోపలికి వెళ్ళేడు.

వాసు ఇక్కడే ఉన్నాడేమో–పిలుచుకురావడానికే వీరాసామి లోపలికి వెళ్ళేడేమో? క్షణ మొక యుగంలా ఆశతో గుమ్మంవైపు చూడసాగింది శారద.

అయిదునిమిషాల్లో వీరాసామి తిరిగివచ్చేడు. అతడితోపాటు వాసు లేడు. చేతిలో ఇన్ని ఫోటోల కట్ట ఉంది. అవన్నీ 'ఎ' క్లాసు ఎక్స్ట్రాలవి. ఎక్స్ట్రాలలోకూడా ఎ. బి. సి. అని తరగతులు ఉంటారుట. 'సి' క్లాసు వాళ్ళు అంటే ఉత్సవాల్లో, ఊరేగింపుల్లో, అల్లర్లలో, దెబ్బలాటల్లో దొమ్మీగా కనిపించేవారు. 'బి' క్లాసువాళ్ళు రెండు నిమిషాలపాటు తెరమీద విడిగా కనిపించినా, వాళ్ళకి డైలాగులు వగైరా ఉండవు. 'ఎ' క్లాసువాళ్ళకి ఒకటీ అరా డైలాగులు ఉండ

టమే కాక, అప్పుడప్పుడు హీరోలకి, హీరోయిన్‌లకి డూప్‌లుగా ఉంటుంటారు. ఏ హీరోకి, హీరోయిన్‌కి ఒడ్డూ పొడుగూ ఆకృతిలో ఎవరు సరిపోతారు అని తెలుసుకొని నిర్ణయించడానికి అటువంటి 'ఎ' క్లాసు ఎక్‌స్ట్రాల ఫోటోలు వీరాసామిదగ్గర ఉంచుకొంటాడు.

ఆ బొత్తిలో ఫోటోల్ని నాలుగైదు నిమిషాలపాటు ఇటు అటు తిప్పి, అందులోంచి ఒక ఫోటో తీసి, "ఇది చూడమ్మా" అంటూ శారద ముందు పెట్టేడు.

అది వాసుదే. శారద ఏపాటి సంశయంలేకుండా వెంటనే పోల్చుకొంది

"ఇతడే. ఇతడే మా అన్నయ్య...ఎక్కడుంటాడో చెప్ప గలరా?" అంది ఆత్రంగా.

"ఇప్పుడు ఎక్కడ ఉంటాడో సరిగా చెప్పలేను కాని పది పదిహేనురోజులకి ముందువరకు పెదపాముల రాజయ్య ఇంటివెనక షెడ్డులో ఉండేవాడు" అన్నాడు వీరాసామి.

ఆ పెదపాముల రాజయ్య కోడంబాకం బజారుకి కొంచెం అటుపక్కగా ఒక సందులో ఉంటాడు. పెదపాముల అన్నది అతడి ఇంటిపేరు కాదు. అది ఒకరకంగా బిరుదునామం వంటిది.

పౌరాణికచిత్రాల్లో శివుడిమెడలో పాకడానికి, పతివ్రతలు కన్నెర్రజేస్తే పడగ వంచుకొని వెళ్ళిపోవడానికి—ఇటువంటి అవసరా లకి గుడ్డపాములు, ప్లాస్టిక్ పాములుకాక నిజమైన పాముల అవసరం ఉంటుంది. అటువంటి అవసరాలకి ఈ రాజయ్య పాములు సప్లయి చేస్తుంటాడు, కేవలం పౌరాణికాల్లో, జానపదాల్లోనే కాకుండా సాంఘి కాల్లోకూడా కథని పాములు నడిపే సన్నివేశాలు మొదలుకావడంతో రాజయ్య పాములవ్యాపారం మూడుపువ్వులు, ఆరుకాయలు అన్న తీరులో అభివృద్ధి కాసాగింది. ఇది చూసిన ఇంకో జోగయ్య అదేదో లాభసాటిగా ఉందని రాజయ్యకి పోటీగా వ్యాపారంలోకి దిగేడు. దానితో తన ఆధిక్యం తెల్పుకోడానికి 'పాముల రాజయ్య కొట్టు' అనే దానిస్థానంలో 'పెదపాముల రాజయ్య దుకాణం' అని పెట్టుకొన్నాడు.

పాముల జోగయ్యకొట్లో ఏవో రెండు మూడు జాతులకి చెందిన పాములే ఉంటాయి. పెదపాముల రాజయ్య దుకాణంలో ఎవరికి ఏ రకం పాము కావాలన్నా సప్లయి చెయ్యగలడు.

కోడంబాకం బజారుదాకా వెళ్ళేక పెదపాముల రాజయ్య ఇల్లు కనుక్కోవడం శారదకి ఏమంత కష్టం కాలేదు. ఆమె వెళ్ళేసరికి అతడు ఇంట్లో లేడు. "పాముల్ని షూటింగుకి తీసుకుపోయేడు. ఇప్పుడే వచ్చేస్తాడు. కూర్చోండి'' అన్నారు అక్కడివాళ్ళు.

ఆరుగంటలప్రాంతంలో అతడు వచ్చేడు పేదరాశి పెద్దమ్మ.. ....పెద్దమ్మ కొడుకా—అన్నట్లు మళ్ళా మొదటినుంచి కథంతా అతడితో చెప్పింది శారద.

అతడు అంతా విని, ''ఇక్కడే ఉంటాడు .... ఇప్పుడు షూటింగ్‌కి పోనాడు....వస్తే చెప్త....అడ్డరసు ఇచ్చిపొండి'' అన్నాడు.

తన అడ్రసు ఇచ్చి, వచ్చి కలుసుకోమంటే వాసు రాడని శారదకి తెలుసు. అందుకే అటువంటి తెలివితక్కువపని చెయ్యలేదు.

"ఇక్కడ నాకు ప్రత్యేకం అడ్రసంటూ ఏమీ లేదు. మీకేం అభ్యంతరంలేకపోతే వాడిగదిలోనే ఉంటాను" అంది.

''మాకేటి అబ్బెంతరం నేదు. మరో గంటకో, గడియకో రానే వత్తడు మీ అన్న. సూపిపో....అదే నల్లది'' అన్నాడు రాజయ్య.

తలుపు గొళ్ళెంతీసి లోపల కాలుపెట్టింది శారద. ఆ గది, ఆ పక్క, ఆ పెట్టె పరిసరాలు చూస్తుంటే ఆమె కళ్ళలో నీళ్ళు ఆగ లేదు. కడుపులోంచి మంటలాంటిది పుట్టుకొచ్చింది.

ఓ పక్కగా కాస్తజాగాలో దుమ్ము దులుపుకొని కూర్చుని, గోడకి జేరబడింది. ఉదయంనుంచి ఎండలో తిరిగితిరిగి అలిసిపోయి ఉందేమో ఆపాటి విశ్రాంతికే కన్ను మూతపడింది. ఆమెకి తిరిగి మెలుకువ వచ్చేసరికి అంతకుపూర్వం ఉన్న వెలుగుపోయి చీకటి ముసురుకు రాసాగింది. రాక్షసిలా మీదపడనున్న ఆ చీకటిని తరిమి కొట్టడానికి ఆ గదిలో ఓ బుడ్డిదీపమో, కొవ్వొత్తో ఏదైనా కనిపిస్తుం

దేమోనని వెతికింది. ఆ చీకట్లని చీల్చి కాంతిని ప్రసాదించడానికి ఉపయోగపడేలాంటి వస్తువులేవీ ఆ గదిలో లేవు. రాజయ్య ఇంట ఎవరినైనా కేకేసి ఒక చిన్న బుడ్డిదీపమో, కొవ్వొత్తో అడగాలనుకొంది. రాజయ్య ఇంట్లో లేడు. అతడిభార్యకి తెలుగు రాదు. శారద అడిగేది ఆమెకి తెలియదు. ఆమె చెప్పేది శారదకు అర్థం కాదు. ఇంక లాభంలేదని తిరిగివచ్చి ఆ చీకట్లోనే కూర్చుంది.

మళ్ళీ ఆమెకి చిన్న కునుకువచ్చింది. తిరిగి కళ్ళు తెరిచేసరికి ఎదురుగా వాసు ఉన్నాడు. గూట్లో కొవ్వొత్తి వెలుగుతున్నాది.

''వాసూ....అన్నయ్యా'' అంటూ ఆనందంతో లేచింది శారద.

అంతవరకు ఆమె శారద అవునా, కాదా అని సందేహిస్తున్న వాసు, ఆ గొంతుక వినగానే ''శారదా'' అన్నాడు ఉత్సాహంగా.

ఆనందం, ఆప్యాయం చుట్టుకొన్నట్లు అన్నని కౌగిలించుకొంది శారద.

అభిమానంగా చెల్లెల్ని దగ్గరికి తీసుకొన్నాడు వాసు. ''ఇక్కడికెలా వచ్చేవు....ఎప్పు డొచ్చేవు?'' ఆత్రంగా ప్రశ్నించేడు వాసు.

నిన్ను వెతుక్కొంటూ వచ్చేనని శారద చెప్పలేదు. ''ఆఫీసు పనుండి వచ్చేను, నువ్వు ఇక్కడ ఉన్నావని తెలిసి....''

వాసు తనని, తన గదిని చూసుకొన్నాడు. ఇటువంటి స్థితిలో ఉన్న అన్నగారిని చూడ్డానికి వచ్చింది చెల్లెలు. ఆ చిన్నారిచెల్లెలికి తనేం పెట్టగలడు? ఎలా ఆదరించగలడు? బాధతో అతడిమనసు విలవిల్లాడిపోయింది. తన మనసులోని భావాల్ని శారద పసికట్టకుండా ముఖం చాటుచేసుకొని, ''ఉండు, ఇప్పుడే వస్తాను'' అంటూ గదిలోంచి బయటికి వెళ్ళేడు.

అతడు అలా వెళ్ళేక అనిపించింది శారదకి—''కొంపతీసి ఆ పోవడం అలా వెళ్ళిపోడుగదా'' అని, శారద భయం నిర్హేతుకం. నిండా పదినిమిషాలు గడవకుండానే వాసు తిరిగివచ్చేడు. అతడి చేతుల్లో రెండుగ్లాసులు ఉన్నాయి. వాటిలో టీ ఉంది.

వాసు మనిషి పెద్దగా పెరగలేదు. అతడి బ్రతుకులాగే శరీరం కూడా పిందిలోనే ముదిరిపోయింది. ఒక గ్లాసు శారదముందు పెడుతూ, "తీసుకో" అన్నాడు.

ఆ సిల్వర్‌గ్లాసు మకిలిపట్టి ఉంది. అందులో ఉన్న టీ కాటు వాసన వేస్తున్నాది. అయినా ఒక్కచుక్క మిగల్చకుండా తాగేసింది శారద. అన్న స్వయంగా తెచ్చిఇచ్చిన ఆ టీ ఆమెకి అమృతంలా ఉంది. అది తాగడంతో ఎంతో బలం, ఉత్సాహం ఒంట్లోంచి పుట్టు కొచ్చేయి. ఉదయంనుంచి అలసిపోయిన శరీరానికి, మనసుకి ఊరట కలిగింది.

టీ తాగడం పూర్తిచేసి, ఒక చార్మినార్ సిగరెట్టు జేబులోంచి తీసి ముట్టించి, "ఇప్పుడు చెప్పు....ఇంట్లో అంతా ఎలా ఉన్నారు ఎక్కడ ఉన్నారు?" అంటూ ప్రశ్నించేడు వాసు.

శారద, వాసు ఇల్లువిడిచి వెళ్ళిపోయిన నాటినుండి జరిగిన సంగతులన్నీ, ఒకటికూడా విడవకుండా చెప్పింది. తండ్రి జైలులో ఉన్నాడు అన్నమాట విని అదరిపడ్డాడు వాసు. తల్లీ, తమ్ముడూ పెద్దక్కగారిఇంట తిండికోసం అవస్థలు పడుతున్నారని విన్నాక అతడికి దుఃఖం ఆగలేదు. తల్లి తనకోసం, తనకోర్కెలు తీర్చడం కోసం ఎంతగా తాపత్రయపడేది! అక్కల కళ్ళు చాటుచేసి, నాన్నతో దెబ్బలాడి తను మనసుపడ్డ తిండి, ముచ్చటపడ్డ బట్ట అమిరేలా చూసేది. అటువంటి తల్లికి, తనని ప్రాణసమానంగా చూసుకొనే అమ్మకి తనేం చేసేడు? ఆమె కష్టకాలంలో ఏవిధంగా సహాయపడ గలడు?

వాసు కళ్ళు చెమర్చడం, ఆ సంగతి తను చూడకుండా పక్కకితిరిగి చేత్తో తుడుచుకోవడం శారద గమనించింది. ఇంతకాలం గడిచినా, అన్నమనసులో కుటుంబంపట్ల ప్రేమాభిమానాలు ఇంకిపో లేదు. ఏదోవిధంగా అతన్ని ఒప్పించవచ్చు. ఈ ఊబిలోంచి బయటికి తియ్యవచ్చు—అనుకొంది.

"నువ్వు ఎక్కడుంటున్నావో, చెప్పు—రేపుఉదయం వచ్చి కలుసుకొంటాను" అన్నాడు వాసు.

శారద ఆ రాత్రి అక్కడే గడపడానికి నిశ్చయించుకొంది. అన్నని ఒప్పించి మరునాడుఉదయం వెంటపెట్టుకొని మరీ వెళ్ళాలను కొంది. ఉదయమనగా వెళ్ళినపిల్ల, రాత్రికికూడా తిరిగి ఇంటికి చేరక పోతే నారాయణరావుగారిఇంట విశ్వం కంగారుపడతాడు. తనకోసం వారు ఆరాటపడతారని తెలిసికూడా తనేం చెయ్యలేనిస్థితిలో ఉంది. ఈ పట్టున వాసుని విడిచిపోతే చేతిలోపడ్డ వస్తువుని జారవిడుచు కొన్నట్లే అవుతుంది. ఇనుము వేడిగా ఉన్నప్పుడే దెబ్బలువేసి, కావలసిన ఆకృతిలోకి మార్చుకోవాలి అది కాస్తా చల్లారిపోతే వేసిన దెబ్బ వేసినచేతికే తలుగుతుంది.

"ఇప్పు డెక్కడికీ పోను కాని.... ఆ జంబుకానా ఇలా తే.... పరుచుకొని అడ్డంగా పడుకొంటే ఇద్దరికీ సరిపోతుంది" అంది శారద.

శారద ఆ రాత్రికి అక్కడే పడుకోవాలని అలా నిర్ణయించు కోవడంతో, ఊరికే చూపిపోవడానికికాక మనసులో ఏదో పెట్టుకొనే వచ్చిఉంటుందని ఊహించేడు వాసు. అతడిఊహ నిజమే అని మరి కాస్త సమయంలోనే బయటపడింది.

ఒకానొకప్పుడు వాసు శారదకి అన్న. ఆమెకన్న అన్నిటా పెద్దవాడు. కాని, ఈనాడు అతన్నిచూస్తే ఆమెకి తనకన్న పెద్దవాడు, అన్న అని తోచడంలేదు. తనకన్న ఎంతో చిన్నవాడులా, లోకం పోకడ తెలియని పసివాడులా అనిపిస్తున్నాది. అటువంటి మనసుతోనే అన్నకి ఎన్నో బుద్ధులు చెప్పింది. మంచీ చెడ్డా బోధించింది. ఇంటికి పెద్దకొడుకుగా అతడు తీర్చవలసిన బాధ్యతలు గుర్తుచేసింది. తల్లీ, తండ్రి అతడిమీద పెట్టుకొన్న ఆశలు చెప్పింది. అన్నిటికి చివరగా-"నువ్వు డబ్బు గడించినా, గడించకపోయినా నాకేం చింతలేదు, అన్నయ్యా, నువ్వు నా పక్కన ఉండు. ఈ కుటుంబభారం అంతా నే మోస్తాను. నన్ను ఒంటరిదాన్ని చేసేకు, అన్నయ్యా. నీ కిది న్యాయంకాదు" అంటూ కళ్ళనీళ్ళతో ప్రతిమాలింది.

వాసుకికూడా చెల్లెలికి చెయ్యి ఆసరా ఇయ్యాలని ఉంది. కుటుంబాన్ని ఆదుకోవాలని ఉంది. కాని, శారద చెబుతున్నమార్గం

మాత్రం అతడికి నచ్చలేదు. మంచికో, చెడుకో తను ఈ సినిమా ప్రపంచంలో కాలు పెట్టేడు. అభివృద్ధి అంటూఉంటే ఎప్పటికైనా దీనిలోనే తెచ్చుకోవాలి. ఈనాడు వెండితెరమీద వెలిగిపోతున్న పెద్ద వాళ్ళతో చాలామంది మొదట్లో ఇలా పాట్లుపడి పైకి వచ్చినవారే. తను తారాపథానికి అందుకొన్నాక ఫలానా హీరోగారు ఒకానొక సమయంలో పెదపాముల రాజయ్య పెరటివైపు పాకలో ఉంటూ, స్వయం కృషిచేత ఇంత అభివృద్ధిలోకి వచ్చేరని ప్రేక్షకులు కథలుగా చెప్పుకోవాలి.

ఎద్దు ఎప్పుడూ ఒకేపక్క పడుకోదు. రాత్రివెనక పగలు రాకుండా ఉండదు. మామూలుప్రదేశాల్లో పన్నెండుగంటల కోసారి ఈ మార్పువస్తే ధ్రువప్రాంతాల్లో ఆరునెలలు పడుతుంది. ఆరునెల్లకయినా రాత్రి పగలుకి దారితీస్తుందని తెలిసినప్పుడు ఆ ఆరునెల్లు వేచి ఉండడంలో నష్టం ఏముంది?

ఈ రోజుతో తనరాత తిరిగింది. తనకి మంచిరోజులు వస్తున్నాయి. ఇంతకాలం అష్టకష్టాలుపడి సిరి అందుకోబోతున్న ఈ తరుణంలో దీన్ని వదులుకొనిపోవడం అడుగుల బడనున్న అదృష్టాన్ని తన్నుకుపోయినట్లే అవుతుంది. వాసు ఆలోచనలు ఈ తీరులో నడిచేయి.

''నామాట విను, వాసూ! ఈ తెలుగు సినీమాప్రపంచంలో హీరోలని చేతివేళ్ళమీద లెక్కపెట్టవచ్చు. నీలాంటి ఎక్స్ట్రాలు.... నీకన్న మెరుగైనవాళ్ళు. వారికన్న పై మెట్టుమీద ఉన్నవాళ్ళు కోకొల్లలుగా ఉన్నారు.

"ఇందులో కాలుపెట్టిన ప్రతివాడు నాగేశ్వర్రావు, రామారావు అయిపోలేడు. ఇంతకాలం అనుభవంవల్లనైనా ఈపాటికి నువ్వు ఆది గ్రహించుకొని ఉండవలసింది. నామాట విను....ఇదంతా భ్రాంతి... ఒకవిధమైన ఆకర్షణ, జ్వాల, ప్రలోభం. కలిసిరాని ఈ ఆకర్షణలో, ప్రలోభంలో పడి నీ నిండుజీవితాన్ని నాశనం చేసుకోకు. ఇన్నిరోజులుగా నీవు ఇందులో ఉన్నావు. దీనిలో పొందిన లబ్ధి ఏమిటి....అభివృద్ధి ఏమిటి? ఏదోరోజున పెద్ద హీరో అయిపోతావనీ, డైరెక్టర్లు,

ప్రొడ్యూసర్లు నీ ముందు తిరువీథులు తిరుగుతారనీ, భవిష్యత్తుపై నమ్మకం, రేపులో ఆశ ఉండడం మంచిదే....కాని, ఆ ఆశలకి ఒక ఆలంబన ఉండాలి. నేలవిడిచిన సాము కాకూడదు జీవితం. నీ శక్తి ఏమిటో నీకు తెలుసు. ఇందులో అభివృద్ధిపొందడానికి నీకున్న అవకాశా లేమిటో నీకు తెలుసు. నిన్ను నువ్వు మోసంచేసుకోకు, అన్నయ్యా! సత్యంతో దాగుడుమూతలు ఆడకు....జీవితాన్ని ధైర్యంగా ఎదుర్కో!

"నీకన్న చిన్నదానిని ...పరిస్థితి ఇంకోలాఉంటే నీ సలహాలు పొందవలసినదాన్ని. నీ ఆజ్ఞలు పాటించవలసినదాన్ని....కాని, బాధ్యతలు నా వయసుతో సంబంధంలేని పెద్దరికాన్ని నాకు అంటకట్టేయి. ఈ బరువు నాకు మొయ్యక తప్పదు. అందుకే ఈ రోజు నీ కింతలా చెపుతున్నాను. నా మాటల్నికాక వాటి వెనకగాఉన్న ఆరాటాన్ని అర్థం చేసుకో...."

శారదకంఠం పూడుకుపోయింది. కళ్ళంట నీళ్ళు బొటబొట కారసాగేయి. ఆమెచేతిని తనచేతిలోకి తీసుకొని ఏదో చెప్పాలనుకొన్నాడు వాసు. అతడి కంఠంకూడా దుఃఖంతో భారంగా ఉంది. దాన్ని అణిచిపెట్టుకొని మాట్లాడబోతే మాట తిన్నగా రాక జీరబోయింది. మెల్లగా, ఆప్యాయంగా చెల్లెలి చెయ్యి నొక్కుతూ, "పడుకో, శారదా, రేపు ఆలోచిద్దాం" అన్నాడు.

ఆ కాస్తమాటకే పొంగిపోయింది శారద. తనజీవితం పణంగాపెట్టి పోరాడిన దేనిలోనో ఘనవిజయం పొందినంతగా తృప్తి చెందింది. ఒక్కసారిగా ఆమెకి కొండంతధైర్యం వచ్చింది.

సరాసరి అన్నని వెంటబెట్టుకొని తల్లిదగ్గరికివెడితే ఆమె ఎంతగా ఆనందిస్తుందో ఊహిస్తూ, ఆ ఊహల్లో తామంతా కలిసి మళ్ళీ సంతోషంగా, ఆనందంగా ఒక ఇంట్లో ఉన్నట్లు కలలుకంటూ నిద్రపోయింది. తనచేతిలో అన్నచెయ్యి వెచ్చగా, ఆత్మీయంగా ఆ రాత్రి పొద్దుక్కి అలా తగులుతూనే ఉంది.

శారదకి తెలివి వచ్చేసరికి బాగా ఎండ ఎక్కింది. ఎక్క బజా-ర్లోంచి బళ్ళు, బస్సుల రొదలు, అమ్మకాలవాళ్ళ అరుపులు, చెవులు చిల్లులుపడేలా కాఫీ హోటల్లోంచి వినిపిస్తున్న గ్రామఫోను రికార్డు పాటలు—ఇన్ని ధ్వనులమధ్య, ఇంతపొద్దు ఎక్కేవరకు, ఇంత మొద్దు నిద్దర ఎలా పోగలిగింది? ఆశ్చర్యపోతూ పక్కమీద లేచికూర్చుంది శారద.

ఇటు తిరిగిచూస్తే వాసు పక్కమీద లేదు. గదిలో ఎక్కడా కనిపించలేదు. అతడు ముందురోజు వేసుకున్న పాంటు, షర్టుకూడా కొయ్యకి లేవు. 'వాసు ఎక్కడికి వెళ్ళేడు?' శారదమనసు క్షణకాలం కలవరపడింది. మళ్ళీ అంతలోనే ధైర్యంతెచ్చుకొని, 'నిన్నా ఇలాగే అనుకొన్నాను. కాలకృత్యాలు తీర్చుకోవడానికో, టీ తేవడానికో వెళ్ళి ఉంటాడు' అనుకొంది.

అరగంట గడిచినా వాసు రాలేదు. ఒక్కొక్కనిమిషం గడుస్తున్నకొద్దీ శారద మనసుమీద ఒక్కొక్కమణుగు బరువు పేరుకు పోతున్నాది. అన్న రాకకోసం ఎదురుచూస్తూ ఆ గదిలో అలా కూర్చో లేకపోయింది. తల పోగుచేసుకొని, చీరె సరిచేసుకొని బయటికివచ్చి చూసింది. ఎదురుగా అరుగుమీద రాజయ్య కనిపించేడు.

''వాసు ఎక్కడికి వెళ్ళాడో మీక్కాని తెలుసా?'' అని అతన్ని ప్రశ్నించింది.

''సీకటనే పోనాదే....సూటింగున్నదన్నాడు...సెప్పిపోలేదా?'' అన్నాడు అతడు.

శారద కాళ్ళు గడగడలాడేయి. ఇంక అక్కడ నిలిచేశక్తి లేక గదిలోకి తిరిగివచ్చింది. తనకోసం ఏమైనా రాసిపెట్టేడేమో అని అటు ఇటు చూసింది. ఆమె ఊహ నిజమే అయింది. వాసు పడుకొన్నవైపు జంబుకానామీద ఒక చిన్నకాగితం మడిచిఉంది. వణుకుతున్నచేతులతో ఆ కాగితం అందుకొని చదివింది.

నన్ను మన్నించి నువ్వు వెళ్ళిపో, శారదా. నేను నీతో రాలేను. చెపితే బాధపడతావని, నీ బాధ చూడలేక ఇలా చెప్పకుండా వెళ్ళిపోతున్నాను.

నేను ఎంచుకొన్న ఈ మార్గంలో ఏదోరోజున నేను ఉన్నతిని అందుకోగలనని—ఆ నమ్మకం నాకు గట్టిగా ఉంది....ఆ రోజు ఎంతో దూరంలో లేదనికూడా. నన్ను చూసినట్లు అమ్మకు చెప్పకు...ఏడుస్తుంది.

—వాసు."

# 7

ఎంతో ఆశతో వెళ్ళిన శారద అంతులేని నిరాశని మోసుకొని వెనక్కి వచ్చింది. కళ్ళు మూసినా, కళ్ళు తెరిచినా వాసు ఉంటున్న ఆ చోటు, అతడిరూపు కళ్ళముందు తిరగసాగాయి. ఇంత కన్న మద్రాసు వెళ్ళకుండాఉంటేనే, అసలు ఆ రోజు విశ్వంతో ఆ సినీమా చూడకుండాఉంటేనే బాగుండిపోయేది. బ్రతికిఉంటే ఎక్కడో సుఖంగానే బ్రతుకుతూ ఉండిఉంటాడనే తృప్తి, లేకపోతే ఈ ఆశ లకి, బాధలకి అతీతంగా తరలిపోయి ఉంటాడనే నిర్లిప్తత మనసులో ఉండేది. కాని, ఇప్పుడు అలాకాదు.

వాసు ఎంచుకొన్న జీవితం చూసింది; అది అతనిచుట్టూ కల్పిస్తున్న మాయని చూసింది. అతడు బ్రతుకుతున్న బ్రతుకు చూసింది. అన్నీ చూసికూడా అతన్ని ఆ వ్యామోహంనుంచి బయటికి లాగలేక పోయింది. శారదకి తనమీద తనకి కోపం వచ్చింది. తన చేతకాని తనానికి ఏడుపు వచ్చింది.

ప్రతిమ పెళ్ళికి వెళ్ళిన అనిల్ ఇంకా తిరిగిరాలేదు. మొదట్లో అనుకొన్నట్లు ఆ వారంలో రావడం పడదని, బహుశా నెలాఖరికి రాగలననుకొంటానని ఉత్తరం రాసేడు.

అరవిందకి పరీక్షలు మొదలయేయి. తిరగడం, కబుర్లు తగ్గించి చదువుమీద మనసు లగ్నం చెయ్యసాగింది. మాట్లాడేందుకు

మనుషులులేక, ఆఫీసు వదిలేక చేసేందుకు పనిపాట్లులేక శారదకి తోచడం మానేసింది.

ఓవారం సెలవుపెట్టి ఎక్కడికైనా పోయివస్తే? కాని, పోవాలనుకొన్నా ఎక్కడికి పోతుంది? వెళితే చిన్నక్కగారింటికి వెళ్ళాలి. లేకుంటే తల్లిదగ్గరికి వెళ్ళాలి. ఆ రెండుప్రదేశాల్లో ఎక్కడికి వెళ్ళినా తన ఆరాటం తగ్గటానికిబదులు ఎక్కువ అయే పరిస్థితులే ఉన్నాయి.

ముందురోజు తల్లిదగ్గరినుంచి ఉత్తరం వచ్చింది—ఆ నెల గవరయ్యసెట్టి బాకి ఎందుకు చెల్లుపెట్టలేదని సంజాయిషీ అడుగుతూ. తను అన్నను కలుసుకోవడానికి మద్రాసు వెళ్ళినట్లు రాయలేదు శారద. చీరలన్నీ బాగా పాతపడిపోయేయి. కొత్తవి కొనుక్కోవాలని ఉంచేసేను—అంటూ జవాబు రాసింది.

ఉత్తరం రాసి పడేసేక ఒకసారివెళ్ళి తల్లిని, తమ్ముడిని చూసి రావాలన్న కోరిక శారద మనసులోకి వచ్చింది. దానికి సరిగా అడిగిందే తడవుగా ఆఫీసులో సెలవుకూడా దొరికింది. ఆఫీసునుంచి తిరిగివస్తూ అరవింద హాస్టలుకివెళ్ళి, తన ప్రయాణంవిషయం చెప్పింది.

"ఏమిటి విశేషం?" అంది అరవింద.

"విశేషం ఏమీ లేదు. చాలారోజులయింది. అమ్మని వాళ్ళని ఓసారి చూసిరావాలని."

"ఈ నెలాఖరుకే నేను వెళ్ళడం....ఆలోగా వస్తావు గదూ?"

"అన్నిరోజులు ఎక్కడ ఉంటాను? వారం నాటికల్లా తిరిగి వస్తాను."

మరి కాస్తసేపు కూచుని, శారద లేచి రాబోతూంటే అరవింద బాగ్‌లోంచి అయిదు పదిరూపాయల నోట్లుతీసి శారదచేతిలో పెట్టింది.

"ఇదెందుకు....ఖర్చులకి ఉంది" అంది శారద.

"రాజూ పిల్లలూ ఉన్నారు....గోపీ ఉన్నాడు. ఏమైనా కొని తీసుకుపో."

ఎప్పుడైనా అవసరంపడితే అయిదూ, పదీ అరవింద నడిగి తీసుకోవడం శారదకి అలవాటే. అలా ఆమెదగ్గర సొమ్ము తీసుకుంటున్నప్పుడు ఎవరో పైవారిని అడిగినట్లు ఉండదు ఆమెకి. అవసరం పడితే తన అక్కనో, అమ్మనో అడిగినట్లే అనిపిస్తుంది. మారు మాటలేకుండా ఆ సొమ్ము పుచ్చుకొని బాగ్‌లో వేసుకొంది.

బస్సుస్టాపుదాకా శారదతోపాటు నడిచింది అరవింద. ఆట్టే సేపు ఎదురుచూడ నక్కరలేకుండానే శారదకి కావలసిన నంబరు బస్సు వచ్చింది.

కదిలిపోతున్న బస్సులోంచి చెయ్యి ఊపుతూ, "ఊరునుంచి తిరిగిరాగానే వస్తా, అరవిందా!" అంది శారద.

అరవిందకూడా చెయ్యి ఊపింది. ఆ పగటివెలుగులో అరవిందముఖం బాగా వాడిపోయి ఉన్నట్లు కనిపించింది శారదకి. చాలా రాత్రివరకు మేలుకొని చదువుతున్నాదిలా ఉంది. ఈ పదిరోజులకే బాగా నీరసపడిపోయింది అరవింద—అనుకొంది.

శారద చిన్నక్కగారి ఇంటిముందు రిక్షా దిగేసరికి ఇంకా పూర్తిగా చీకటి పడలేదు. ఓరవాకిలిగా వేసిఉన్న వీథితలుపువైపు ఒకసారిచూసి, రిక్షావాడికి కూలిడబ్బులు ఇచ్చేసి, పెట్టె చేత్తో పట్టుకొని ఇంట్లోకి నడిచింది శారద.

పెరటివాసలో వంట ఇంటికి పక్కగా ఎవరితోనో మాట్లాడుతున్నాది అనసూయ. శారద అడుగులచప్పుడు విని ఆ రెండోవ్యక్తి ఆదరా బాదరా పక్కకి తప్పుకొని, మేడమెట్లపక్కగా ఉన్న వరండాలోంచి చావిట్లోకివచ్చి చరచరా వీథిలోకి వెళ్ళిపోవడం కనిపించింది.

ఎదురుగా శారదనిచూసి కొండంతబరువు దింపుకొన్నట్లు నిట్టూర్చింది అనసూయ.

"నువ్వాటే శారదా....ఇంకా ఎవరో అనుకొన్నాను. ఉత్తరం పత్తరంలేకుండా ఇలా ఊడిపడ్డావేం?" అని ఉత్సాహంగా పలకరించింది.

శారద అక్క ప్రశ్నకి జవాబు చెప్పలేదు. ఆమెదృష్టి ముఖం చాటుచేసుకొని అలా వెళ్ళిపోయినవ్యక్తిమీద ఉంది.

"ఎవరేమిటి ఆ వెళ్ళింది?" అంది వీథిగుమ్మంవైపు చూస్తూ.

"ఎవరు....ఎక్కడ?" అంది అనసూయ.

"అదే ...నన్నుచూసి పక్క వరండాలోంచి తప్పుకొని...."

"ఓ....అదా? లలిత."

"అదేమిటి....నన్నుచూసి లలిత తప్పుకుపోవడమేమిటి? ఉండు, పిలక పట్టుకొని లాక్కొస్తాను" అంటూ వీథి గుమ్మంలోకి పరుగుపెట్టింది శారద.

రోడ్డుమీద ఇటూ అటూ ఎంతోమంది మనుషులు తిరుగుతున్నారు. కాని, వారిలో లలితవంటి పిల్లమాత్రం కనిపించలేదు. అప్పటికే ఆమె ఏ ఇంట్లోకో దూరిపోయి ఉంటుంది; ఏ సందులోకో మళ్ళిపోయి ఉంటుంది. మరోసారి ఇటూ అటూ కలయచూసి, అక్కడ లలిత లేదని తీర్మానించుకొని ఇంట్లోకి తిరిగివచ్చింది.

"వెళ్ళిపోయిందా?" అంది అనసూయ.

"ఆఁ" అంది శారద. "ఇంతకీ ఏమిటి కథ? నన్నుచూసి ఎందుకు పారిపోయింది?"

"నువ్వనుకోలేదే...మీ బావగారేమో అనుకొని..."

"బావైతేమాత్రం....బావదగ్గర లలిత భయపడ్డం....ఇదెప్పటినుంచి?"

"భయంకాదే, శారదా! విషేధం."

"అదేమిట?"

"అదంతా పెద్ద కథ...తాపీగా చెప్పుకోవాలి...ముందు నువ్వు లేచి కాళ్ళు, చేతులు కడుక్కురా. ఆ లోపున నేను కాఫీ కలిపి తెస్తాను" అంటూ అనసూయ వంట ఇంటొకి వెళ్ళింది.

శారద కాఫీతాగి కాస్త స్తిమితపడ్డాక లలితకథ చెప్పింది అనసూయ. లలితకి ఆరునెల్లక్రిందట పెళ్ళయింది. అమ్మ, నాన్న

చూసిన పెళ్ళికొడుకుచేత మెడలో తాళి కట్టించుకుంటే ఈపాటికి ఏ చీకూ చింతా లేకుండా అత్తింటికి, పుట్టింటికి వెళ్ళివస్తూ అందరి ఆడ పిల్లల్లాగే ఉండేది. కాని, డబ్బే ప్రధానంగాచూసి ఒక దున్నపోతుని పెళ్ళికొడుకు అని తెస్తే, పెళ్ళిపేరుతో అతడిముందు తల వంచి ఉరి తాడు తగిలించుకోలేక రాత్రికిరాత్రి ఇల్లువదిలి వచ్చేసింది. తనంటే మనసున్నవాడిని, తనకి ఇష్టమైనవాడిని పెళ్ళి చేసుకొంది. అలా తెగించి చేసుకొన్నవాడైనా తమ శాఖవాడు, తమ కులంవాడు కాక పోవడంతో వచ్చింది అసలు చిక్కు.

కులం కానివాడిని చేసుకొందని అటు లలిత తలిదండ్రులు, రావలసిన కట్నం రాకుండా ఎవరో ఊరూ పేరూ లేనిదాన్ని చేసు కొన్నాడని అటు రాజంరాజు తరపువారు తిట్టిపోసేరు. రెండువైపుల వాళ్ళు అంతో ఇంతో ఉన్నవాళ్ళే అయినా, ఈ నవదంపతులని ఆదుకోలేదు.

వాళ్ళు ఆదుకొంటారనీ, నెత్తిన పెట్టుకొంటారనీ వీళ్ళూ అనుకోలేదు. అందుకే దానికంతగా బాధపడలేదు. తమశక్తినిబట్టి ఒక ఇల్లు చూచుకొని కాపురం పెట్టుకొన్నారు. అది అలా సాగిపోతే వాళ్ళు కాని, వాళ్ళ శుభంకోరేవారుకాని బాధపడ్డానికి, విచారించడానికి ఏమీ లేకపోవును. కులాంతర వివాహంవల్ల ఏర్పడేపరిస్థితులు ఎదు ర్కోవడానికి సిద్ధపడే వాళ్ళు పెళ్ళి చేసుకొన్నారు.

అయితే, ఇక్కడ అనుకోనిసంఘటన ఒకటి జరిగి వారిని ఇరుకున పెట్టింది. దేవుడనేవాడు ఒకడు ఉండి ఉంటే, అతడుకూడా పెద్దలవైపు మొగ్గి ఈ పిన్నల్ని ఒక నొక్కునొక్కేడు అని చెప్ప వచ్చు. రాజంరాజు పనిచేస్తున్నసంస్థలో ఏర్పడ్డ ఉద్యోగాలకోత మూలంగా అతడిఉద్యోగం పోయింది. ఆ కాస్త ఆసరా తొలగిపోయే సరికి చేతిలో డబ్బులేక, ఆదరించే మనుషులు లేక చెట్టుని వీడిన పక్షుల్లా అయిపోయేరు. కాని, అంతమాత్రాన వాళ్ళు బెదిరిపోలేదు. ఉద్యోగప్రయత్నాలు చేస్తున్నారు. లలితకో, రాజంరాజుకో—ఇద్దరిలో ఒకరికి చిన్న నౌకరీ దొరికినా వారి నైతికబలం దెబ్బతినకుండా నిలిచే